# MAP OF GODAVARI BASIN

(SHOWING MAJOR AND MEDIUM PROJECTS)

MADHYA PRADESH

MAHARASHTRA

CHATTISGARH

ORISSA

TELANGANA

ANDHRA PRADESH

KARNATAKA

BAY OF BENGAL

NAME OF SUB-BASINS

| | |
|---|---|
| G-1 | UPPER GODAVARI |
| G-2 | PRAVARA |
| G-3 | PURNA |
| G-4 | MANJRA |
| G-5 | MIDDLE GODAVARI |
| G-6 | MANER |
| G-7 | PENGANGA |
| G-8 | WARDHA |
| G-9 | WAINGANGA |
| G-10 | LOWER GODAVARI |
| G-11 | INDRAVATI |
| G-12 | SABARI |

LEGEND

- River
- Stream
- State Boundary
- Boundary According to Polavaram Ordinance
- Basin Boundary
- Sub Basin Boundary
- Project Sites
- Major Projects
- Medium Projects

NOT TO SCALE



MAP SHOWING GODAVARI BASIN

# MAP OF KRISHNA BASIN

MAHARASHTRA

KARNATAKA

TELANGANA

ANDHRA PRADESH

BAY OF BENGAL

HIPPARGI BARRAGE

ALMATTI DAM

NARAYANPUR DAM

TUNGABHADRA DAM

NAGARJUNA SAGAR PROJECT

PULICHINTALA

PRAKASAM BARRAGE

LEGEND

- River
- Stream
- State Boundary
- Basin Boundary
- Sub Basin Boundary
- Project Sites
- Projects Contemplated

NOT TO SCALE

GOVERNMENT OF TELANGANA
IRRIGATION & CAD DEPARTMENT



MAP SHOWING PROJECTS IN KRISHNA BASIN

# సాగునీటి రంగంలో
# తెలంగాణ పదేండ్ల ప్రస్థానం

శ్రీధర్‌రావు దేశ్‌పాండే




ప్రచురణ

తెలంగాణ వికాస సమితి

మే, 2025

# సాగునీటి రంగంలో
# తెలంగాణ పదేండ్ల ప్రస్థానం


## శ్రీధర్‌రావు దేశ్‌పాండే

**సూపరింటెండింగ్ ఇంజనీర్ (రిటైర్డ్)**

ఇం.నెం. 7-126,
శ్రీశ్రీ ఎవెన్యూ, గుర్రం గూడ,
బాలాపూర్ (మం), రంగారెడ్డి జిల్లా,
తెలంగాణ, PIN : 501510.
9491060585
Email : deshpandesri@gmail.com



**మొదటి ప్రచురణ :** మే 2025

**వెల :** 100/-

**ప్రచురణ :**
తెలంగాణ వికాస సమితి
హైదరాబాద్.
సెల్ 9700302973

**పుస్తకాలు దొరుకుచోటు :**
అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు





**ప్రింటింగ్ :**
**శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్,**
1-1-651/8, గాంధీనగర్,
హైదరాబాద్-500 080.
సెల్: 9866381116

## సాగునీటి రంగంలో
## తెలంగాణ ఉజ్వల ప్రస్థానికి ఒక సాధికారికమైన డాక్యుమెంట్



**- సింగిరెడ్డి నిరంజన్ రెడ్డి,**
మాజీ వ్యవసాయ శాఖ మంత్రి

ఇది నీళ్ల ముచ్చట
నది నీటిని బీడు భూములకు మలుపడం అంటే.. నీటి యుద్ధాన్నిగెలవడమే !
కొందరి గళాలే అయోమయం
నీళ్లెప్పుడు నిజమే మాట్లడుతాయి
మనిషి ఓడిపోవడమంటే
నీళ్లు లేకపోవడమే !
నీరే జీవరాశికి మూలాధారం.

మానవుడే కాదు నీటి నుండే జీవ పరిణామక్రమం ప్రారంభమవుతుంది. ఆధునిక మానవుడి యొక్క అవసరాలు గానీ, ఇతర చరాచర జీవులకు గానీ నీరే అత్యంత ప్రాధాన్యమైనటువంటిది. నీటి లభ్యతపైనే మానవ వికాసం ఆధారపడి ఉంది. నదుల పరిసరాల్లోనే మానవ నాగరికతలు వెల్లి విరిసాయి. ఈ ఆధునిక సాంకేతిక యుగంలో మరింత నీటి ఆవశ్యకతను ప్రపంచం గుర్తించింది. ప్రపంచంలో మనకు ఉన్న నీటిలో కేవలం మూడున్నర శాతం నీరు మాత్రమే మానవ వినియోగానికి అనుకూలమైనది. మిగతా నీరంతా సముద్రాలు, గ్లేసియర్స్ వంటి వివిధ రూపాలలో ఉంటుంది.

ఉన్న కొద్దిపాటి మంచినీరు (సాగునీటికి, తాగునీటికి, ఇతర మానవ అవసరాలకు ఉపయోగపడేవి) అనేక నదీనదాలు, జలపాతాలు, వాగులు, వంకలు, జలాశయాలు, చెరువులు, కుంటలు, భూగర్భ జలాల రూపంలో ఉంటాయి. ఇన్ని రూపాల్లో ఉండే నీటిని వ్యవసాయ, పారిశ్రామిక, తాగునీటి అవసరాల కోసం ప్రపంచమంతా ఉపయోగిస్తున్న విషయం అందరికీ తెలిసిందే. భౌగోళికంగా తెలంగాణకు ఉన్న పరిస్థితులలో కృష్ణా, గోదావరి నదులు ప్రదానమైనవి. ఈ రెండు నదులు తెలంగాణ మీదుగా ప్రవహించినా "మీరు ఎత్తుగడ్డ మీద ఉన్నారు, నీరు పల్లమెరుగు కాబట్టి మీకు నీళ్ళు రావు" అని మనలను మత్యరించి అనేక దశాబ్దాల కాలం నదీ జలాలను తెలంగాణ ప్రాంతానికి వినియోగించడంలో సమైక్య రాష్ట్ర పాలకులు ఉద్దేశపూర్వకంగా వివక్ష చూపినారని తెలంగాణ సమాజం తొలిదశ, మలిదశలలో తెలంగాణ ఉద్యమాలను

చేపట్టింది. ఇదంతా ఒక విషాద చరిత్ర. సమైక్య పాలనలో సృష్టించిన విలయం మూలంగా తెలంగాణ దారుణంగా నష్టపోయింది. తెలంగాణ ఉద్యమంలో నీటి దోపిడి, వివక్ష ప్రధానాంశంగా ముందుకు వచ్చింది. తలాపున నదులు పారుతున్నా తెలంగాణకు ఈ నీటి గోస ఎందుకు? అన్న ప్రశ్న గ్రామీణ ప్రజలను తట్టిలేపింది. అనాలోచిత విధానాలతో నేలవిడిచి సాము చేసి వ్యవసాయ రంగాన్ని భ్రష్టు పట్టించిన గత పాలకులు "వ్యవసాయ దండగ"న్నారు. అయితే వారికి మాత్రం బ్రిటిష్ పుణ్యమాని నీటి రుచి తెలిసింది. నీటి ద్వారా సంపద సృష్టించుకున్నారు. అంతకు మునుపు వారి వ్యవసాయం ఎట్లా ఉండేదో ఆంధ్ర ప్రాంత ఆహారం ఎట్లా ఉండేదో. మహాకవి శ్రీనాథుడు ఆరు శతాబ్దాల కిందటే రాశాడు.

"జొన్నకలి, జొన్నయంబలి
జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరికి

గత శతాబ్దాల చరిత్ర గమనించినా తెలంగాణ ప్రాంతం అన్ని పంటలకూ అనుకూలమని కేవలం సమైక్య రాష్ట్రంలో పాలకుల వివక్ష మూలంగా నిరాదరణకు గురై నష్టపోయిన ప్రాంతమే తప్ప తెలంగాణకు వనరులు లేక కాదన్నది సుస్పష్టం.

నీటి ప్రాధాన్యతను గుర్తించినటువంటి తొలి పాలకులు శాతవాహనులు. దానిని విస్తృతపరిచి ప్రపంచానికి వాటర్ షెడ్ మేనేజ్మెంట్‌ను పరిచయం చేసింది కాకతీయులు. వారి వారసత్వాన్ని మరింత ముందుకు తీసుకువెళ్లింది కుతుబ్‌షాహీ, అసఫ్‌జాహీ పాలకులు, స్థానిక సంస్థానాల ప్రభువులు. అందుకే 75 వేల పైచిలుకు చెరువులు, కుంటలతో ఒకనాడు తెలంగాణ పచ్చగా కరువు కాటకాలు ఎరుగని ప్రాంతంగా భాసిల్లింది. పర్యావరణ సమతుల్యాన్ని కలిగి ఉన్నది. దురదృష్టవశాత్తు తెలంగాణ సమైక్య రాష్ట్రంలో కలిసిన తర్వాత తెలంగాణ విధ్వంసానికి పునాది పడింది. చివరికి కొన్ని దశాబ్దాల తర్వాత తెలంగాణ పల్లెలలో మైళ్ల కొద్దీ మంచినీటి కోసం బిందెలు, కడవలు పట్టుకుని వెళ్లాల్సిన దుస్థితి ఏర్పడింది. ఒకనాడు ఆది మానవుడు ఆహారం సంపాదించడమే అతిపెద్ద శ్రమ అనుకుంటే నవీన యుగంలో తెలంగాణ ప్రజలు గుక్కెడు మంచి నీళ్ల కోసం శ్రమించడమే తెలంగాణలో ప్రధాన శ్రమగా మనం చూసిన పరిస్థితి.

ఆ స్థితి నుండి బయటపడడం కోసమే తెలంగాణ సిద్ధించిన తరువాత అంతకు మునుపే ఒక ప్రణాళికను రచించుకున్న కేసీఆర్ (టిఆర్ఎస్ పార్టీ) గారు ఒక అద్భుతమైన ఆలోచనతో, బహుళ అంచెల వ్యూహంతో పెండింగ్ ప్రాజెక్టులను వేగవంతం పూర్తి చేసి రన్నింగ్ ప్రాజెక్టులుగా మార్చడం, మిషన్ కాకతీయ ద్వారా చెరువులు, కుంటలను పునరుద్ధరించడం, చెక్ డ్యాంల నిర్మాణంతో పాటు కృష్ణా, గోదావరి నదులపై భారీ ఎత్తిపోతల పథకాలకు శ్రీకారం చుట్టడం, భవిష్యత్తులో నీటి ఎద్దడి లేకుండా ప్రాజెక్టులను నిర్దిష్ట కాలంలో పూర్తి చేయడం, నిధులు లేక, నిర్వాహణ లేక శిథిలమై పోయిన కాలువలను ఆధునీకరించడం,

ప్రాజెక్టు ఫలితాలు సత్వరంగా ప్రజలకు అందించాలన్న సంకల్పంతో పొరుగు రాష్ట్రాలతో ఎలాంటి వివాదాలు లేకుండా సఖ్యతగా, వ్యూహాత్మకంగా వ్యవహరించి వారి అంగీకారాన్ని పొందడం, ప్రాజెక్టులకు అవసరమైన అన్ని రకాల చట్టబద్ధ అనుమతులను కేంద్రం నుంచి సాధించి కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టు సహా అనేక సాగునీటి ప్రాజెక్టులకు రూపకల్పన చేయడం.. ఇవన్నీ గడచిన పదేండ్ల కాలంలో తెలంగాణలో చోటు చేసుకున్నాయి. మూడేళ్ల లోపలే రెండు టిఎంసిల నీటిని వాడుకునే కాళేశ్వరం వ్యవస్థను అందుబాటులోకి తెచ్చిన ఘనత కేసీఆర్ గారిదే. లోపలి, బయటి శత్రువుల కుట్రలను ఛేదించి పాలమూరు రంగారెడ్డి తాగునీటి పనులను 80 శాతం పూర్తి చేసినారు.

ప్రాజెక్టులకు రూపకల్పన జరిగిన నాటి నుండే అంతకు ముందున్న విఫల పాలకులు, విష పాలకులు, వారి తాబేదారులు కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి, డిండి, సీతారామ ఎత్తిపోతల పథకాలపై కోర్టుల్లో కేసులు వేసి, దుష్ప్రచారాలు చేసి ప్రాజెక్టులను అడ్డుకోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేయాలో అన్ని చేశారు. కొంతమంది కుహనా మేధావులు కాళేశ్వరం ప్రాజెక్టు మీద దుష్ప్రచారం చేస్తూ వచ్చారు, ఇప్పటికీ చేస్తూనే ఉన్నారు. కొంతమంది కూడికలు, తీసివేతల లెక్కలతో తెలంగాణ ఎత్తిపోతల ప్రాజెక్టుల వల్ల ఖర్చే తప్ప ప్రయోజనం లేదని చెప్పి ఆర్థిక గణాంకాలను వల్లించి తెలంగాణ ఎత్తిపోతల పథకాలను తెల్ల ఏనుగులుగా చూపే ప్రయత్నం చేశారు. కెసిఆర్ కు తెలంగాణ భౌగోళిక పరిస్థితులపై సంపూర్ణమైన అవగాహన ఉన్నది. కృష్ణా, గోదావరి నదులు లోతట్టులో ప్రవహిస్తాయి. సాగు భూములు ఎత్తుగడ్డన ఉంటాయి కాబట్టి ఎత్తిపోతలు తెలంగాణకు ఒక సామాజిక అవసరం అన్న స్పృహ కెసిఆర్‌కు ఉంది కాబట్టే ఈ కువిమర్శలను, కుట్రలను ఎదుర్కొని ప్రాజెక్టులను తెలంగాణ అవసరాలకు అనుగుణంగా రీఇంజనీరింగ్ చేయడం జరిగింది.

గోదావరి, కృష్ణా నదుల మీద ఏడాది పొడవునా నీరు నిలిచి ఉండే విధంగా భూగర్భ జలం, అటవీ సంరక్షణకు, జంతు సంరక్షణలకు, పర్యావరణ సంరక్షణకు ఉపకరించే భారీ జలాశయాలతో సాగునీరు, తాగునీరు, పారిశ్రామిక అవసరాలతో పాటు చివరికి హైదరాబాద్ మహానగరానికి కూడా తాగునీరు అందించే వరప్రదాయినిగా కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకాల రూపకల్పన జరిగింది. ఖమ్మం జిల్లాలో సీతారామ ఎత్తిపోతల పథకం, వరంగల్ జిల్లా వరప్రదాయినిగా ఉన్న దేవాదుల ప్రాజెక్టుకు శాశ్వత జల నిధి ఏర్పాటు చేయడం కోసం సమ్మక్క బ్యారేజి నిర్మాణం, 40 ఏండ్లుగా ఉమ్మడి పాలకులు ఆదిలాబాద్ జిల్లా ప్రజలను ఊరించిన పెన్గంగ ప్రాజెక్టు నిర్మాణం, మెదక జిల్లాలో సింగూరు కాలువలు. మా మహబూబ్‌నగర్ జిల్లాలో కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్‌సాగర్, తుమ్మిళ్ల ఎత్తిపోతలు పూర్తి అయి 10 లక్షల ఎకరాలకు సాగునీరు అందింది. ఇట్లా గడచిన పదేండ్లలో తెలంగాణ సాగునీటి రంగ ప్రస్థానం అపూర్వమైనది. అద్భుతమైనది. ఈ సాగునీటి సౌకర్యాల కల్పన కారణంగా ఒకప్పుడు వలసల జిల్లాగా, కరువుల జిల్లాగా, రైతుల ఆత్మహత్యల జిల్లాగా దేశంలోనే పేరుగాంచిన మా ఉమ్మడి మహబూబ్‌నగర్ జిల్లాలో అనూహ్యమైన మార్పులు సంభవించాయి. వలసలు బందు అయినాయి.

వ్యవసాయం పుంజుకోవడంతో గ్రామాల్లోనే ప్రజలకు ఉపాధి లభించే పరిస్థితి ఏర్పడింది. వలసబోయిన ప్రజలు గ్రామాలకు తిరిగి వచ్చారు. ఉపాధి కోసం పొరుగు రాష్ట్రాల నుంచి కూలీలు మా జిల్లాకే వలస రావడం ఒక కొత్త, అనూహ్య పరిణామం. మహబూబ్‌నగర్ జిల్లా అనే కాదు తెలంగాణ రాష్ట్రమంతా హరితం వెల్లి విరిసింది. తెలంగాణలో వ్యవసాయం పండుగలా మారి రాష్ట్రం ధాన్యాగారంగా దేశం ముందు విశ్వరూపాన్ని ప్రదర్శించింది. అందుకు వ్యవసాయ శాఖామంత్రిగా నేనే ప్రత్యక్ష సాక్షిని.

మొదటి టర్మ్‌లో సాగునీటి శాఖ మంత్రి శ్రీ హరీష్ రావు ఒ ఎస్ డి హోదాలో, రెండవ టర్మ్‌లో ముఖ్యమంత్రి కెసిఆర్ ఒ ఎస్ డి హోదాలో పని చేసిన మిత్రులు శ్రీధర్ రావు దేశ్‌పాండే కు మిషన్ కాకతీయ, కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి, డిండి, సీతారామ, సమ్మక్కసాగర్, శ్రీరాంసాగర్ పునరుజ్జీవన పథకం తదితర ప్రాజెక్టుల రూపకల్పన దశ నుండి, నిర్మాణ దశ నుండి పూర్తయ్యే వరకు ఈ అభివృద్ధి క్రమాన్ని నిశితంగా పరిశీలించే, అధ్యయనం చేసే అరుదైన అవకాశం లభించింది. తన వృత్తిపరమైన నిపుణతతో పాటు తెలంగాణ ఆత్మతో వాస్తవాలను వెల్లడి చేస్తూ అనేక వ్యాసాలను, పుస్తకాలను గతంలో ప్రచురించారు. పుస్తక రచయిత నిబద్ధత కలిగిన తెలంగాణవాది. సందర్భోచితంగా తన పదునైన వాదనా పటిమతో తెలంగాణ వాదాన్ని వివిధ వ్యాసాలు, పుస్తకాల రూపంలో వ్యక్తీకరించిన ధీశాలి. నికార్సైన తెలంగాణ బిడ్డ.

శ్రీధర్ రావు దేశ్‌పాండే గారు ఈ పుస్తకంలో విలీనానికి పూర్వం, విలీనం అనంతరం తెలంగాణ సాగునీటి రంగం స్థితిగతులను వివరించారు. తెలంగాణ రాష్ట్రంలో కెసిఆర్ నాయకత్వంలో సాగునీటి సౌకర్యాల కల్పనలో సాధించిన అభివృద్ధిని, వాటి ఫలితాల ప్రగతి సూచికలను క్రోడీకరించారు. ఈ పుస్తకం సాగునీటి రంగంలో తెలంగాణ ఉజ్వల ప్రస్థానికి ఒక సాధికారికమైన డాక్యుమెంట్ అని నేను భావిస్తున్నాను. "నిజం ఎప్పుడైనా భావ సంఘర్షణ జరిగినప్పుడే వెలుగులోకి వస్తుంది". వందల, వేల అబద్ధాల ప్రచారాలను తట్టుకుని ఈ రోజు తెలంగాణను దేశ ధాన్యాగారంగా నిలబెట్టిన కెసిఆర్ ప్రభుత్వ పదేండ్ల కృషిని ఈ పుస్తకంలో నిక్షిప్తం చేసినారు రచయిత.

తెలంగాణ ఆవిర్భావం జరిగి పదేండ్లు పూర్తి అయిన కారణంగా శ్రీధర్ రావు దేశ్‌పాండే గారి ఈ పుస్తకం సమయోచితం, సందర్భోచితం, అత్యంత ఆవశ్యకం. ఇది తెలంగాణ సమాజాన్ని, పాఠకులను కూడా తార్కిక దృష్టితో ఆలోచింపజేస్తుందని విశ్వసిస్తున్నాను. ఇటువంటి డాక్యుమెంట్స్ అన్ని రంగాలలో వెలువడాలని ఈ విషయంలో తెలంగాణ వికాస సమితి చొరవ చూపుతుందని ఆశిస్తున్నాను.

పుస్తక రచయితకు హృదయపూర్వక అభినందనలు.

వనపర్తి,<br>**20.04.2025**

* * * * *

# ప్రత్యక్ష సాక్షి, లోపలి మనిషి సమగ్ర రచన



**- డా॥ ఎస్ కె జోషి,**
పిహెచ్ డి, ఐ ఎ ఎస్ (రిటైర్డ్)
మాజీ చీఫ్ సెక్రెటరీ, తెలంగాణ ప్రభుత్వం

తన చరిత్రను, వారసత్వ విలువలను, గుణ పాఠాలను మరచిపోయే ప్రజాస్వామ్య సమాజం అవే తప్పులను పునరావృతం చేయడానికి అవకాశం ఉంటుంది. అవే సమాజ పురోగతికి ఆటంకంగా మిగలడమే కాదు తప్పించుకోగలిగే బాధలను కూడా కలిగిస్తాయి.

గతంలోని గుణ పాఠాలను గుర్తుంచుకోవడానికి, చరిత్రను తెలుసుకోవడం చాలా కూడా ముఖ్యం. ఈ పుస్తకం తెలంగాణ జల వనరుల రంగం స్థితిగతులకు సంబంధించిన సమకాలీన చరిత్రను సంక్షిప్తంగా నిరపేక్షంగా అందిస్తుంది.

తెలంగాణ రాష్ట్ర సాగునీటి శాఖలో నా మాజీ సహోద్యోగి అయిన శ్రీ శ్రీధర్ రావు దేశ్పాండే ఒక ప్రత్యక్ష సాక్షిగా, లోపలి మనిషిగా రచించిన "సాగునీటి రంగంలో తెలంగాణ పదేండ్ల ప్రస్థానం" పుస్తకంలో తెలంగాణ రాష్ట్రంలో జల వనరుల అభివృద్ధి క్రమాన్ని, ఆ దిశగా ప్రభుత్వం తీసుకున్న చర్యలను, అమలు చేసిన విధానాలను లోతైన అవగాహనతో సమగ్ర చిత్రాన్ని అందించారు.

పంట అవసరాలకు అనుగుణంగా వ్యవసాయ రంగానికి నికరంగా, సకాలంలో సాగునీరు అందించడం, రాష్ట్రంలో ప్రతి ఇంటికి సురక్షితమైన త్రాగునీరు సరఫరా చేయడం, రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి వారి అవసరాల మేరకు నీటిని అందించడం ద్వారా రాష్ట్రంలో నీటి భద్రతను స్థిరపరచడం ప్రభుత్వం అనుసరించిన ఒక సమగ్రమైన పాలనాపరమైన వ్యూహం.

బహుళ అంచెల విధానాలను అమలు చేయడం ద్వారా వివిధ రకాల ఉపయోగాలకు నికరంగా, సమర్థవంతమైన, న్యాయబద్ధమైన, భరోసా కలిగిన స్థిరమైన నీటి పంపిణీ ద్వారా మాత్రమే ఈ లక్ష్యాలు సాధ్యమైనాయి. ఈ లక్ష్యాలను సాధించడానికి ప్రభుత్వం ఎంచుకున్న నవీన సాంకేతికతలు ప్రముఖమైన పాత్రను పోషించాయి.

రాష్ట్రంలోని సాగునీటి రంగంలో నెలకొని ఉండిన సమస్యలను, వాటిని పరిష్కరించి ముందుకు సాగిన తీరుతెన్నులను అర్థం చేసుకోవడంలో నిపుణులు, సాధారణ పాఠకులు, పోటీ పరీక్షలకు తయారౌతున్న విద్యార్థులకు ఈ పుస్తకం ఒక ముఖ్యమైన కరదీపికగా, ఒక ఆకరంగా నిలుస్తుందని నేను భావిస్తున్నాను.

రాష్ట్రంలో సాగునీటి రంగంలో గత దశాబ్ది కాలంలో అమలు చేసిన వివిధ కార్యక్రమాలను సమగ్రంగా, తార్కికంగా వివరించినందుకు, ప్రామాణికమైన, నికరమైన సమాచారాన్ని అందించినందుకు ఈ పుస్తక రచయిత శ్రీ దేశ్‌పాండేను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

**హైదరాబాద్, 11.04.2025**

* * * * *

# నీళ్ల కోసం నిబద్ధ యుద్ధం



**- దేశపతి శ్రీనివాస్**
అధ్యక్షుడు, ఎమ్మెల్సీ
తెలంగాణ వికాస సమితి

"నీళ్లు - నిజాలు రాసి తెలంగాణను మేల్కొలిపిన ఆర్. విద్యాసాగర్ రావు వారసత్వాన్ని సమున్నతంగా కొనసాగిస్తున్న శ్రీధర్ రావు దేశ్‌పాండే తెలంగాణ వికాస సమితికి సన్నిహితుడు. తెలంగాణ ఉద్యమంలో బహుముఖ పాత్ర పోషించిన ఇంజనీరు, కథకుడు వ్యాసకర్త, వక్త . 2001 నుండి మేమందరం తెలంగాణ రచయితల వేదిక, తెలంగాణ ఉద్యోగుల సంఘం, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ జెఏసీ లలో కలిసి ఉద్యమ భావ ప్రచారంలో విశేష కృషి చేసాము. ఈ కాలంలో శ్రీధర్ రావు తన రచనా ప్రతిభను అద్భుతంగా ప్రదర్శించారు. ఉద్యమంలోని ప్రతి కీలక సందర్భంలో తన స్పందనలను సమర్థవంతంగా వ్యక్తపరిచారు. వందల కొద్దీ వ్యాసాలు రాసి, డజన్ల కొద్దీ పుస్తకాలు ప్రచురించారు. ఉద్యమ సాహిత్యాన్ని సమృద్ధిగా ప్రచురించడంతో పాటు, ఉద్యమ సభల వేదికలను నిర్మించడంలో తన మేధోశక్తిని, శారీరక శ్రమను అర్పించారు.

సాగునీటి శాఖలో ఇంజనీర్‌గా విధులు నిర్వహిస్తూ, తెలంగాణకు సాగునీటి రంగంలో జరిగిన అన్యాయాలను, వివక్షను ఆనాటి నుండి ఎత్తిచూపుతూ వ్యాసాలు, పుస్తకాలు రచించారు. "నీళ్ళు - నిజాలు" వంటి రచనలతో ప్రసిద్ధి చెందిన ఆర్. విద్యాసాగర్ రావు వంటి వారికి సమాచారం అందించే కీలక వ్యక్తిగా దేశ్పాండే నిలిచారు. అంతేకాదు, తాను స్వయంగా రచనలు చేస్తూ, తన్నీరు వేంకటేశంతో కలిసి తెలంగాణ ఇంజనీర్ల జెఏసీ ఏర్పాటులో, ఆ తర్వాత వివిధ శాఖల ఇంజనీర్లను ఉద్యమంలో భాగస్వాములను చేయడంలో, ఎర్రం మంజిల్ పరిసరాల్లోని సాగునీటి, రోడ్లు, భవనాలు, పంచాయతీరాజ్ వంటి ఇంజనీరింగ్ శాఖల కేంద్ర కార్యాలయాలను ఉద్యమ కేంద్రాలుగా రూపొందించడంలో నిర్ణయాత్మక పాత్ర పోషించారు.

2004 వరకు చంద్రబాబు నాయుడు ప్రభుత్వ విధానాలను, ఆ తర్వాత 2004 నుండి 2014 వరకు వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి, రోశయ్య, కిరణ్ కుమార్ రెడ్డి ప్రభుత్వాల విధానాలను ధీటుగా ఎదిరించారు. ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటూనే ఎన్నడూ వెనుకాడకుండా తన విమర్శనాత్మక రచనలతో అవినీతి, అన్యాయాలను బయటపెట్టారు.

2014 లో స్వరాష్ట్రం రాష్ట్రం సిద్ధించిన తర్వాత, తెలంగాణ పునర్నిర్మాణానికి అడ్డంకులను కలిగిస్తున్న విమర్శలను తిప్పికొట్టి వికాసానికి దోహదపడే కొత్త సంస్థ ఆవశ్యకత ఏర్పడింది. ఈ నేపథ్యంలో

తెలంగాణ వికాస సమితి ఆవిర్భవించింది. శ్రీధర్ రావు దేశ్‌పాండే సమితి సభ్యుడు కాకపోయినా, ఉద్యమ సహచరుడిగా మాతో సన్నిహిత సంబంధాలను కొనసాగించారు.

2014 లో కెసిఆర్ నాయకత్వంలో ఏర్పడిన తొలి తెలంగాణ ప్రభుత్వంలో సాగునీటి శాఖ మంత్రి తన్నీరు హరీష్ రావు వద్ద ఒఎస్‌డిగా, 2019 లో రెండవ ప్రభుత్వంలో ముఖ్యమంత్రి కెసిఆర్ వద్ద ఒఎస్‌డిగా తెలంగాణ పునర్నిర్మాణంలో క్రియాశీలకంగా పాల్గొన్నారు. ఆర్. విద్యాసాగర్ రావు మరణానంతరం, ఆయన వారసత్వాన్ని సమున్నతంగా కొనసాగిస్తూ, తనదైన ముద్ర వేశారు.

కాళేశ్వరం ప్రాజెక్టు రూపకల్పన దశ నుండి నిర్మాణ దశ వరకు, ఆ తర్వాత వచ్చిన విమర్శలు, వక్రీకరణలకు ఎప్పటికప్పుడు సమర్థవంతమైన సమాధానాలు ఇచ్చి విమర్శకులను నిరుత్తరులను చేశారు. 2018 లో తెలంగాణ విశ్రాంత ఇంజనీర్ల సంఘం తరపున "తెలంగాణ జీవనాడి - కాళేశ్వరం ప్రాజెక్టు" పుస్తకాన్ని ప్రచురించడంలో కీలక పాత్ర పోషించారు. 2019 లో స్వయంగా "కాళేశ్వరం ప్రాజెక్టు: తెలంగాణ ప్రగతి రథం" పుస్తకాన్ని రచించారు. ఈ రచనలలో కాళేశ్వరం విమర్శకులకు సమగ్రమైన జవాబులు ఇచ్చారు. ఇటీవల జస్టిస్ పి.సి. ఘోష్ ఆధ్వర్యంలోని కాళేశ్వరం విచారణ కమిషన్ ముందు కూడా కాళేశ్వరం వ్యతిరేకులు అవే పాత వాదనలను పునరుద్ఘాటించినప్పుడు, దేశ్ పాండే గారు "కాళేశ్వరం ప్రాజెక్టు: ప్రశ్నలు-విమర్శలు-వక్రీకరణలు-వివరణలు" అనే పుస్తకాన్ని రచించి, సాధికారిక వివరణలతో విమర్శలను తిప్పికొట్టారు. ఈ పుస్తకాన్ని తెలంగాణ వికాస సమితి ప్రచురించింది.

తెలంగాణ ఆవిర్భావానికి పదేళ్ల పూర్తైన ఈ సందర్భంలో, సాగునీటి రంగంలో తెలంగాణ ప్రస్థానాన్ని సమగ్ర సమాచారంతో, సాధికారికంగా డాక్యుమెంట్ చేస్తూ మరో పుస్తకాన్ని రచించారు. ఈ గ్రంథాన్ని కూడా తెలంగాణ వికాస సమితి ప్రచురిస్తోంది. 2023 ఏప్రిల్‌లో సీనియర్ ఇంజనీర్‌గా పదవీ విరమణ చేసిన శ్రీధర్ రావు దేశ్ పాండే రాసిన ఈ రెండు పుస్తకాలను తెలంగాణ పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

తెలంగాణ వికాస సమితి అన్ని రంగాలలో తెలంగాణ సమగ్ర వికాసానికి దోహదం చేసే స్వతంత్ర సంస్థగా నిరంతరం కృషి చేస్తుంది. భవిష్యత్తులో ఇతర రంగాలలో కూడా ఇటువంటి సాధికారిక గ్రంథాలను అందించేందుకు ప్రయత్నిస్తుందని హామీ ఇస్తున్నాము.

ఈ పుస్తకం ప్రచురణకు సహకరించిన రచయిత శ్రీధర్ రావు దేశ్‌పాండే, సమితి కార్యవర్గ సభ్యులు, మిత్రులకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

హైదరాబాద్,
**27.04.2025**

# నా మాట

ఈ పుస్తకాన్ని ప్రచురించాలని 2018 లోనే అనుకున్నాను. తెలంగాణ రాష్ట్రం ఆవిర్భావం తర్వాత కెసిఆర్ నాయకత్వంలో తొలి ప్రభుత్వం ఏర్పాటు అయినప్పుడు ఉద్యమ నాయకుడు, మా ఇంజనీర్లకు అత్యంత సన్నిహితుడు అయిన శ్రీ హరీష్ రావు గారు సాగునీటి శాఖ మంత్రిగా రావాలని కోరుకున్నాము. మేము కోరుకున్నట్లు గానే కెసిఆర్ హరీష్ రావు గారికే సాగునీటి శాఖను అప్పగించినారు. జూలై నెలలో ఒక రోజు మంత్రి హరీష్ రావు గారు ఫోన్ చేసి పేషీలో ఓ ఎస్ డి గా చేరమని కోరినారు. అప్పటికి నేను సాగునీటి శాఖలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ స్థాయిలో ఉన్న అధికారిని మాత్రమే. గతంలో సాగునీటి శాఖ మంత్రి గారి పేషీలో రిటైర్డ్ చీఫ్ ఇంజనీర్ లేదా ఇంజనీర్ ఇన్ చీఫ్ మాత్రమే ఆ పదవికి ఎంపిక అయ్యేవారు. ఈ అరుదైన, అపూర్వమైన అవకాశం నాకు దక్కినందుకు ఆశ్చర్యపోయాను. అదే సమయంలో గర్వపడినాను. సంతోషించాను. ఆ పదవిలో కొనసాగడానికి నీకు అన్ని అర్హతలు ఉన్నాయని నా ఉద్యమ సహచరులు, సాగునీటి శాఖలో సహచర ఇంజనీర్లు నన్ను ఇతోధికంగా ప్రోత్సహించినారు. వారి ప్రోత్సాహంతో తెలంగాణ పునర్నిర్మాణానికి నా శక్తిని, సామర్థ్యాన్ని వెచ్చించడానికి ఇదొక గొప్ప అవకాశంగా భావించి ఆగస్ట్ నెలలో హరీష్ రావు గారి కార్యాలయంలో ఒఎస్డి గా చేరిపోయాను.

ఇక 2018 వరకు నాలుగేళ్ల హరీష్ రావు గారితో రాష్ట్రమంతా పర్యటించాను. శాఖాపరమైన సమీక్షలను సమన్వయం చేశాను. ఆయన నాయకత్వంలో శాఖలో అమలు అయిన అన్ని కార్యక్రమాలను దగ్గరుండి పరిశీలించే, అధ్యయనం చేసే అవకాశం నాకు లభించింది. మంత్రి ఓ ఎస్ డి గా అన్ని ప్రాజెక్టుల సమాచారం సేకరించే అవకాశం నాకు ఉండేది. వాటి ఆధారంగా 2014 - 18 వరకు నాలుగేళ్లలో సాగునీటి రంగంలో చోటు చేసుకుంటున్న అభివృద్ధి క్రమాన్ని ఎప్పటికప్పుడు వ్యాసాల రూపంలో రికార్డు చేస్తూ వచ్చాను. ఆ క్రమంలోనే తెలంగాణలో సాగునీటి రంగంలో సాగునీటి సరఫరా కోసం నిర్మాణం అయిన, అవుతున్న ప్రాజెక్టులు, వాటి ద్వారా సాధించిన ఫలితాలను క్రోడీకరించి ఒక పుస్తకాన్ని ప్రచురించాలని అనుకున్నాను. కారణాలు ఏవైనా ఆ పుస్తకం కార్యరూపం  దాల్చలేదు.

2019 లో బి ఆర్ ఎస్ రెండవ టర్మ్‌లో సాగునీటి శాఖ ముఖ్యమంత్రి గారి వద్దనే ఉండడం చేత నేను ఓ ఎస్ డి గా ముఖ్యమంత్రి కార్యాలయంలోకి మారిపోయాను. అ నాటికి నేను సాగునీటి శాఖలో సూపరింటెండింగ్ ఇంజనీర్ గా పదోన్నతి పొంది ఉన్నాను. ముఖ్యమంత్రి ఓ ఎస్ డి గా మరో ఐదేళ్ల సాగునీటి రంగంలో అభివృద్ధి క్రమాన్ని, సాధించిన ఫలితాలను మరింత సమగ్రంగా క్రోడీకరించే అవకాశం లభించింది. 2023 లో కెసిఆర్ ప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ దశాబ్ది ఉత్సవాలను నిర్వహించాలని తలపోసింది. ఆ సందర్భంగా సాగునీటి శాఖ తరఫున "సాగునీటి రంగంలో ప్రగతి ప్రవాహం" శీర్షికతో

దశాబ్ది ఉత్సవాల నివేదికను తయారు చేసి జూన్ నెలలో ప్రచురించాము. శాఖలో ఉన్న 19 మంది ప్రాదేశిక చీఫ్ ఇంజనీర్లు అందజేసిన సమాచారం ఆధారంగా, ఇంజనీర్ ఇన్ చీఫ్ (జనరల్) కార్యాలయంలో మరికొందరు ఇంజనీర్ల సహకారంతో ఆ నివేదిక ముసాయిదాను తయారు చేసింది నేనే. ఉన్నతాధికారుల అనుమతి పొందిన తర్వాత నివేదిక ప్రచురణ జరిగింది. 07.06.2023 తేదీన దశాబ్ది ఉత్సవాల్లో భాగంగా రవీంద్ర భారతిలో జరిగిన “ఇరిగేషన్ డే” కార్యక్రమంలో ఈ పుస్తకాన్ని ముఖ్య అతిథిగా విచ్చేసిన తెలంగాణ శాసన మండలి ఛైర్మన్ శ్రీ గుత్తా సుఖేందర్ రెడ్డి గారు ఆవిష్కరించారు.

అయితే ఈ పుస్తకం సంక్షిప్త రూపంలో మాత్రమే ఉన్నది. సాగునీటి శాఖ ప్రచురణ కాబట్టి సంపాదకుడిగా నాకు పూర్తి స్వేచ్ఛ ఉండే అవకాశం లేదు. నా ప్రణాళిక ప్రకారం మరింత సమగ్రంగా మరొక పుస్తకం రావాల్సిన అవసరం ఉందని భావించాను. ఈ ఏడాదితో (2025) తెలంగాణ ఆవిర్భావం జరిగి పదేళ్లు పూర్తి అయినాయి. కాబట్టి పదేళ్ళలో సాగునీటి రంగంలో తెలంగాణ ప్రస్థానాన్ని ఒక ప్రత్యక్ష సాక్షిగా సమగ్రంగా రికార్డు చేయాలని తలంచి ఈ పుస్తకాన్ని రూపొందించాను.

ఇందులో విలీనానికి పూర్వం, విలీనం అనంతరం సాగునీటి రంగంలో తెలంగాణ స్థితిగతులను, ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వాల వివక్ష పూరిత విధానాలను వివరించాను. కెసిఆర్ నాయకత్వంలో తెలంగాణలో సాగునీటి కల్పనకు రాష్ట్ర ప్రభుత్వం అనుసరించిన బహుళ అంచెల వ్యూహాలను, అభివృద్ధి ప్రణాళికలను.. మిషన్ కాకతీయ, పెండింగ్ ప్రాజెక్టులను పూర్తి చేయడం, ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్, ప్రాజెక్టుల ఆధునికీకరణ, సాగునీటి శాఖలో చేపట్టిన సంస్కరణలు, సాగునీటి శాఖ పునర్వ్యవస్థీకరణ, వాగుల పునరుజ్జీవన పథకం-చెక్ డ్యాంల నిర్మాణం, ప్రాజెక్టుల నిర్వహణ, అంతర్రాష్ట్ర సంబంధాలు, కృష్ణా జలాల్లో న్యాయమైన వాటా కోసం పోరాటం, సాగునీటి శాఖలో టెక్నాలజీ వినియోగం, పదేళ్ళలో సాగునీటి ప్రగతి సూచికలు .. ఇలా ఒక సమగ్ర గ్రంథాన్ని రూపొందించే ప్రయత్నం చేశాను. చివరలో ప్రాజెక్టుల సమాచారాన్ని, రాష్ట్రంలోని అన్ని నియోజకవర్గాల సాగునీటి సమాచారాన్ని (2023 నాటికి) పొందుపరచాను.

పుస్తకం తెలంగాణ సాగునీటి రంగ అభివృద్ధి క్రమాన్ని అధ్యయనం చేయాలనుకున్న వాళ్ళకు, పోటీ పరీక్షలకు సిద్ధం అవుతున్న అభ్యర్థులకు ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. చివరలో ఈ పుస్తకం రాయడానికి నేను సంప్రదించిన పుస్తకాలు, డాక్యుమెంట్లను కూడా పేర్కొన్నాను. ఈ సబ్జెక్టుపై మరింత అధ్యయనం చేయాలనుకున్న వాళ్లకు అవి కూడా ఇతోధికంగా ఉపయోగపడతాయని భావిస్తున్నాను.

అడగగానే పుస్తకానికి సహృదయంతో ముందుమాటలు రాసి ఇచ్చిన మాజీ వ్యవసాయ శాఖామాత్యులు శ్రీ సింగిరెడ్డి నిరంజన్ రెడ్డి గారికి, రాష్ట్ర మాజీ చీఫ్ సెక్రెటరీ శ్రీ ఎస్ కె జోషి గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు, నమస్సులు తెలియజేస్తున్నాను.

పుస్తకం అవసరాన్ని నొక్కి చెప్పి, పుస్తక రచన పూర్తి చేయడానికి ప్రోత్సహించిన మాజీ సాగునీటి శాఖామాత్యులు శ్రీ తన్నీరు హరీష్ రావు గారికి, పుస్తక రచనకు ప్రోత్సహించిన ఉద్యమ మిత్రులు, తెలంగాణ జల వనరుల అభివృద్ధి సంస్థ మాజీ ఛైర్మన్ శ్రీ వి ప్రకాష్, అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీ మాజి వైస్ ఛాన్సలర్ ప్రొ. కుసుంభ సీతారామారావు, తెలంగాణ ఎన్‌జీఓ సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ దేవీప్రసాద్, సాగునీటి శాఖలో నాకు సీనియర్ ఇంజనీర్లు శ్రీ జె. విజయ్ ప్రకాష్ (విశ్రాంత ఇఎన్సీ), శ్రీ కొండపల్లి వేణుగోపాలరావు (విశ్రాంత చీఫ్ ఇంజనీర్), నా ఉద్యమ సహచారుడు విశ్రాంత ఇంజనీర్ల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ తన్నీరు వెంకటేశం గార్లకు ప్రత్యేక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఎంతో ఇష్టంగా పుస్తక ప్రచురణకు పూనుకున్న తెలంగాణ వికాస సమితి అధ్యక్షులు, నా ఉద్యమ సహచరులు, ఎమ్మెల్సీ శ్రీ దేశపతి శ్రీనివాస్, కార్యదర్శి శ్రీ అర్రోజు శ్రీనివాస్ గార్లకు, సమితి కార్యవర్గానికి నమస్సులు.

పుస్తకం నేను ఆశించిన ప్రయోజనాన్ని అందిస్తుందని ఆశిస్తూ .. సెలవు.

**- శ్రీధర్‌రావు దేశ్‌పాండే**

సూపరింటెండింగ్ ఇంజనీర్ (రిటైర్డ్)

సాగునీరు & ఆయకట్టు అభివృద్ధి శాఖ

హైదరాబాద్

19.04.2025

* * * * *

# విషయసూచిక

## 1.0 ఉపోద్ఘాతం

1969 ఉద్యమంలో ప్రధానంగా ఉద్యోగాల దోపిడి, నిధుల దోపిడి ప్రధాన అంశాలుగా ఉన్నాయి. అందుకే ఉద్యమంలో విద్యార్థులు, ఉద్యోగులు ప్రధాన పాత్ర పోషించినారు. వారికి తోడుగా తెలంగాణ బుద్ధిజీవులు ఉద్యమంలో పాల్గొన్నారు. ఆనాటికి నీరు ఒక అంశంగా ముందుకు రాలేదు. గ్రామాల్లో చెరువులు ఇంకా కళకళలాడుతూ ఉన్నాయి. వ్యవసాయం విధ్వంసం అంతగా లేదు. వ్యవసాయ సంస్కృతిలో బతుకుతున్న సబ్బండ వర్గాలు ఇంకా సంక్షోభానికి గురికాలేదు. తెలంగాణలో అనాదిగా కొనసాగుతున్న స్వయంపోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఇంకా బతికే ఉన్నది. వృత్తి కులాలకు, వ్యవసాయ కూలీలకు బతుకు తెరువు గ్రామాల్లో దొరికే పరిస్థితి ఉన్నది. అందుకే గ్రామాల్లో ఉన్న విశాల ప్రజానీకానికి ఉద్యమ చైతన్యం చేరలేదు. ఒక అగ్ని పర్వతంలా ఎగిసిన ఉద్యమం 9 నెలలు తెలంగాణను స్థంభింపజేసింది. అయితే ఆనాటి రాజకీయ నాయకత్వపు విద్రోహానికి ఉద్యమం కుప్పకూలిపోయింది. అది మళ్ళీ పునర్జీవనం పొందడానికి 25 ఏండ్లు పట్టింది. ఈ 25 ఏండ్లలో తెలంగాణలో గుణాత్మకమైన పరిణామాలు చోటు చేసుకున్నాయి. తెలంగాణ ఆర్థిక, సాంస్కృతిక జీవనానికి అనాది ఆధారాలుగా ఉన్న గొలుసుకట్టు చెరువుల వ్యవస్థ విధ్వంసం అయ్యింది. చెరువులు, మోటబావులు ఎండిపోయినాయి. వాటి నిర్వహణను ఉమ్మడి రాష్ట ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేసినాయి. పూడికలతో నిండిపోయి కబ్జాలకు గురి అయినాయి. తెగిపోయిన మట్టికట్టలను పునరుద్దరించలేదు. కూలిపోయిన తూములను మరమ్మతులు చేయలేదు. చెరువులకు నీటిని తీసుక వచ్చే కాలువలు, వాగులు ఆక్రమణలకు గురి అయితే పట్టించుకోలేదు. ఉమ్మడి ప్రభుత్వాల సాగునీటి పాలసీ అంతా కూడా ఆంధ్ర ప్రాంత ప్రయోజనాలను నెరవేర్చేందుకే ఉద్దేశించబడింది. భారీ మధ్యతరహా ప్రాజెక్టుల నిర్మాణానికే పెద్ద పీట వేసి తెలంగాణ భౌగోళిక పరిస్థితులకు అనుగుణమైన గొలుసుకట్టు చెరువుల వ్యవస్థని నిర్లక్ష్యం చేసినారు. నిజానికి “మైనర్ ఇరిగేషన్ తెలంగాణకు మేజర్ ఇర్రిగేషన్” అన్న స్పృహ ఉమ్మడి రాష్ట్ర పాలకులకు లేనేలేదు.

## 2.0 విలీనానికి పూర్వం సాగునీటి రంగం :

1956 కు పూర్వం నిజాం ప్రభుత్వం , హైదారాబాద్ సంస్థాన ప్రభుత్వం తెలంగాణలో అనేక భారీ , మద్యతరహా , చిన్న నీటి ప్రాజెక్టులను నిర్మించింది. మనకు అందుబాటులో ఉన్న సమాచారం మేరకు 20 వ శతాబ్దం ఆరంభం నాటికి తెలంగాణలో 21000 చెరువులు , వాటి కింద 8 లక్షల ఎకరాలు సాగులో ఉండేవి. 1956 లో విలీనం నాటికి అవి 33000 లకు పెరిగి వాటి కింద 12 లక్షల ఎకరాలు సాగులో ఉండేవని తెలుస్తున్నది. 1930 నాటికే నిజాం ప్రభుత్వం అనేక మేజర్, మీడియం ప్రాజెక్టులను నిర్మించింది.

ఘన్ పూర్ ఆనకట్ట (మెదక్ జిల్లా), డిండి ప్రాజెక్టు, పెండ్లిపాకల (నల్గొండ జిల్లా), వైరా,

పాలేరు ప్రాజెక్టులు (ఖమ్మం జిల్లా), శనిగరం, అప్పర్ మానేరు (కరీంనగర్ జిల్లా), రాయని పల్లి, సింగభూపాలం, కోయిల్ సాగర్, సరళాసాగర్ (మహబూబ్ నగర్ జిల్లా), సదర్మాట్, స్వర్ణ, కడెం (ఆదిలాబాద్ జిల్లా), నిజాంసాగర్ ప్రాజెక్టు, పోచారం ప్రాజెక్టు (నిజామాబాద్ జిల్లా), ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్, మీరాలం చెరువు (హైదారాబాద్ జిల్లా).

ఇవికాక నిజాం ప్రభుత్వం గోదావరి పై 400 టిఎంసిల పోచంపాడు(కుష్టాపురమ్) ప్రాజెక్టును, 350 టిఎంసిల ఇచ్ఛంపల్లి ప్రాజెక్టును, మంజీరా నదిపై 38 టిఎంసిల దేవనూరు ప్రాజెక్టును, కృష్ణా నదిపై 132 టిఎంసిల నందికొండ ప్రాజెక్టును, 54.4 టిఎంసిల అప్పర్ కృష్ణా ప్రాజెక్టును, తుంగభద్ర నదిపై 65 టిఎంసిల తుంగభద్ర ఎడమ కాలువ, రాజోలిబండ మళ్ళింపు పథకము, భీమా నదిపై 100 టిఎంసిల భీమా ప్రాజెక్టును ప్రతిపాదించింది.మొత్తంగా 1365 టిఎంసిల కృష్ణా గోదావరి జలాలను వినియోగించు కొనేందుకు ప్రతిపాదనలు ఉన్నవి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగి 1956 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడడంతో కొన్ని ప్రాజెక్టులను లిస్టులోంచి తొలగించారు. కొన్నింటి సామర్థ్యాన్ని కుదించారు. మరికొన్నింటిని సుప్తావస్థలో ఉంచారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు తరువాత సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణంలో తెలంగాణ తీవ్ర వివక్షకు లోనైంది. ఆ వివరాలు కింది పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

| క్ర.సం | కృష్ణా నది | సీమాంధ్ర | తెలంగాణ |
|---|---|---|---|
| 1 | పరీవాహక ప్రాంతం | 31.5% | 68.5% |
| 2 | బచావత్ ట్రిబ్యూనల్ అవార్డ్ ప్రకారం నీటి కేటాయింపులు | 512 టిఎంసి 63.13% | 299 టిఎంసి 36.86% |
| 3 | వాస్తవంగా అందుతున్న నీరు | 84.6% | 15.4% |
| | **గోదావరి నది** | **ఆంధ్ర** | **తెలంగాణ** |
| 1 | పరీవాహక ప్రాంతం | 21% | 79% |
| 2 | గోదావరి ట్రిబ్యూనల్ అవార్డ్ ప్రకారం నీటి కేటాయింపులు | 39% | 61% |
| 3. | వాస్తవ కేటాయింపులు | 57.1% | 15.7% |

తెలంగాణలో ప్రాజెక్టులు ప్రారంభమై ఏళ్ళు గడుస్తున్నా పూర్తికాని పరిస్థితి ఉండేది. నీటి కేటాయింపులు కాగితాలకే పరిమితం అయినాయి. ఇప్పుడు నిజాం హైదరాబాద్ ప్రభుత్వం రూపొందించిన కొన్ని ప్రాజక్టులు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఏ విధంగా వివక్షకు గురి అయినాయో తెలుసుకుందాం.

## 2.1 పోచంపాడు (శ్రీరాం సాగర్ ప్రాజెక్టు):

400 టిఎంసిల నిలువ సామర్థ్యంతో, తెలంగాణలోని ఏడు జిల్లాలలో 40 లక్షల ఎకరాలకు సాగునీరు అందించవలసిన ఈ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తరువాత 112 టిఎంసిలకు కుదించబడింది. 9 లక్షల ఎకరాలకు నిర్మాణం జరిగింది. కాలక్రమేణా నిలువ సామర్థ్యం 90 టిఎంసిలకు పడిపోయింది. 9700 క్యూసెక్కుల ప్రవాహాన్ని మోసుకుపోవలసిన కాకతీయ కాలువ అతి కష్టం మీద 6000 క్యూసెక్కులు తీసుకువెళ్ళుతుంది. మొదటి దశ ఆయకట్టుకే నీరు సరిపోయేదికాదు. రెండో దశ కాలువలు తవ్వి పెట్టినా నీళ్ళు రాని పరిస్థితి. 1964 లో ప్రారంభమయిన ప్రాజెక్టు రెండవ దశ నిర్మాణం ఇంకా దేకుతూనే ఉండింది. 1990 లో ప్రారంభమైన శ్రీరాంసాగర్ కాలువ పూర్తి అయినా, మిడ్ మానేరు లాంటి బ్యాలెంసింగ్ జలాశయాలు పూర్తి కాక పోవడంతో వరద కాలువ ఆశించిన ప్రయోజనాలు నెరవేర లేదు. గతప్రభుత్వాల నిర్లక్ష్య వైఖరి వల్ల సుప్రీంకోర్టులో వాదనా వైఫల్యాల వల్ల శ్రీరాంసాగర్ ప్రాజెక్టు జలాశయంలోనే ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా, అంతర్రాష్ట్ర ఒప్పందాలకు విరుద్ధంగా మహారాష్ట్ర బాబ్లీ బ్యారేజీని నిర్మించింది. ఎగువన కర్ణాటక, మహరాష్ట్రాలు అనేక బ్యారేజీలు, చెక్‌డ్యాంలు నిర్మించడంతో శ్రీరాంసాగర్ జలాశయంలోకి ప్రవాహాలు గణనీయంగా తగ్గిపోయినాయి.

## 2.2 నందికొండ ప్రాజెక్టు (నాగార్జునసాగర్ ప్రాజెక్టు):

హైదారాబాద్ రాష్ట్ర ప్రభుత్వం కృష్ణా నదిపై ఏలేశ్వరం వద్ద 132 టిఎంసిల నిలువ సామర్థ్యంతో నల్గొండ, ఖమ్మం జిల్లాలలో 10 లక్షల ఎకరాలకు సాగునీరు అందించేందుకు ఈ ప్రాజెక్టును ప్రతిపాదించింది. 1954 లో ఆంధ్ర రాష్ట్రంతో కుదిరిన ఒప్పందం ప్రకారం రెండురాష్ట్రాలు చెరి 132 టిఎంసిలు వినియోగించుకోవడానికి దిగువన నందికొండ వద్ద నాగార్జునసాగర్ ప్రాజెక్టును ప్రతిపాదించినారు. కుడి కాలువ ద్వారా 132 టిఎంసిలు ఆంధ్ర రాష్ట్రానికి, 132 టిఎంసిలు ఎడమ కాలువ ద్వారా నల్లగొండ, ఖమ్మం జిల్లాలకు నీరు అందించాలి. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తరువాత ఎడమ కాలువకు 106.2 టిఎంసిలు మాత్రమే కేటాయించబడింది. ఈ కేటాయింపులు కూడా తరువాతి కాలంలో కాలువ అలైన్‌మెంట్ మార్చడం ద్వారా, డిజైన్‌లను మార్చడం ద్వారా 86 టిఎంసిలకు తగ్గించారు. ఒప్పందం ప్రకారం రెండు కాలువలు చెరి 132 టిఎంసిలు మోసుకుపోవలసి ఉండగా డిజైన్లలో వివక్ష కారణంగా అది సాధ్యం కాలేదు. కుడి కాలువ వెడల్పు 241 అడుగులు ఉండగా ఎడమ కాలువ వెడల్పు 95 అడుగులే పెట్టడం వివక్షకు తార్కాణం. ప్రతిపాదనల ప్రకారం ఎడమ కాలువ నల్లగొండ, ఖమ్మం జిల్లాలలోని ఆయకట్టుకు మాత్రమే నీరు అందించాలి. అయితే కాలువ నిర్మాణం జరిగే సమయంలో కుట్రపూరితంగా కృష్ణా, ప్రకాశం జిల్లాలకు పొడిగించినారు. దీనివల్ల తెలంగాణ 43 టిఎంసిల కృష్ణా నది జలాలను తెలంగాణ కోల్పోవలసి వచ్చింది.

## 2.3 రాజోలిబండ మళ్ళింపు పథకం:

1944 లో కుదిరిన ఒప్పందం ప్రకారం కేసి కెనాల్‌కు రాజోలిబండ కాలువకు తుంగభద్ర నీటిలో సమాన వాటా రావాలి. అయితే బచావత్ ట్రిబ్యునల్ ఎదుట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వివక్షా పూరితంగా పెట్టిన డిమాండ్ల కారణంగా కేసి కెనాల్‌కు 39.9 టిఎంసిలు దక్కగా, రాజోలి బండకు 17.10 టిఎంసిలు (15.9 టిఎంసిలు మహబూబ్ నగర్ కు) మాత్రమే దక్కాయి. కేసి కెనాల్ ఆయకట్టును 2.78 లక్షల ఎకరాలుగా నిర్ధారించగా రాజోలిబండ ఆయకట్టును 92,900 ఎకరాలుగా (87,000 ఎకరాలు మహబూబ్ నగర్‌కు) నిర్ధారించారు. ఇది రాజోలిబండకు ఎదురైన మొదటి అన్యాయం. రాజోలిబండ నిర్మాణం జరిపేటప్పుడు ఏర్పాటు చేసిన పది తూముల్లో ఏడింటిని మూసివేసి మూడింటిని అట్లాగే తెరిచి ఉంచడం వల్ల రాజోలిబండకు న్యాయంగా దక్కవలసిన వాటా ఎప్పుడు దక్కలేదు. 15.9 టిఎంసిల తుంగభద్ర జలాలను మహబూబ్ నగర్ జిల్లాలోని గద్వాల, ఆలంపూర్ తాలుకాలలో 87,000 ఎకరాలకు సాగునీరు అందించాల్సిన రాజోలిబండ కాలువ గత 15 సంవత్సరాల్లో సగటున 6.8 టిఎంసిలకు మించి దక్కలేదని రికార్డులు చెపుతున్నాయి. అదేసమయంలో 39.9 టిఎంసిలు వాడుకోవాల్సిన కేసి కెనాల్ సగటున 55 టిఎంసిలు ఉపయోగించుకున్నట్లుగా రికార్డులు చెబుతున్నాయి.సుంకేశుల అనకట్టను కేసి కెనాల్‌ను ఆధునీకరించిన ప్రభుత్వం తెలంగాణలో కరువు ప్రాంతంగా మారిన మహబూబ్‌నగర్ జిల్లాలోని పాత కాలువ రాజోలిబండను నిర్లక్ష్యం చేసింది. ఈ నిర్లక్ష్య వైఖరి, పక్షపాత వైఖరి కారణంగా మొన్నటికి మొన్న బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ అసలు జాడ పతా లేని రాజోలిబండ కుడికాలువకు 4 టిఎంసిలను కేటాయించడం జరిగింది. రాజోలిబండకు ఎడమ వైపున మహబూబ్‌నగర్ జిల్లా, కుడి వైపున కర్నూల్ జిల్లా. రాజోలిబండ కుడికాలువ కోసం పట్టు బట్టి 4 టిఎంసిలు సాధించుకున్న ప్రభుత్వం సుంకేశుల బ్యారేజి నుంచి మహబూబ్ నగర్ జిల్లాకు ప్రయోజనం కల్పించే ఎడమకాలువను మాత్రం డిమాండు చేయలేదు. ఇది వివక్ష కాదా?

## 2.4 జూరాల ప్రాజెక్టు :

బచావత్ ట్రిబ్యూనల్ సానుభూతితో 17.84 టిఎంసిలను కృష్ణా నదిపై జూరాల ప్రాజెక్టుకు కేటాయింపులు జరిపింది. జూరాల పూర్తి నిల్వ సామర్థ్యం 9.54 టిఎంసిలు, నికర నిల్వ సామర్థ్యం 6.80 టిఎంసిలు. అయితే చాలా కాలం పాటు కర్నాటకలో ఎఫ్ఆర్ఎల్ దాకా భూసేకరణ జరపక పోవడం చేత జూరాలలో 5 టిఎంసిలకు మించి నింపడం సాధ్యపడ లేదు. 2009 వరకు ప్రభుత్వం కర్ణాటక రాష్ట్రంలోని భూములకు నష్ట పరిహారం చెల్లించకపోవడం చేత జూరాల ప్రాజెక్టు ఈ నష్టాన్ని భరించవలసి వచ్చింది. తెలంగాణ ఉద్యమం కారణంగా నష్టపరిహారం చెల్లించిన తర్వాతనే ఎఫ్ఆర్ఎల్ వరకు జలాశయాన్ని నింపడం ప్రారంభమయ్యింది.

1956 కు ముందు మహబూబ్ నగర్ జిల్లాకు కృష్ణా జలాల్లో కేటాయింపులు 175 టిఎంసిలు. (భీమా-100, అప్పర్ కృష్ణా 56, తుంగభద్ర ఎడమ కాలువ పొడగింపు 19 టిఎంసిలు). విలీనం

అనంతరం మహబూబ్ నగర్ జిల్లా పొందిన కేటాయింపులు 53.74 టిఎంసిలు మాత్రమే.(రాజోలిబండ 15.9, జూరాల 17.84, భీమా ఎత్తిపోతల పథకం 20 టిఎంసిలు). కృష్ణా, తుంగభద్ర, భీమా, డిండి లాంటి పెద్ద నదులు ప్రవహిస్తున్నా ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు మహబూబ్‌నగర్ జిల్లాకు శాపంగా మారి దేశంలోనే అత్యధిక కరువు పీడిత 10 జిల్లాలలో ఒకటిగా మిగిలింది.తెలంగాణ ఒక రాష్ట్రంగా కొనసాగి ఉండి ఉంటే మహబూబ్ నగర్ జిల్లాకు ఈ దుర్గతి పట్టి ఉండేది కాదు.

## 2.5 ఇచ్ఛంపల్లి & పోలవరం ప్రాజెక్టులు :

ఇచ్ఛంపల్లి ప్రాజెక్టును దశాబ్దాలుగా అంతర్రాష్ట్ర సమస్యలను చూపెట్టి కోల్డ్ స్టోరేజీలో పెట్టినారు.ఇచ్ఛంపల్లికి సమకాలీనమైన పోలవరం ప్రాజెక్టును మాత్రం అంతర్రాష్ట్ర సమస్యలు, ముంపు సమస్యలు, పర్యావరణ సమస్యలు, కోర్టు కేసులు ఎన్ని ఉన్నా మొండిగా ప్రభుత్వం ప్రాజెక్టుకు నిధులు కేటాయించి పనులు ప్రారంభించింది. ఇచ్ఛంపల్లి తెలంగాణ ప్రాజెక్టు కాబట్టి వివక్ష. పోలవరం ఆంధ్ర ప్రాజెక్టు కాబట్టి వల్లమాలిన ప్రేమ.విభజన చట్టంలో పోలవరం ప్రాజెక్టును జాతీయ ప్రాజెక్టుగా ప్రకటింపజేసుకున్న ఉమ్మడి ప్రభుత్వ పాలకులు తెలంగాణకు ఒక్క జాతీయ ప్రాజెక్టును సాధించలేకపోయినారు.2004 లో చంద్రబాబు ప్రభుత్వం పోలవరం ప్రాజెక్టు ఆలస్యమవుతున్న కారణంగా తాటిపూడి, పుష్కర, చాగల్ నాడు, వెంకటాపురం ఎత్తిపోతల పథకాలను ప్రతిపాదించింది. ఇచ్ఛంపల్లికి బదులుగా దేవాదులను తెలంగాణలో ప్రారంభించింది. దేవాదుల ఇంకా దేకుతూనే ఉన్నది. తాటిపూడి, పుష్కర, ఛాగల్‌నాడు, వెంకటనగరం ఎత్తిపోతల పథకాలు పూర్తి అయి నిర్దేశిత ఆయకట్టుకు సాగునీరు అందిస్తున్నాయి.

రాజశేఖర రెడ్డి ఒక అడుగు ముందుకు వేసి, పోలవరంకు ప్రత్యామ్నాయంగా చేపట్టిన తాటిపూడి, పుష్కర తదితర ఎత్తిపోతల పథకాలు పూర్తి అయి నిర్దేశిత ఆయకట్టుకు సాగు నీరు అందిస్తున్నా, ఎన్ని అడ్డంకులు, ఎన్ని వ్యతిరేకతలు ఉన్నా పోలవరం ప్రాజెక్టు పనులు ప్రారంభించినాడు. మరి తెలంగాణ ప్రజల చిరకాల డిమాండ్ అయిన ఇచ్ఛంపల్లి ఎందుకు ప్రారంభించలేదు? ఇది వివక్ష కాదా?(విభజన తర్వాత మారిన పరిస్థితుల్లో, కఠినమైన పర్యావరణ చట్టాలు, అంతరాష్ట్ర వివాదాల కారణంగా తెలంగాణా ప్రభుత్వం ఇచ్ఛంపల్లికి ప్రత్యామ్నాయాలను ప్రతిపాదించక తప్పలేదు.)

## 2.6 నిజాంసాగర్ & సింగూర్ ప్రాజెక్టులు :

నిజాంసాగర్ ప్రాజెక్టు మంజీరా నదిపై నిజాం ప్రభుత్వం తెలంగాణలో నిర్మించిన భారీ ఆనకట్ట. ఆనాటికి ఆసియాలోనే అతి పెద్ద ప్రాజెక్టు. 2.75 లక్షల ఎకరాలకు సాగు నీరు అందించవలసిన ప్రాజెక్టు పూడిక వల్ల నిల్వ సామర్థ్యం తగ్గిపోయి 1.50 లక్షల ఎకరాలకు కూడా నీరివ్వలేకపోయింది.నిజాంసాగర్‌కు సింగూర్ ప్రాజెక్టు నుంచి రావలసిన 8 టిఎంసిలు సక్రమంగా రాకపోవడం చేత నిజాం సాగర్ ఆయకట్టు రైతులు అష్టకష్టాలు పడినారు. తమ స్వంత ఖర్చుతో

భూగర్భ జలాలను తోడుకుంటూ వ్యవసాయాన్ని కొనసాగించారు. సింగూర్ నుండి హైదారాబాద్ నగరానికి ఉన్న కేటాయింపులు 4 టిఎంసిలు, మంజీరా బ్యారేజీ నుంది 2 టిఎంసిలు మొత్తం కలిపి 6 టిఎంసిలు మాత్రమే. కానీ హైదారాబాద్ నగరంలో ఇబ్బడి మొబ్బడిగా పెరిగిపోయిన వలస కాలనీలకు తాగు నీరు అందించడానికి సింగూర్ నీటిని మొత్తంగా హైదారాబాద్ తాగునీటి అవసరాలకే ప్రభుత్వం కేటాయించింది.

అలీసాగర్, గుత్పా ఎత్తిపోతల పథకాలను నిర్మించి 5 టిఎంసిల గోదావరి నీటిని శ్రీరాంసాగర్ జలాశయం నుంచి తరలించి కొంత న్యాయం చేసినప్పటికీ ఆ మేరకు కాకతీయ కాలువకు గండి పడింది. అట్లనే సింగూర్ నుంచి ఘన్‌పూర్ ఆనకట్టకు కూడా సక్రమంగా నీరు అందక పోవడం చేత మెదక్ జిల్లాకు కూడా అన్యాయం జరుగుతున్నది. సింగూర్ ప్రాజెక్టును హైదరాబాద్ తాగునీటి కోసమే అంకితం చేయడం వల్ల మెదక్, నిజామాబాద్ జిల్లాల రైతులు తీవ్రంగా నష్టపోయింది.

### 2.7 చిన్న చెరువుల వ్యవస్థ విధ్వంసం :

తెలంగాణలో చెరువుల నిర్మాణం శాతవాహనుల కాలం నుంచి అనాదిగా సాగుతున్నది. చెరువుల కింద వ్యవసాయమే తెలంగాణలో జీవనాధారంగా ఉన్నది. కాకతీయులు నిర్మించిన రామప్ప, పాకాల, లఖ్నవరం, ఘణపురం, బయ్యారం వంటి సముద్రాలను తలపించే చెరువులు ఇప్పటికీ సేవలందిస్తున్నాయి. వారి తర్వాత తెలంగాణను పాలించిన కుతుబ్ షాహీలు, అసఫ్ జాహీలు కూడా తెలంగాణలో చెరువుల నిర్మాణాన్ని కొనసాగించి వ్యవసాయ విస్తరణకు తోడ్పాటునందించారు. పటంచెరువు, హుసేన్ సాగర్, ఇబ్రాహీం పట్నం, ఉదయసముద్రం, పానగల్లు, ధర్మసాగరం చెరువుల్లాంటివి తెలంగాణలో ఎన్నో. ప్రతి ఊరికి కనీసం ఒక్క చేరువన్న ఉండేది. ఒకటి కన్న ఎక్కువ చెరువులు ఉన్న ఊర్లు కూడా తెలంగాణలో అనేకం ఉన్నాయి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలంగాణలో అనాదిగా ఉన్న ఈ గొలుసుకట్టు చెరువుల వ్యవస్థను నిర్లక్ష్యం చేసి విధ్వంసానికి గురిచేసింది. మహబూబ్‌నగర్ జిల్లాలో సంస్థానపాలకులు కూడా సముద్రాల వంటి చెరువులను నిర్మించారు. గణపసముద్రం, రంగ సముద్రం, కృష్ణ సముద్రం, రామ సముద్రం, శంకరమ్మ సముద్రం, శ్రీవారి సముద్రం, కేసరి సముద్రం వీటిని సప్త సముద్రాలని పిలుస్తారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాగునీటి పాలసీ సీమాంధ్ర ప్రయోజనాలు నెరవేర్చే విధంగానే తయారయ్యింది. భారీ మధ్య తరహా ప్రాజెక్టుల నిర్మాణం మీదనే దృష్టి కేంద్రీకరించడం వల్ల తెలంగాణలోని చెరువుల వ్యవస్థ నిర్వహణ పట్ల, వాటి అభివృద్ధి పట్ల వివక్ష చూపడం వల్ల పూడికలతో నిండి పోయి, గండ్లు పడిపోయి, కబ్జాలకు గురయి వేలాది చెరువులు కనుమరుగయ్యాయి. ఇప్పటికీ అనేక చెరువులు కనుమరుగయ్యే దశకు చేరుకున్నాయి. చెరువుల వ్యవస్థ విధ్వంసం వలన స్వయంపోషక గ్రామాలుగా పరిఢవిల్లిన తెలంగాణ గ్రామాలు కరువు పీడిత గ్రామాలుగా మారినాయి. వలసలకు, ఆత్మహత్యలకు నిలయమైనాయి. చిన్ననీటి చెరువుల కింద కృష్ణా, గోదావరి బేసిన్లలో తెలంగాణకు ఉన్న 265 టిఎంసిలలో

90 టిఎంసిలకు మించి వాడుకునే పరిస్థితి లేకుండింది.

తెలంగాణకు న్యాయంగా దక్కవలసిన కృష్ణా గోదావరి జలాలు దక్కి ఉంటే, చిన్న నీటి వనరుల నిర్వహణ, అభివృద్ధి సక్రమంగా జరిగి ఉంటే తెలంగాణలో బతుకు చిత్రం భిన్నంగా ఉండేది. ఫజల్ అలీ కమీషన్ సిఫారసుల మేరకు తెలంగాణ ఒక రాష్ట్రంగా కొనసాగి ఉంటే నదీ జలాల్లో తన వాటాను తను వినియోగించుకొని ఉండేది. అనాది ఆధారాలైన గొలుసుకట్టు చెరువుల వ్యవస్థను సక్రమంగా నిర్వహించుకుని ఉండేది. చిన్న చెరువులను మరింత అభివృద్ధి పరుచుకుని ఉండేది. ఫజల్ అలీ వ్యక్తం చేసిన అభిప్రాయం ఈ విధంగా ఉంది.

When plans for future development are taken into account, Telangana fears that the claims of this area may not receive adequate consideration in Vishalandhra. The Nandikonda and Kushtapuram (Godavari) projects are, for example, among the most important which Telangana or the country as a whole has undertaken. Irrigation in the coastal deltas of these two great rivers however, also being planned. Telangana, therefore, does not wish to lose its present independent rights in relation to the utilization of the waters of the Krishna and Godavari. (Para 377 of SRC Report, 1955).

విలీనం వలన తెలంగాణ ఆ అవకాశాన్ని కోల్పోయింది. జల వనరుల వినియోగంపై హక్కును కోల్పోయింది.అందుకే తెలంగాణ స్వయంపాలన కోరుకున్నది. 1996 లో వర్తమాన తెలంగాణ ఉద్యమం పురుడు పోసుకునే సమయానికి తెలంగాణ గ్రామాలు వల్లకాడుల్లాగా మారిపోయినాయి. రైతుల ఆత్మ హత్యలకు నిలయమైనాయి. లక్షల సంఖ్యలో గ్రామీణ ప్రజలు బతుకు తెరువు వెతుక్కుంటూ పట్నాలకు, దూర ప్రాంతాలైన బొంబాయి, భివండి, అహమ్మదాబాద్, సూరత్‌లకు, గల్ఫ్ దేశాలకు కూలీలుగా వలసబోయినారు. భూమి ఉన్న చిన్న, సన్న కారు రైతులు, భూమిలేని వ్యవసాయ కూలీలు, వృత్తి కులాలవారు ఈ వలస ప్రజల్లో ఉన్నారు. తెలంగాణ ప్రజల బతుకు "బొంబాయి-దుబాయి-బొగ్గుబాయి" అయిపోయింది. సాగునీటి సదుపాయం లేదు. ప్రభుత్వ పరపతి లేదు. అదే సమయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశపెట్టిన ఆర్థిక విధానాలు తెలంగాణను చితక్కొట్టినాయి. తెలంగాణ ఉద్యమ చైతన్యంలో నీటి దోపిడి అనివార్యంగా ప్రధాన అంశంగా ముందుకు వచ్చింది. తలాపున గోదావరి, కాళ్ళ కట్టుకు కృష్ణా నదులు పారుతున్నా తెలంగాణకు ఈ నీటి గోస ఎందుకు? అన్న ప్రశ్న గ్రామీణ ప్రజలను తట్టి లేపింది. నీటి దోపిడి అంశం ఉద్యమానికి విశాల ప్రజానీకం మద్దత్తు కూడగట్టింది. ఈ ప్రజా పునాది కారణంగానే ఉద్యమం సుదీర్ఘ కాలం మనగలిగింది. "నీళ్ళు-నిధులు-నియామకాలు"ట్యాగ్ లైన్‌తో సాగిన ప్రజా ఉద్యమం రాష్ట్రంలో, దేశంలో ఉన్న అన్ని రాజకీయ పార్టీలను ఒప్పించి తన వైపు నిలబెట్టుకోగలిగింది. అంతిమంగా విజయాన్ని అందుకోగలిగింది.

తెలంగాణా రాష్ట్రం ఏర్పడి పదేళ్ళు గడచినాయి. ఉద్యమ ఆకాంక్షల్లో తెలంగాణా రాష్ట్ర సాధన అన్న ప్రధానమైన ఆకాంక్ష నెరవేరింది. తెలంగాణా రాష్ట్ర సాధనా ఉద్యమానికి నీటి దోపిడీ ప్రధాన

ప్రాదిపదికగా ఉండేదని అందరికీ తెలిసిందే. నీటి దోపిడీ నుంచి తెలంగాణా విముక్తం అయ్యిందా? నీటి వనరులను తెలంగాణా బీడు భూములకు మళ్ళించే దిశలో ప్రయాణించిందా? ఈ పదేండ్లలో సాగునీటి రంగంలో తెలంగాణా రాష్ట్రం సాధించిన ప్రగతి ఎంత? అన్నవి కీలక ప్రశ్నలు. తెలంగాణా రాష్ట్ర ఏర్పాటు జరిగి దశాబ్దం గడచిన సందర్భంగా సాగునీటి రంగంలో తెలంగాణ ప్రభుత్వం అనుసరించిన వ్యూహాలు, సాధించిన అభివృద్ధి, సాగునీటి ప్రాజెక్టుల ప్రభావాలు చర్చించడం అవసరం.

## 3.0. తెలంగాణలో సాగునీటి రంగ అభివృద్ధి - ప్రభుత్వ ప్రణాళికలు :

జూన్ 2, 2014 న తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది. కేసిఆర్ నాయకత్వంలో తెలంగాణా ప్రభుత్వం సాగునీటి రంగంలో తెలంగాణ ప్రజల ఆకాంక్షలు తీర్చడానికి పథకాలు రూపొందించింది. సమైక్య రాష్ట్రంలో జరిగిన అన్యాయాన్ని సవరించడానికి తెలంగాణ ప్రభుత్వం తీవ్రంగా శ్రమించింది. కృష్ణా, గోదావరీ జలాల్లో తెలంగాణకు న్యాయంగా దక్కవలసిన వాటా కోసం పోరాటం ఒక ఎత్తు, ఆ నీటిని వినియోగించుకునేందుకు ప్రాజెక్టులని కట్టుకోవడం మరొక ఎత్తు. తెలంగాణ తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ గారు ఈ అంశంలో ఒక సంవత్సరం పాటు నిపుణులతో మేధోమథనం చేసి తెలంగాణ అవసరాలకు అనుగుణంగా, ప్రాజెక్టుల్లో ఉన్న సాంకేతిక సమస్యలని, అంతర్రాష్ట్ర సమస్యలని పరిష్కరిస్తూ, ఇతర అడ్డంకుల్ని తొలగిస్తూ ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్ ని చేపట్టినారు. ఉద్యమ సమయంలో ముందుకు వచ్చిన డిమాండ్లను నెరవేర్చే క్రమంలో మరికొన్ని కొత్త ప్రాజెక్టులను చేపట్టింది. చెరువుల పునరుద్దరణకు మిషన్ కాకతీయ పథకానికి రూపకల్పన చేసింది.

60 ఏండ్ల సమైక్య రాష్ట్రంలో సాగునీటి రంగంలో తెలంగాణ అనుభవించిన వివక్షను, ఆ వివక్ష కారణంగా జరిగిన నష్టాన్ని పూరించవలసిన అవసరం తెలంగాణ ప్రభుత్వానికి ఉన్నది. సాగునీటి రంగం అభివృద్ధి మీదనే తెలంగాణ పునర్నిర్మాణం ఆధారపడి ఉన్నదన్న సంగతి కెసిఆర్‌కు తెలుసు. తెలంగాణలో వ్యవసాయాభివృద్ధి జరిగితే తెలంగాణలో ప్రజల వలసలు ఆగిపోతాయి. రైతుల ఆత్మహత్యలు ఆగుతాయి. వ్యవసాయం పుంజుకుంటే గ్రామంలో అనేక వృత్తి కులాలు బతుకుతాయి. వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వ సహాయం పెరగాలి. రైతులు పండించే పంటకు గిట్టుబాటు ధరలు లభించాలి. నాణ్యమైన విత్తనాలు, ఎరువులు సమృద్ధిగా దొరకాలి. పంటలకు నిలువ, మార్కెట్ సౌకర్యం ఉండాలి. అయితే సాగునీటి సరఫరా జరగకుండా పైవన్నీ అందుబాటులో ఉన్నా రాష్ట్రంలో నెలకొన్న వ్యవసాయ సంక్షోభం సమసిపోదు. అందువలన అన్నింటి కన్న అత్యంత కీలకమైనది సాగునీటి సరఫరా. తెలంగాణ ప్రభుత్వంపై ప్రజలకు గంపెడు ఆశలు ఉండినాయి. ప్రజలకు ఏమి కావాలి? ప్రతి ఊరికి కనీసం ఒక సాగునీటి వనరు, ఒక తాగునీటి వనరు కావాలి. అది ఎట్లా సాధ్యమో ప్రభుత్వం ఆలోచించింది. పథకాలు రూపొంచింది. ప్రభుత్వ ప్రణాళికలను వివరిస్తూ 2016 మార్చి 31 న ముఖ్యమంత్రిగా కెసిఆర్ తెలంగాణ రాష్ట్ర జల విధానంపై సుధీర్ఘమైన ప్రసంగం చేసినారు.

## 3.1 అసెంబ్లీలో చారిత్రాత్మక జలవిధాన ప్రసంగం:



ముఖ్యమంత్రిగా కెసిఆర్ గారు రాష్ట్ర అసెంబ్లీలో సాగునీటి ప్రాజెక్టుల మీద చేసిన ప్రసంగం చారిత్రాత్మకం. అది తెలంగాణ రాష్ట్ర సాగునీటి విధాన పత్రంగా భావించాలి. ఇది ఉట్టి ప్రసంగమే అయితే చెప్పవలసిన విశేషం ఏమీ ఉండేది కాదు. కంప్యూటర్ స్క్రీన్ మీద పవర్ పాయింట్ ప్రెజెంటేషన్ చేస్తూ మూడు గంటల పాటు సాగిన ప్రసంగం అది. ఆనాడు ఆయన ప్రసంగాన్ని కోట్లాది మంది ప్రజలు టీవీలో వీక్షించారు. ఆ రోజు ఆ ప్రసంగాన్ని టీవిలో వీక్షించిన కోట్లాది మందికి ఆయనలో కొత్త రూపం అగుపడింది. ఒక అనుభవజ్ఞుడైన టెక్ సవ్వీ(Tech Savvy) అయిన వ్యక్తి మాత్రమే అటువంటి ప్రసంగం చేయగలడు. గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ సహాయంతో అనితరసాధ్యంగా సాగిన ఆ ప్రసంగం ఒక సాహసోపేతమైన చర్య అని విశ్లేషకులు భావించారు. విషయ పరిజ్ఞానం ఉండడంతో పాటూ తన మీద తనకు ఎంతో విశ్వాసం ఉంటే తప్ప ఈ సాహసం రాజకీయ నాయకులు ఎవరూ చేయలేరు. భారతదేశంలో ఇటువంటి ప్రసంగాలు అటు పార్లమెంటులో గాని, ఇటు రాష్ట్రాల శాసనసభల్లో కానీ గతంలో జరిగిన దాఖలాలు లేవు. ఈ ప్రసంగం తయారీ కోసం కెసిఆర్ ఒక విద్యార్థిలాగా శ్రమించారు. ప్రాజెక్టులకు సంబందించి సమస్త సమాచారాన్ని సేకరించారు, లోతైన విశ్లేషణ చేశారు. ప్రసంగాన్ని ఎట్లా మొదలు పెట్టాలి, ఏమేమి చెప్పాలి, ఎట్లా ముగించాలి అన్న అంశాలతో ఒక లైన్ తయారు చేసుకున్నారు. ప్రసంగ పాఠాన్ని తయారు చేసుకున్నారు. శాసన సభ్యుల కోసం సమస్త సమాచారంతో ఒక పుస్తకాన్ని తయారు చేయించారు. ఈ బ్యాక్ ఎండ్ పనిలో నేనూ పాలు పంచుకున్నాను. గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్‌తో అతనికి నిత్య సహవాసం ఉండడం వలన ఏది ఎక్కడ ఉందో ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. ఇంత మేధోమధనం జరిగిన తర్వాతనే ఆయన ప్రసంగం ఇచ్చారు. అది చరిత్రాత్మక ప్రసంగంగా నిలచిపోయింది. (ఈ ప్రసంగాన్ని అడుగుజాడలు ప్రచురణ సంస్థ 2022 లో "మా తెలంగాణ కోటి ఎకరాల మాగాణం" శీర్షికతో పుస్తకరూపంలో ప్రచురించింది.)

ఇది మనం గతంలో మనం ఎన్నడూ చూడనిది. అయితే ఆయనతో అధికారిక సమీక్షా సమావేశాల్లో పాల్గొనే ఇంజనీర్లకు, ఇతర ఉన్నతాధికారులకు ఆయనలోని ఈ కోణం ఎరుకే. కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి, సీతారామ, డిండీ తదితర ఎత్తిపోతల పథకాల రీఇంజనీరింగ్ చేసేటప్పుడు, మిషన్ భగీరథ పథకాన్ని రూపకల్పన చేసేటప్పుడు, ఇతరత్రా అనేక ఇంజనీరింగ్ ప్రాజెక్టుల రూపకల్పన చేసేటప్పుడు ఆయన "గూగుల్ ఎర్త్ అప్లికేషన్" ను చాలా సమర్థవంతంగా వినియోగించడం వారందరూ చూసారు. వాటిని తిరిగి క్షేత్ర స్థాయిలో పరిశీలన చేయించి అవసరమైన మార్పులు చేయడం జరిగేది.

సాగునీటి ప్రాజెక్టుల రీఇంజనీరింగ్ ప్రక్రియ దాదాపు ఒక సంవత్సరం పాటు కొనసాగింది.

### 3.2 జల వనరుల అభివృద్ధి వ్యూహాలు - పురోగతి :

తెలంగాణా ఆవిర్భావానికి ముందు ఉన్న పరిస్థితులతో పోల్చి చూసినప్పుడు తెలంగాణ గ్రామీణ ప్రాంతాల్లో మార్పు స్పష్టంగా కనబడుతున్నది. కెసిఆర్ ముఖ్యమంత్రిగా ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం అధికార పగ్గాలు చేపట్టిన తక్షణమే ఉద్యమ ఆకాంక్ష అయిన సాగునీటి రంగంపై దృష్టి సారించింది. పైన వివరించినట్టు ఉమ్మడి ప్రభుత్వం చేపట్టిన జలయజ్ఞం వైఫల్యాలను సమీక్షించుకొని ప్రాజెక్టులను పూర్తి చేసుకోవడానికి వ్యూహాలను సిద్ధం చేసుకున్నది. గ్రామీణ అసెంబ్లీ నియోజకవర్గాల్లో అన్ని సోర్సుల ద్వారా కనీసం ఒక లక్ష ఎకరాలకు సాగునీరు, మొత్తంగా రాష్ట్రంలో ఒక కోటి 25 లక్షల ఎకరాలకు సాగునీటి సౌకర్యం కల్పించాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకుని ప్రణాళికలు తయారు చేసుకున్నది. కృష్ణా గోదావరి నదీ జలాల్లో తెలంగాణా వాటా సుమారు 1300 టిఎంసిల నీటిని పూర్తిగా వినియోగంలోకి తేవాలని సంకల్పించింది. ఈ లక్ష్యాన్ని సాధించడానికి ప్రభుత్వం బహుళ అంచెల వ్యూహాన్ని అనుసరించింది.

1) తెలంగాణ గ్రామీణ సామాజిక ఆర్థిక వ్యవస్థకు అనాది ఆధారాలుగా ఉన్న 46,500 చెరువులను దశల వారీగా పునరుద్ధరించడం.

2) గత ప్రభుత్వాలు ప్రారంభించి అనేక కారణాల వలన పూర్తి కాకుండా పెండింగ్‌లో పడిపోయిన ప్రాజెక్టులను పూర్తి చేసుకోవడం, వాటిలో కొన్నింటిని తెలంగాణా అవసరాలకు అనుగుణంగా రీ ఇంజనీరింగ్ చేసుకొని పూర్తి చేసుకోవడం.

3) గత ప్రభుత్వాలు ఆమోదించి అటకెక్కించిన ప్రాజెక్టులను సకాలంలో పూర్తి చేసి నిర్దేశిత ఆయకట్టుకు సాగునీరు, వందలాది గ్రామాలకు తాగునీరు అందించడం

4) గత ప్రభుత్వాల కాలంలో నిధులు లేక, నిర్వహణ లేక నిర్లక్ష్యానికి గురికాబడి శిథిలమైపోయిన పాత సాగునీటి ప్రాజెక్టుల కాలువల వ్యవస్థలను ఆధునీకీకరించి పూర్తి ఆయకట్టుకు సాగునీరు అందించడం.

5) పై వ్యూహాలను అమలు చేయడానికి నవీన టెక్నాలజీ వినియోగం.

పైన వివరించిన బహుళ అంచెల వ్యూహం ఈ పదేండ్ల కాలంలో ఎట్లా అమలు అయినదో, వాటి ఫలితాలు ఎట్లున్నవో సమీక్షించుకోవలసిన సందర్భం ఇది.

## 4.0 మిషన్ కాకతీయ: చెరువుల పునరుద్ధరణ

### 4.1 మిషన్ కాకతీయ రూపకల్పన :



25 ఆగస్టు, 2014న జెఎన్‌టియు ఆడిటోరియంలో మిషన్ కాకతీయపై
నీటిపారుదల ఇంజనీర్లతో మేధోమధనం.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణలో జీవనాధారంగా ఉండే గొలుసుకట్టు చెరువుల వ్యవస్థ ఏ విధంగా విధ్వంసం అయ్యిందో పైన వివరించి ఉన్నాను. తెలంగాణ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే చెరువుల పునరుద్ధరణ కోసం "మిషన్ కాకతీయ" ఫ్లాగ్ షిప్ ప్రోగ్రామ్‌ని ప్రకటించింది. ప్రతి సంవత్సరం 20% చెరువులని రాజకీయాలకు అతీతంగా అన్ని జిల్లాల్లో, అన్ని అసెంబ్లీ నియోజక వర్గాల్లో, అన్ని మండలాల్లో మిషన్ కాకతీయ అమలు కావాలని ఇంజనీర్లకు ఆదేశాలిచ్చింది. స్థానిక ప్రజలను, ప్రజా పతినిధులను సంప్రదించి చెరువులను పునరుద్ధరణకు ఎంపిక చేయడం జరిగింది. మిషన్ కాకతీయ కార్యక్రమాన్ని అమలు చేయడం కోసం మైనర్ ఇరిగేషన్ వ్యవస్థను బలోపేతం చేసింది ప్రభుత్వం. టెండర్ల ప్రక్రియను 90 రోజుల నుండి 15 రోజులకు కుదించడం జరిగింది. చెరువుల పునరుద్ధరణ ఎస్టిమేట్లకు పరిపాలనా అనుమతులను వేగంగా మంజూరు చెయ్యడం జరిగింది. చెరువుల ఎంపిక దగ్గర నుంచి అమలు దాకా ప్రజల భాగస్వామ్యాన్ని పెంచడంపై ప్రభుత్వం ప్రత్యేక దృష్టి పెట్టింది. పూడిక మట్టి పొలాల్లో చల్లుకోవడం వలన కలిగే ప్రయోజనాలపై రైతాంగానికి అవగాహన కల్పించడం జరిగింది. వ్యవసాయ, రెవెన్యూ, అటవీ, మత్స్య, భూగర్భ జల శాఖల సేవలను ఈ కార్యక్రమంలో సమర్థవంతంగా వినియోగించుకోవడం జరిగింది. జిల్లా స్థాయిలో కలెక్టర్ అధ్యక్షతన ఈ అన్ని శాఖల అధికారులతో సమన్వయ కమిటిలను ఏర్పాటు చేసి ఆయా శాఖల పనులను పర్యవేక్షించడం జరిగింది. ఈ సమన్వయ విధానాల కారణంగా మిషన్ కాకతీయ అమలు ప్రక్రియ వేగవంతం అయ్యింది. వేలాది మంది ప్రజలు, రైతులు పాల్గొన్న ఈ కార్యక్రమం నిజమైన ప్రజా ఉద్యమంగా మారింది. రైతులు తమ స్వంత ఖర్చులతో పూడిక మట్టిని తరలించుకుపోయి తమ పొలాల్లో చల్లుకున్నారు. మెరుగైన దిగుబడి సాధించుకున్నారు. రసాయనిక ఎరువులపై ఖర్చు తగ్గింది. తెలంగాణా

ప్రాంతంలో చేపల ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. మంచినీటి చేపల ఉత్పత్తిలో మొదటి ఐదు రాష్ట్రాల్లో తెలంగాణా చోటు సంపాదించింది.



12 మార్చి 2015న కామారెడ్డి జిల్లా సదాశివనగర్ పెద్దచెరువు వద్ద మిషన్ కాకతీయ ప్రారంభోత్సవం

### 4.2 మిషన్ కాకతీయ నాలుగు దశల పురోగతి :

- మిషన్ కాకతీయలో మొదటి దశలో 7659 చెరువుల పునరుద్ధరణ పూర్తి కాగా వాటి కింద 6.75 లక్షల ఎకరాలు.
- రెండవ దశలో 7654 చెరువుల పునరుద్ధరణ పూర్తి కాగా వాటి కింద 5.40 లక్షల ఎకరాలు.
- మూడవ దశలో 3843 చెరువుల పునరుద్ధరణ పూర్తి కాగా వాటి కింద 2.03 లక్షల ఎకరాలు.
- నాలుగవ దశలో 2478 చెరువుల పునరుద్ధరణ పూర్తి కాగా వాటి కింద 88 వేల ఎకరాలు, మొత్తం.

• నాలుగు దశల్లో కలిపి మొత్తం 21,634 చెరువుల కింద 15.06 లక్షల ఆయకట్టు స్థిరీకరణ పొందింది. చెరువుల్లో 8.93 టిఎంసిల నీటి నిల్వ సామర్థ్యం పునరుద్దణ జరిగింది. చెరువుల పునరుద్ధరణ కోసం ప్రభుత్వం నాలుగు దశల్లో 5,458 కోట్లు ఖర్చు చేసింది. చిన్న నీటి వనరుల అభివృద్ధి కోసం ఇన్ని నిధులు ఖర్చు చేయడం ఒక కొత్త చరిత్ర.

1.05 లక్షల ఎకరాలు చెరువుల కింద కొత్తగా సాగులోకి వచ్చాయి. 242 చిన్న నీటి ఎత్తిపోతల

పథకాల కింద గడచిన పదేండ్లలో కొత్తగా 69 వేల ఎకరాలకు సాగునీటి సౌకర్యం కల్పించడం, 1.435 లక్షల ఎకరాల ఆయకట్టుని స్థిరీకరించడం జరిగింది.

## 4.3 మిషన్ కాకతీయ ప్రభావాలు :

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన మిషన్ కాకతీయ అద్భుత ఫలితాలను సాధించింది. చెరువుల పునరుద్ధరణ వల్ల కలుగుతున్న లాభాలను రైతుల ప్రత్యక్ష అనుభవంలోకి వచ్చాయి. కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థ అయిన నాబ్కాన్స్(నాబార్డ్ అనుబంధ సంస్థ) ద్వారా రాష్ట్ర ప్రభుత్వం మిషన్ కాకతీయ ప్రభావాలపై అధ్యయనం చేయించింది. నాబ్కాన్స్ రెండు దశల మిషన్ కాకతీయ అమలు అనంతరం సంభవించిన ప్రభావాలపై అధ్యయనం చేసి 2017లో నివేదికను సమర్పించింది. మిషన్ కాకతీయకు ముందు, తర్వాత పరిస్థితిని అంచనా వేసింది. గతంలో ఉన్న గణాంకాలతో పోల్చి, ప్రస్తుతం మారిన పరిస్థితిపై అంచనా వేశారు. మిషన్ కాకతీయ అమలుకు ముందు వర్షపాతం బాగా ఉన్న 2013-14 సంవత్సరాన్ని వారు ప్రాతిపదికగా తీసుకొని 2016-17 లో వచ్చిన ఫలితాలను పోల్చి మార్పులను అంచనా వేసి సమగ్ర నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించారు.

## 4.4 నాబ్కాన్స్ అధ్యయనంలో ప్రధానాంశాలు :

### 4.4.1 పెరిగిన భూగర్భ జలాలు

భూగర్భ జల శాఖ ప్రతీ జిల్లాలో మిషన్ కాకతీయ అమలవుతున్న ఒక మైక్రో బేసిన్‌ని తమ అధ్యయనానికి ఎన్నుకున్నారు. వాటి అధారంగా భూగర్భ జలాలపై మిషన్ కాకతీయ ప్రభావాలను అంచనా వేయడం జరిగింది. 2016 మే నుంచి సెప్టెంబరు దాకా వారి అధ్యయన ఫలితాలను క్రోడీకరించారు.రాష్ట్రంలో సగటున 9 మీ వరకు భూగర్భ జలాలు పెరిగినాయి. ప్రతి రబీ పంట కాలానికి కూడా చెరువుల కింద సాగునీరు అందే అవకాశాలు ఏర్పడినాయి.

### 4.4.2 గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పరిపుష్టికి దోహదం

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పరిపుష్టం చేసే లక్ష్యంతో ప్రభుత్వం గ్రామాల్లో వ్యవసాయాన్ని, చేతి వృత్తులను ప్రోత్సహించడానికి అనేక కార్యక్రమాలు రూపొందించింది. అలాంటి కార్యక్రమాలన్నింటికీ బాగుపడిన చెరువులు ఊతమిస్తున్నాయి. వ్యవసాయంలో సాగు పెరిగింది. చేపల పెంపకానికి ఉపయోగపడుతున్నాయి. ఐదువేల చెరువుల్లో వేసిన 40 కోట్ల చేపలు పెరిగాయి. ఈ సంవత్సరం (2017) చేపల పెంపకం ద్వారా 2 వేల కోట్ల ఆదాయం వస్తుందని అంచనా. చెరువులో నీరు ఉండడం వల్ల గ్రామాల్లో గడ్డి,ఇతర చెట్లు పెరిగాయి. ఇవి పశువులకు మంచి మేతను అందించాయి. పశువులు, పక్షులకు తాగునీరు లభించింది. ఈత చెట్లు, తుమ్మ చెట్లు పెరగడానికి ఉపయోగపడ్డాయి. రజకులకు ఉపయోగపడుతున్నాయి.

### 4.4.3 శాతం పెరిగిన సాగు విస్తీర్ణం

- 2016 ఖరీఫ్ లో వర్షపాతం ఆశాజనకంగా లేకపోయినా కూడా మిషన్ కాకతీయ అమలు కారణంగా 51.5% సాగు విస్తీర్ణం పెరిగింది. సెప్టెంబరులో భారీ వర్షాలు కురిసినందువల్ల చెరువులు నిండి, ఈ పెరుగుదల రబీ పంట కాలంలో ఎక్కువగా నమోదు అయ్యింది. ఈ నిష్పత్తిలో లెక్కవేసినప్పుడు రాష్ట్రంలో చెరువుల కింద సుమారు 10.53 లక్షల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణ సాధ్యపడుతుందని అంచనా వేశారు.
- 2013-14 గ్యాప్ ఆయకట్టు 42.4 % ఉంటే 2016-17 లో 23.2 % ఉన్నది. అంటే మిషన్ కాకతీయ అమలు తర్వాత ఆయకట్టులో గ్యాప్ 19.2% (ఖరీఫ్ & రబీ కలుపుకొని) శాతానికి తగ్గిందని వారు పేర్కొన్నారు.

### 4.4.4 బావులు, బోర్లలో పుష్కలంగా నీరు

- పునరుద్ధరణ పొందిన చెరువుల ఆయకట్టులో బావులు, బోరు బావులు హెడ్ రీచ్ నుంచి టెయిల్ రీచ్ దాకా సమంగానే విస్తరించి ఉన్నాయి. సర్వేకి ఎంపిక చేసిన చెరువుల తూములను రైతులందరి స్వచ్ఛంద అనుమతితో మూసి వేసినారు. దీనితో భూగర్భ జలాలు పెరుగుతాయని బావులు, బోరు బావులకు నీరు బాగా అందుతుందని వారి అనుభవం.
- వారి అంచనాలకు అనుగుణంగానే మొత్తంగా ఆయకట్టులో ఉన్న 17 % ఎండిపోయిన బావులు, బోరు బావులు తిరిగి పునర్జీవనం పొందినాయి. ఇవి ఆయకట్టు ప్రాంతంలో , ఆయకట్టు బయట కూడా ఉన్నట్లు తేలింది.
- 2013-14 బేస్ సంవత్సరంలో భూగర్భ జలాల మట్టం 6.91 మీటర్లు పెరిగితే 2016-17 లో 9.02 మీటర్లు పెరిగినట్లు నమోదు అయ్యింది.

### 4.4.5 పెరిగిన వరి సాగు - తగ్గిన ఇతర పంటల సాగు విస్తీర్ణం

చెరువుల్లో నీటి నిల్వ సామర్థ్యం పెరగడంతో పాటు బావులు, బోర్లలో పుష్కలంగా నీటి లభ్యత ఉండడంతో వరిసాగు విస్తీర్ణం గణనీయంగా పెరిగింది. పత్తిసాగు విస్తీర్ణం 36.2% నుంచి 26.3%నికి తగ్గింది.

### 4.4.6 పెరిగిన పంటల దిగుబడి

వరి పంట దిగుబడి 4.1 % , పత్తి పంట దిగుబడి 4.7 % పెరిగినట్లుగా రికార్డు అయ్యింది.

### 4.4.7 పూడిక మట్టితో తగ్గిన ఎరువులు, పురుగుల మందుల వాడకం

సర్వే కోసం ఎంపిక చేసిన ఆయకట్టు రైతు కుటుంబాల్లో 8.5 % కుటుంబాలు పూడిక మట్టిని తమ చెలకల్లో, పొలాల్లో చల్లుకున్నారు. పూడిక మట్టిని ప్రధానంగా ఆయకట్టుకు ఆవల చౌడు భూముల్లో, మొరం భూముల్లో చల్లుకున్నట్లుగా నమోదు అయ్యింది. పూడిక మట్టి చల్లుకున్నందున రైతులకు ప్రధానంగా రసాయనిక ఎరువుల కొనుగోలులో ఖర్చు తగ్గింది. పంట దిగుబడి ద్వారా ఆదాయం పెరిగింది.

- పూడిక మట్టిని చల్లుకున్న రైతు కుటుంబాలకు రసాయనిక ఎరువుల వాడకం 35 నుంచి 50% తగ్గింది. రైతుకు రసాయనిక ఎరువుల కొనుగోళ్లపై 27.6 % ఆర్థిక భారం తగ్గింది. ఇది ఎకరానికి రూ. 1500 నుంచి రూ. 3000 వరకు పంట రకాన్ని బట్టి ఉన్నదని వారి అధ్యయనంలో తేలింది.
- పూడిక మట్టిని చల్లుకున్న రైతులకు మంచి ప్రయోజనాలు దక్కినాయి. అట్టి పొలాల్లో పంట దిగుబడి గణనీయంగా పెరిగింది. నేలలో తేమను నిలుపుకునే సామర్థ్యం పెరిగింది. ఆ కారణంగా నీటి తడుల సంఖ్య తగ్గి ఎక్కువ ఆయకట్టుకు నీరందిచగలిగినారని వారు పేర్కొన్నారు. ప్రధాన పంటల దిగుబడిలో పెరుగుదల ఈ విధంగా నమోదు అయ్యింది.
- వరి దిగుబడి ఎకరాకు 2 నుంచి 5 క్వింటాళ్ళు, పత్తి దిగుబడి ఎకరాకు 2 నుంచి 4 క్వింటాళ్లు, కందుల దిగుబడి ఎకరాకు 0.5 నుంచి 1.5 క్వింటాళ్లు, మక్క దిగుబడి ఎకరాకు 4 నుంచి 5 క్వింటాళ్లు పెరిగింది.

### 4.4.8 పెరిగిన చేపల ఉత్పత్తి

మిషన్ కాకతీయ సర్వే కోసం ఎంపిక చేసిన 70 % చెరువుల్లో 3 నుంచి 6 నెలలు మాత్రమే నీటి నిల్వ ఉంటుంది. 20% చెరువుల్లో 6 నుంచి 9 నెలలు నీటి నిల్వ ఉంటుంది. 10% చెరువుల్లో మాత్రమే సంవత్సరం పొడుగూతా నీటి నిల్వ ఉంటుంది. మొత్తంగా ఈ చెరువుల్లో 2013-14 బేస్ సంవత్సరంతో పోల్చినప్పుడు 2016-17 సంవత్సరంలో చేపల ఉత్పత్తి 36-39 % పెరిగినట్లు నమోదు అయ్యింది.

### 4.4.9 పెరిగిన రైతుల ఆదాయం

చెరువు ఆయకట్టు పరిధిలో ఉన్న ప్రాంతంలో కుటుంబాల సరాసరి ఆదాయం 78.5 % పెరిగింది. పంటలకు మద్దతు ధర వస్తున్నందున బేస్ ఇయర్‌తో పోల్చి చూసినప్పుడు వ్యవసాయ ఆదాయం 47.4 %పెరిగింది.

### 4.4.10 చెరువులపై పెరిగిన భరోసా

మిషన్ కాకతీయ అమలుకు ముందు చెరువుల పరిస్థితిపై ఆయా గ్రామాల్లో ప్రజలను అడిగినప్పుడు 63% చెరువులు బాగా లేవని, 3% చెరువులు దారుణంగా ఉన్నాయని చెప్పారు. మిషన్ కాకతీయ మొదటి దశ అమలు తర్వాత 46.7% చెరువులు చాలా బాగున్నాయని, 38% చెరువులు బాగు పడ్డాయని, 11.2% చెరువులు సంతృప్తికరంగా ఉన్నాయని, కేవలం 4.1% చెరువులు బాగా లేవని ప్రజలు అభిప్రాయపడినారు. చెరువుల నిర్వహణ కోసం రైతులు స్వచ్ఛందంగా ముందుకు వస్తున్నారు.

### 4.5 భారీ వర్షాలకు చెక్కు చెదరని చెరువు కట్టలు



మిషన్ కాకతీయలో బలోపేతమైన బోథ్ చెరువు

- నాబార్డు అధ్యయనం పరిధిలో లేని మరొక అంశాన్ని 2016-17 లో సాగునీటి శాఖ గమనించింది. ఆ ఏడు సెప్టెంబరులో కురిసిన వర్షం 100 ఏండ్లకు ఒక్కసారి వచ్చే పెద్ద వర్షం. అయినా కూడా మిషన్ కాకతీయలో చెరువు కట్టలు బలోపేతం అయిన కారణంగా వరదలకు తెగిపోయిన చెరువులు , ఇతరత్రా నష్టపోయిన చెరువుల సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. వేల సంఖ్యలో నష్టానికి గురి అయ్యే చెరువులు వందల్లోకి పడిపోయినాయి.
- బాగా వర్షాలు పడిన సంవత్సరాల్లో నష్టపోయిన చెరువుల సంఖ్య ఈ విధంగా ఉన్నది. 2009 లో 1107 , 2010 లో 4251, 2013 లో 1868, 2016 లో కేవలం 571 మాత్రమే. అది మిషన్ కాకతీయలో చెరువు కట్టలను బలోపేతం చేసినందువల్లనే సాధ్యమయ్యింది.

### 4.6 చెరువుల కింద 15 లక్షల ఎకరాల సాగు

మిషన్ కాకతీయ కార్యక్రమంలో పునరుద్దరణకు నోచుకున్న చెరువుల్లోకి పుష్కలంగా నీరు వచ్చి చేరినందున 2016-17 రబీ పంట కాలానికి ఆయకట్టుకు సరిపడా నీరందింది. రెండేండ్ల వరుస కరువుల అనంతరం చెరువుల్లోకి నీరు చేరింది. పదేళ్ల నుంచి తమ ఊరి చెరువుల్లో నీరు చూడని గ్రామస్తులు పునరుద్దరణ అనంతరం చెరువులు నీటితో కళకళలాడుతుంటే చూసి ఉప్పొంగి పోయినారు. గత రబీ సీజన్‌లో చెరువుల కింద రికార్డు స్థాయిలో 15 లక్షల ఎకరాల్లో సాగు జరిగినట్లు వ్యవసాయ శాఖ లెక్కలు తెలుపుతున్నాయి.ధాన్యం, ఇతర పంటల కొనుగోళ్ళ ద్వారా పంటల దిగుబడి పెరిగిన విషయాన్ని మార్కెటింగ్ శాఖ అంచనా వేసింది. మిషన్ కాకతీయ విజన్ సఫలం అయ్యింది. ప్రభుత్వం

ఈ పథకం ద్వారా ఏ ఫలితాలను, ఏ మార్పులను ఆశించిందో అవి సాకారం అయినాయి.




### 4.7 మిషన్ కాకతీయకు ప్రశంశలు :

నాలుగు దశలలో అమలైన మిషన్ కాకతీయ అద్భుత ఫలితాలు సాధించిన సంగతిని నాబార్డ్ వారి అధ్యయనం తేటతెల్లం చేసింది. దేశ వ్యాప్తంగా అందరి చేత ప్రశంసలు అందుకున్నది. వాటర్ మ్యాన్ అఫ్ ఇండియాగా పేరున్న రాజేంద్ర సింగ్, దేశంలో వ్యవసాయ విప్లవానికి పితామహుడిగా పేరున్న ప్రముఖ వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.ఎస్ స్వామినాథన్, నీతి ఆయోగ్ మాజీ చైర్మన్ అరవింద్ పనగారియా లాంటి ప్రముఖులు మిషన్ కాకతీయను కొనియాడారు. 2019 లో సెంట్రల్ బోర్డ్ అఫ్ ఇరిగేషన్ & పవర్ (CBIP) వారు మిషన్ కాకతీయను ఉత్తమ సాగునీటి పథకంగా ఎంపిక చేసి అవార్డును ప్రధానం చేసింది. మిషన్ కాకతీయ దేశంలో ఇతర రాష్ట్రాలకు ఆదర్శంగా మారింది. మిషన్ కాకతీయ స్ఫూర్తితో మహారాష్ట్ర ప్రభుత్వం "జల్ యుక్త్ శివార్ అభియాన్" కార్యక్రమాన్ని రూపొందించి 2017 నుంచి అమలు చేస్తున్నది.

సెప్టెంబర్, 2019 మొదటి వారంలో ఇండోనేషియా బాలి ద్వీపంలో International Commission on Irrigation and Drainage వారు నిర్వహించిన అంతర్జాతీయ సదస్సులో కూడా మిషన్ కాకతీయకు ప్రసంశలు లభించాయి. మిషన్ కాకతీయపై పత్రం ఆ సదస్సులో సమర్పించడానికి ఎంపిక కావడం విశేషం. మిషిగాన్, షికాగో విశ్వవిద్యాలయాలు, International Water Management Institute వారు మిషన్ కాకతీయ ప్రభావాలపై అధ్యయనాలు చేసి అద్భుతమైన ఫలితాలు సాధించిందని నివేదికలు ప్రచురించినాయి.

## 5.0 పెండింగ్ ప్రాజెక్టుల పురోగతి:

### 5.1 భూసేకరణ

తెలంగాణా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే తొలుత పెండింగ్ ప్రాజెక్టుల సమస్యలను విశ్లేషించింది. ప్రాజెక్టులు నత్తనడక సాగడానికి ప్రధాన అవరోధమైన భూసేకరణ సమస్యని పరిష్కరించి ల్యాండ్ ప్రొక్యూర్‌మెంట్ పాలసీ జి.ఒ నంబరు 123 తేదీ 30.07.2015 ని ప్రభుత్వం జారీ చేసింది. ఆ తర్వాత 2013 భూసేకరణ సవరణ చట్టాన్ని రూపొందించింది. ఈ చర్యలు మంచి ఫలితాలని ఇచ్చాయి. దశాబ్ద కాలంగా అవరోధంగా ఉన్న భూసేకరణ సమస్య సమసిపోయింది. ప్రాజెక్టుల పనులు వేగం పుంజుకున్నాయి. రైల్వే శాఖ, రోడ్డు భవనాల శాఖల నుండి ప్రాజెక్టుల క్రాసింగ్ లకు క్లియరెన్స్ లు పొందడంతో క్రాసింగ్ పనులు వేగంగా ముందుకు సాగినవి.

## 5.2 అంతర్రాష్ట్ర సమస్యలు

ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టులో మహారాష్ట్రతో పదేండ్లుగా అపరిష్కృతంగా ఉన్న అంతర్రాష్ట్ర వివాదాలను తెలంగాణా ప్రభుత్వం చొరవ తీసుకొని పరిష్కరించింది. ముఖ్యమంత్రి కెసిఆర్ స్వయంగా ముంబాయి వెళ్లి మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవిస్ తో చర్చించారు. ఈ చర్చల అనంతరం ప్రాణహిత, గోదావరి, పెన్ గంగా నదులపై ప్రాజెక్టులని నిర్మించుకోవడానికి మహారాష్ట్రతో చారిత్రాత్మక ఒప్పందంపై రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు సంతకాలు చేసారు. పొరుగు రాష్ట్రాలతో ఘర్షణ వైఖరిని విడనాడి ఇచ్చి పుచ్చుకునే విధానం రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్నందు వలన ఈ ఒప్పందం దేశానికి ఆదర్శంగా మారింది. ఈ ఒప్పందం ఫలితంగా ప్రాణహితపై తమ్మిడిహట్టి వద్ద, గోదావరిపై మేడిగడ్డ వద్ద, పెన్ గంగా నదిపై చనాక-కోరాట వద్ద బ్యారేజీల నిర్మాణానికి మార్గం సుగమం అయ్యింది. తుమ్మిడిహట్టి బ్యారేజి మినహా ఈ బ్యారేజీల నిర్మాణ పనులు శరవేగంగా, పనులు ప్రణాళికా బద్ధంగా పూర్తి అయినాయి. 2019 లో మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ బ్యారేజీల ద్వారా నీటిని ఎత్తి పోయడం ఒక అద్భుతమైన చారిత్రిక ఘట్టంగా నిలచిపోయింది.

## 5.3 కేంద్రప్రభుత్వ అనుమతులు

గడచిన ఐదేండ్లలో కల్వకుర్తి, డా. బి ఆర్ అంబేద్కర్ ప్రాణహిత, కాళేశ్వరం, కాళేశ్వర-ముక్తేశ్వర ఎత్తిపోతల పథకం(చిన్న కాళేశ్వరం), పాలమూరు రంగారెడ్డి, పెన్ గంగ కాలువ, చనాక కోరాట బ్యారేజీ, తుపాకులగూడెం, సీతారామా లాంటి కీలక ప్రాజెక్టులకు, కేంద్ర జల సంఘం, అటవీ, పర్యావరణ, వన్యప్రాణి అనుమతులు సాధించడం చెప్పుకోదగిన విశేషం. గతంలో ప్రాజెక్టులకు అనుమతులు తేవడం ఓ ప్రహసనంగా ఉండేది. అయితే తెలంగాణ ప్రభుత్వం అనుమతులు సాధించే క్రమంలో కేంద్ర సంస్థలను పరుగులు పెట్టించింది. కాళేశ్వరం ప్రాజెక్టుకు ఒక్క సంవత్సరంలోనే టెక్నికల్ అడ్వైజరీ కమిటీ(TAC) అనుమతి సహా అన్ని కీలక అనుమతులు పొందడం ఒక రికార్డు.

## 5.4 ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్

ముఖ్యమంత్రి స్థాయిలో కొన్ని నెలల పాటు ఇంజనీరింగ్ నిపుణులతో, రిటైర్డ్ ఇంజనీర్లతో సమావేశమై సర్వే ఆఫ్ ఇండియా వారి మ్యాపులు, గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ సహాయంతో అధ్యయనం చేసిన అనంతరం ప్రాణహిత-చేవెళ్ళ సుజల స్రవంతి, ఖమ్మం జిల్లాలో చేపట్టిన రాజీవ్ దుమ్ముగూడెం, ఇందిరా సాగర్, ఎసారెస్పీ వరద కాలువ, దేవాదుల, కంతనపల్లి ప్రాజెక్టులను తెలంగాణ అవసరాలకు అనుగుణంగా రీ ఇంజనీరింగ్ చేసుకున్నాము. కొత్త ప్రతిపాదనలతో ప్రాజెక్టుల పనులను కొనసాగునాయి.

## 6.0 గడచిన ఐదేండ్లలో తెలంగాణా ప్రభుత్వం పూర్తి చేసిన ప్రాజెక్టులు :

రాజీవ్ భీమా ఎత్తిపోతల పథకం, కోయిల్ సాగర్, తుమ్మిళ్ళ ఎత్తిపోతల పథకం (11 నెలల్లో పూర్తి అయ్యింది), భక్త రామదాసు ఎత్తిపోతల పథకం (10 నెలల్లో పూర్తి అయ్యింది), శ్రీరామ్ సాగర్ రెండో

దశ, మిడ్ మానేరు జలాశయం, గోదావరి నదిపై కాళేశ్వరం ప్రాజెక్టులో భాగంగా నిర్మించిన లక్ష్మి బ్యారేజి(మేడిగడ్డ), సరస్వతి బ్యారేజి(అన్నారం), పార్వతి బ్యారేజి (సుందిళ్ల), లక్ష్మి, సరస్వతి, పార్వతి పంప్ హౌజ్ లు, 13.5 కిమీ గ్రావిటి కాలువ, నంది, గాయత్రి భూగర్భ పంప్ హౌజ్ లు, కాళేశ్వరం లింక్-2 లో 10 మీ వ్యాసం కలిగిన జంట సొరంగాలు, అన్నపూర్ణ, రంగనాయకసాగర్, మల్లన్న సాగర్, కొండపోచమ్మసాగర్ జలాశయాలు, వాటి అనుబంధ పంప్ హౌజ్ లు, శ్రీరాంసాగర్ పునరుజ్జీవన పథకం, బాగారెడ్డి సింగూరు కాలువలు & సిలారు రాజనరసింహ ఎత్తిపోతల పథకం, అలిసాగర్ ఎత్తిపోతల పథకం, గుత్ప ఎత్తిపోతల పథకం, కిన్నెరసాని కాలువలు, గొల్లవాగు, పాలెంవాగు, ర్యాలివాగు, గడ్డెన్న సుద్దవాగు, చౌటుపల్లి హనుమంత్ రెడ్డి ఎత్తిపోతల పథకం, మత్తడివాగు, గూడెం ఎత్తిపోతల పథకం, ఎన్టీఆర్ కాలువ (బేతుపల్లి వరద కాలువ), గట్టుపొడిచిన వాగు, సమ్మక్కసాగర్ బ్యారేజి(తుపాకులగూడెం)



సమ్మక్క సాగర్ బ్యారేజి



రంగనాయకసాగర్ జలాశయం

## 6.1 పాక్షికంగా పూర్తి అయి ఆయకట్టుకు సాగునీరు అందిస్తున్న ప్రాజెక్టులు :

గోదావరి బేసిన్లో కాళేశ్వరం, దేవాదుల, యెల్లంపల్లి ఎత్తిపోతల పథకం, శ్రీరాంసాగర్ వరద కాలువ, కొమురం భీమ్ కృష్ణా బేసిన్లో ఎలిమినేటి మాధవరెడ్డి ఎస్ఎల్బిసి, మహాత్మాగాంధి కల్వకుర్తి, జవాహర్ నెట్టెంపాడు, కోయిల్ సాగర్ ఎత్తిపోతల పథకాలు.







కాళేశ్వరం ప్రాజెక్టు డెలివరి సిస్టర్న్ నిర్మాణాలు

వీటి ద్వారా కొత్తగా 15.05 లక్షల ఎకరాలకు సాగునీటి సౌకర్యం కల్పించడం, మరో 15.24 లక్షల ఎకరాల ఆయకట్టును స్థిరీకరించడం జరిగింది.



మహాత్మగాంధీ కల్వకుర్తి ఎత్తిపోతల పథకం

ఉమ్మడి మహబూబ్ నగర్ జిల్లాలో నాలుగు (కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్ సాగర్) ఎత్తిపోతల పథకాల కింద 2022-23 సంవత్సరంలో 8 లక్షల ఎకరాలకు సాగునీరు అందించినందున, 700 పైబడి చెరువులని నింపినందున ఉమ్మడి మహబూబ్ నగర్ జిల్లాలో అద్భుతమైన ఫలితాలు కానవస్తున్నాయి. గతంలో ఎన్నడూ లేనంత పంట దిగుబడి రైతులకు వచ్చింది. జిల్లా నుంచి వలసలు ఆగిపోయినాయి. వలసలు వెళ్ళిన వారు స్వంత ఊర్లకు తిరిగి వచ్చిన్నారు. జిల్లాలో ఒక స్పష్టమైన ఆర్థిక, సామాజిక మార్పు కనబడుతున్నది. ఇదంతా తెలంగాణా ప్రభుత్వం మహబూబ్ నగర్ జిల్లా ప్రాజెక్టులపై చూపించిన ప్రత్యేక శ్రద్ధ వల్లనే సాధ్యమయ్యింది. రాజోలిబండ డైవర్షన్ స్కీం కింద 56 వేల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణకు తుమ్మిళ్ళ ఎత్తిపోతల పథకాన్ని కేవలం 10 నెలల్లోనే పూర్తి చేసి 2017 డిసెంబర్ లో ఆర్డిఎస్ కాలువలోకి నీటిని ఎత్తిపోయడం జరిగింది.

సింగూరు కాలువలను పూర్తి చేసి మెదక్ జిల్లాలో 37.5 వేల ఎకరాలకు సాగునీరు అందించడం జరిగింది. దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత ఒక ప్రాజెక్టు నుంచి మెదక్ జిల్లాలో నీరివ్వడం ఇదే తొలి సారి.

కరీంనగర్ జిల్లాలో ఎల్లంపల్లి ప్రాజెక్టు ముంపు గ్రామాల పునరావాసం సమస్యలను పరిష్కరించి, రాయపట్నం బ్రిడ్జ్‌ని నిర్మింపజేసి 20 టిఎంసిల పూర్తి స్థాయి నిల్వ సాధించగలిగింది. ఎల్లంపల్లి ఎత్తిపోతల ద్వారా 54 వేల ఎకరాలకు, చెరువులను నింపినందున మరో 37,000 ఎకరాలు స్థిరీకరణ జరగింది.

2019 లో ఎస్.ఆర్.ఎస్.పి రెండవ దశ కాలువల ద్వారా సూర్యాపేట, తుంగతుర్తి నియోజక వర్గాలకు కాళేశ్వరం నీటిని తరలించి 4 లక్షల ఎకరాల ఆయకట్టుకు వందలాది చెరువులను నింపడం జరిగింది.

ఖమ్మం జిల్లాలో 11 నెలల రికార్డు సమయంలో భక్త రామదాసు ఎత్తిపోతల పథకాన్ని పూర్తి చేసి 100 చెరువులను నింపడం, శ్రీరాంసాగర్ రెండో దశలో ఉన్న డిబిఎం-60 కాలువ ద్వారా 12

వేల ఎకరాలకు సాగునీరు అందించడం జరిగింది. 2023 సంవత్సరం నాటికి ఈ కాలువ కింద ఉన్న మొత్తం 58 వేల ఎకరాలకు సాగునీరు అందుతున్నది. పాలేరు పాత కాలువను 4 నెలల్లో పునరుద్ధరించి 10 వేల ఎకరాలకు సాగునీరు అందించడం జరిగింది.



ఉదయ సముద్రం బ్యాలెన్సింగ్ రిజర్వాయర్

నాగార్జునసాగర్ లో లెవల్ కాలువ పంపు హజ్ పనులు పూర్తి అయిన కారణంగా 2018 లో అనేక చెరువులని నింపి చెరువుల కింద ఆయకట్టును కాపాడడం జరిగింది. LLC కింద 50,000 ఎకరాల కొత్త ఆయకట్టుకు నీరందించాలన్న లక్ష్యంతో కాలువ పనులు జరుగు తున్నాయి.

నల్లగొండ జిల్లాలో ఉదయ సముద్రం పథకంలో కీలకమైన బ్రాహ్మణ వెల్లెమ్ల జలాశయం, పంప్ హౌజ్, సర్జ్ పూల్, టన్నెల్ నిర్మాణం పూర్తి అయినాయి. కాలువల తవ్వకం కొనసాగుతున్నది. ఈ ఎత్తిపోతల పథకం నుండి ఇటీవలే బ్రాహ్మణ వెల్లెమ్ల జలాశయానికి నీటిని విజయవంతంగా ఎత్తిపోయడం జరిగింది. ఈ ప్రాజెక్టు ద్వారా నీటిని ఎత్తిపోసి చెరువులను నింపడానికి, ఆయకట్టుకు సాగు నీరు అందించేందుకు మిగిలిన పనులు సాగుతున్నాయి.

## 7.0 ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్

ఉమ్మడి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ప్రారంభించిన ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు 2008 లో ప్రారంభమైనా తెలంగాణ ఏర్పడే నాటికి మహారాష్ట్రతో అంతర్రాష్ట్ర వివాదాలు, భూసేకరణ సమస్యలు, అటవీ సమస్యలు, కేంద్ర ప్రభుత్వ అనుమతులు. ఇలా అనేక సమస్యల్లో కూరుకుపోయి ఈ ప్రాజెక్టు అటకెక్కింది. తెలంగాణ ఏర్పడగానే ప్రభుత్వం ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు సహా అన్నీ ప్రాజెక్టులను కూలంకషంగా సమీక్షించింది. ప్రాజెక్టుల ప్రతిపాదిత ఫలాలు రైతాంగానికి అందాలంటే ప్రాజెక్టులను రీ ఇంజనీరింగ్ చేయడం అవరసమని కెసిఆర్ నిర్ణయానికి వచ్చారు. ఉమ్మడి రాష్ట్రం అమలు చేసిన డా. బి ఆర్ అంబేద్కర్ ప్రాణహిత చేవెళ్ళ సుజల స్రవంతి, ఇందిరమ్మ వరద కాలువ, రాజీవ్ దుమ్ముగూడెం

& ఇందిరా రుద్రంకోట ఎత్తిపోతల పథకాలు, దేవాదుల, కాంతనపల్లి ప్రాజెక్టులను, ఉమ్మడి రాష్ట్రం పరిపాలనా అనుమతులు ఇచ్చి అటకెక్కించిన పాలమూరు-రంగారెడ్డి, ఆర్ విద్యాసాగర్ రావు డిండీ ఎత్తిపోతల పథకాలను సమీక్షించి తెలంగాణ అవసరాలకు అనుగుణంగా రీ-ఇంజనీరింగ్ చేసుకోవడం జరిగింది. ఈ పథకాల రీ-ఇంజనీరింగ్ పనులు త్వరితగతిన పూర్తి చేయడానికి ప్రభుత్వం అవిరళ కృషి చేస్తున్నది. ఈ పనులన్నీ యుద్ధ ప్రాతిపదికన సాగుతున్నాయి.

## 7.1 కాళేశ్వరం ప్రాజెక్టు :



గోదావరి నదిపై మేడిగడ్డ వద్ద నిర్మించిన బ్యారేజి

మొదట దృష్టి సారించింది ప్రాణహిత - చేవెళ్ళ ప్రాజెక్టు రీ-ఇంజనీరింగ్ పైన. ఈ ప్రక్రియ కాళేశ్వరం ప్రాజెక్టు రూపకల్పనకు దారి తీసింది. కాళేశ్వరం ప్రాజెక్టు రూపకల్పన దశ నుంచి అన్నినిర్మాణ దశలను దగ్గరుండి ముఖ్యమంత్రి కెసిఆర్, ఆనాటి సాగునీటి మంత్రి తన్నీరు హరీష్ రావు గార్లు ప్రత్యక్షంగా పర్యవేక్షించినారు. ప్రాజెక్టు రీ-ఇంజనీరింగ్ కోసం ఆయన జరిపిన మేధోమధనం దాదాపు 6 నెలల పాటు సాగింది. సాగునీటి శాఖ సమీక్ష అంటే ఉదయం 11 గంటల నుంచి రాత్రి 11 గంటల వరకు సాగిన సందర్భాలు చాలా ఉన్నాయి. గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్, సర్వే ఆఫ్ ఇండియా మ్యాపులు, వాప్కోస్ వారి లిడార్ సర్వే నివేదికలు, రిటైర్డ్ ఇంజనీర్ల క్షేత్ర పర్యటనలు కాళేశ్వరం ప్రాజెక్టు ఈ రూపంలో ప్రాణం పోసుకోవడానికి దారి తీసింది. అన్ని ప్రత్యామ్నాయాలను అధ్యయనం చేసిన తర్వాత మేడిగడ్డ-ఎల్లంపల్లి వరకు నదీ మార్గాన్నే ముఖ్యమంత్రి ఎంపిక చేయడం జరిగింది. ఎటువంటి ముంపు లేకుండా, పునరావాస సమస్యలు లేకుండా నదినే జలాశయాలుగా మార్చుకొని నీటిని పైకి ఎత్తిపోయడం ఇందులో ప్రధానాంశం. ఇందులో మూడు కొత్త బ్యారేజిలు, వాటికి అనుబంధంగా మూడు పంప్ హౌజ్

లు ప్రతిపాదించడం జరిగింది. మూడేండ్లలోనే వీటి నిర్మాణం పూర్తి అయి 2019 లో నీటిని ఎత్తిపోయడం ప్రారంభించినాయి. రూపకల్పనా సమయంలో ముఖ్యమంత్రి ఏ కలగన్నారో అది ఇవ్వాళ్ళ సాక్షాత్కారం అయ్యింది.



మల్లన్నసాగర్ విహంగ వీక్షణం

2019 జూన్, జూలై నెలలో కరువు తాండవిస్తున్న సమయంలో గోదావరి నది 150 కి మీ పొడవున సజీవం అయ్యింది. ఈ మూడు బ్యారేజీల్లో మొత్తం 36 టిఎంసిల నీరు నిలువ ఉంటుంది. గోదావరి నీరు మేడిగడ్డ నుంచి అన్నారం, అన్నారం నుంచి సుందిళ్ళ, సుందిళ్ళ నుంచి ఎల్లంపల్లికి ఎదురెక్కి వస్తుంటే ప్రజలు గోదావరి మాతకు జల నీరాజనం పట్టినారు. జలభోజనాలు, జల జాతరలు నిర్వహించుకున్నారు. కరువు కాలంలో గోదావరి ఇట్లా ఎదురెక్కి రావడం వారికి ఒక కొత్త అనుభవం. శ్రీరాంసాగర్ రెండో దశ ఆయకట్టుకు కాలువలు తవ్విన 15 ఏండ్లకు నీరు పారడం కాళేశ్వరం నిర్మాణంతోనే సాధ్యం అయ్యింది. 2019-20 యాసంగి సీజన్‌లో వంద శాతం ఆయకట్టుకు.. సుమారు 13.50 లక్షల ఎకరాలకు నీరు ఇవ్వడం శ్రీరాంసాగర్ చరిత్రలోనే ప్రథమం.





మల్లన్నసాగర్‌లోకి చేరుతున్న గోదావరి జలాలు

2020 సంవత్సరంలో కాళేశ్వరం ప్రాజెక్టు లింక్ 4 లో అంటే మిడ్ మానేరు జలాశయం నుంచి కొండ పోచమ్మ జలాశయం దాకా ఉన్న అనంతగిరి, రంగనాయకసాగర్, కొండపోచమ్మసాగర్ జలాశయాలకు నీరు రావడం, ఎండాకాలంలో ఆ నీటితో సిద్దిపేట, సిరిసిల్ల, మానకొండూరు,



కాళేశ్వరం ప్రాజెక్టుకు నిర్మాణ పనులను పర్యవేక్షిస్తున్న ముఖ్యమంత్రి కె.సి.ఆర్.




**మల్లన్నసాగర్ ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి కె.సి.ఆర్.**

హుస్నాబాద్ నియోజక వర్గాల్లో ఉన్న వందలాది చెరువులు, కుంటలు, చెక్ డ్యాంలు నిండి పొంగి పొర్లుతున్న దృశ్యాలు ప్రజలను ఆనందాశ్చర్యాలకు లోను చేస్తున్నవి. 2022 లో ఎండాకాలంలో కాళేశ్వరం ప్రాజెక్టుతో కూడవెళ్ళి వాగును అనుసంధానం చేసి దారిలో అనేక చెక్ డ్యాంలు నింపుకుంటూ అప్పర్ మానేరు జలాశయానికి గోదావరి నీరు చేరిన వైనాన్ని చూసి ఆ ప్రాంత ప్రజలు ఆనంద పరవషులైనారు. ఆ క్రమంలోనే 2021 లోనే కాళేశ్వరం ప్రాజెక్టులో Mother Reservoir గా భావిస్తున్న కొమురవెల్లి మల్లన్న సాగర్ జలాశయంలోకి కూడా నీటిని ఎత్తిపోసి కాళేశ్వరం ప్రాజెక్టుతో హల్దీ వాగును కూడా అనుసంధానం చేసి దారిలో చెక్ డ్యాంలు నింపుతూ గోదావరి నీరు నిజాంసాగర్ జలాశయానికి చేరే మరొక వైనాన్ని ప్రజలు చూసినారు. ఇది ఆయన ఊహించిన తెలంగాణకు జలహారం పథకం.

కాళేశ్వరం ప్రాజెక్టుపై ఎన్ని అడ్డంకులు ఎదురైనా వాటిని అధిగమించి ప్రాజెక్టును ఆయన సాకారం చేశారు. కాళేశ్వరం ఇప్పుడు సమగ్ర గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకంగా మన ముందు సాక్షాత్కరించింది. వ్యవసాయం, తాగునీరు, పరిశ్రమలు, మత్స్య పరిశ్రమ, టూరిజం, పట్టాణాభివృద్ధి, పర్యావరణం, దేశీయ జల రవాణా తదితర రంగాలను ప్రభావితం చేసి తెలంగాణా సమగ్ర వికాసానికి దోహదం చేసే ఒక ప్రగతి రథంగా (Growth Engine) మారబోతున్నది. కాళేశ్వరం ప్రాజెక్టు తెలంగాణా ప్రజల సాగునీటి ఆకాంక్షలను నెరవేర్చేందుకు సిద్ధం అయ్యింది. ఇదంతా తెలంగాణా ఒక రాష్ట్రంగా ఏర్పడినందు వల్లనే సాధ్యం అయిందనేది నిర్వివాదాంశం. అందుకు ముఖ్యమంత్రి కెసిఆర్ సంకల్ప బలం తోడయ్యింది. ఈ సంగతులన్నీ కెసిఆర్ గారు తన ప్రసంగంలో పేర్కొన్నారు. (కాళేశ్వరం ప్రాజెక్టుపై మరిన్ని వివరాలు తెలుసుకోవడానికి సంప్రదించిన గ్రంధాల జాబితాతో పేర్కొన్న ఈ పుస్తక రచయిత రాసిన 1. కాళేశ్వరం ప్రాజెక్టు – తెలంగాణ ప్రగతి రథం 2) కాళేశ్వరం ప్రాజెక్టు : ప్రశ్నలు – విమర్శలు – వక్రీకరణలు – వివరణలు పుస్తకాలను చదవవచ్చు)

### 7.1.1 మహారాష్ట్రతో చారిత్రాత్మక అంతర్రాష్ట్ర ఒప్పందం :

కాళేశ్వరం ప్రాజెక్టు సాకారం కావడానికి అత్యంత కీలకమైనది 08.03.2016న మహారాష్ట్రతో కుదిరిన అంతర్రాష్ట్ర ఒప్పందం. ముఖ్యమంత్రి స్వయంగా అనేక సార్లు ముంబాయి వెళ్లి మహారాష్ట్రా ముఖ్యమంత్రి



**08.03.2016న ముంబాయిలో అంతర్రాష్ట్ర ఒప్పందంపై సంతకాలు చేసిన ముఖ్యమంత్రులు దేవేంద్ర ఫడ్నవీస్ & కెసిఆర్**

దేవేంద్ర ఫడ్నవిస్ తో పరస్పర సహకారమే లక్ష్యంగా చర్చలు జరిపి ఒప్పందానికి అనుకూలంగా మార్చినారు. ఇటువంటి ఒప్పందం ఉమ్మడి రాష్ట్రంలో సాధ్యం కాలేదు కనుకనే తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజి నిర్మాణం పదేండ్లు ముందుకు కదలలేదు. ఈ చారిత్రాత్మక ఒప్పందం కారణంగా పెన్ గంగ, ప్రాణహిత, గోదావరి నదులపై చనాకా – కొరట, తుమ్మిడిహట్టి, మేడిగడ్డ బ్యారేజిల నిర్మాణానికి మార్గం సుగమం అయ్యింది. ఈ మూడింటిలో మేడిగడ్డ బ్యారేజి, చనాకా – కొరట బ్యారేజిల నిర్మాణం పూర్తి అయినాయి. మహారాష్ట్రాతో ఈ అంతర్రాష్ట్ర ఒప్పందమే కేంద్రం నుంచి ప్రాజెక్టుకు అనుమతులు రాబట్టడానికి ప్రాతిపదిక అయ్యింది. మహారాష్ట్రాతో ఒప్పందం నదీ జలాల వివాదాల పరిష్కారానికి ఇచ్చిపుచ్చుకునే ధోరణితో చర్చలే అత్యుత్తమ పరిష్కారం అని యావత్ దేశానికి ఒక మార్గనిర్దేశనం చేసింది. ఇచ్చిపుచ్చుకునే వైఖరిని ప్రదర్శిస్తే దశాబ్దాల తరబడి అపరిష్కృతంగా ఉన్నవివాదాలు కూడా పరిష్కారం అవుతాయని ఈ ఒప్పందం నిరూపించింది. మహారాష్ట్రాతో అంతర్రాష్ట్ర ఒప్పందానికి ఆయన పడిన శ్రమను తన అసెంబ్లీ ప్రసంగంలో వివరించారు. పొరుగు రాష్ట్రాలన్నిటితో ఇచ్చి పుచ్చుకునే ధోరణితోనే తమ ప్రభుత్వం ముందుకు సాగుతుందని ఉద్ఘాటించారు.

మహారాష్ట్రా తమ భూభాగంలో ముంపును అనుమతించలేమని, తుమ్మిడిహట్టి బ్యారేజి ఎఫ్ఆర్ఎల్ ని 152 మీ ల నుంచి 148 మీ కు తగ్గించమని కోరింది. అదే సమయంలో తుమ్మిడిహట్టి వద్ద 165 టిఎంసిల నీటి లభ్యత మాత్రమే ఉందని, అందులో కూడా భవిష్యత్తులో పై రాష్ట్రాలు వాడుకునే 63 టిఎంసి ల నీరు కలిసి ఉందని కేంద్ర జలవనరుల సంఘం చెప్పింది. తుమ్మిడిహట్టి వద్ద నుంచి తరలించగలిగే నీటి పరిమాణాన్ని పున:సమీక్షించుకొమ్మని ప్రాజెక్టు అధికారులకు సూచన చేసింది. ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టులో నీటి నిల్వ సామర్థ్యం చాలా తక్కువగా ఉందని, ప్రాజెక్టు అవసరాలకు తగినంత ఆన్‌లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవాలని, మరికొన్ని కృత్రిమ జలాశయాలు నిర్మించుకోవాలని కూడా కేంద్ర జల సంఘం సిఫారసు చేసింది. ఈ పరిస్థితుల దృష్ట్యా ప్రభుత్వం తెలంగాణ భవిష్యత్ అవసరాలకు అనుగుణంగా, నీటి ప్రవాహాలు తగ్గిపోయిన శ్రీరాంసాగర్, నిజాంసాగర్,





21 జూన్, 2019న భూపాలపల్లి జిల్లా కన్నెపల్లి పంప్‌హౌజ్ వద్ద
గవర్నర్ ఇఎస్ఎల్ నరసింహన్, మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్,
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వై.ఎస్. జగన్మోహన్ రెడ్డి సమక్షంలో కాళేశ్వరం ప్రాజెక్టును
ప్రారంభించి, జాతికి అంకితం చేసిన ముఖ్యమంత్రి కె.సి.ఆర్. గారు

సింగూరు, వరద కాలువ ఆయకట్టుని స్థిరీకరించడానికి ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు రీఇంజనీరింగ్ అవసరమయ్యింది.

### 7.1.2 రీ ఇంజనీరింగ్ అనంతరం ప్రాజెక్టు ప్రతిపాదనలు :

గోదావరిపై మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ వద్ద బ్యారేజిలు, పంపు హౌజ్ లు నిర్మించి రోజుకు 2 టిఎంసిల (భవిష్యత్ లో రోజుకు 3 టిఎంసిలు) నీటిని ఎత్తిపోసి ఎల్లంపల్లికి చేర్చడం, అక్కడి నుంచి మిడ్ మానేరు, అనంతగిరి, రంగనాయక సాగర్, మల్లన్నసాగర్, కొండ పోచమ్మ సాగర్, గంధమల్ల, బస్వాపూర్ తదితర జలాశయాలకు నీటిని తరలించి 13 జిల్లాల్లో 18.25 లక్షల కొత్త ఆయకట్టుకు, 26.76 లక్షల స్థిరీకరణకు నీటిని అందించాలన్న లక్ష్యంతో కాళేశ్వరం ప్రాజెక్టు రూపకల్పన జరిగింది. దీనికి తోడు హైదారాబాద్ నగరానికి, దారి పొడుగునా ఉన్న వందలాది గ్రామాలకు తాగునీరు, పారిశ్రామిక అవసరాలకు నీరు అందించడం కూడా కాళేశ్వరం ప్రాజెక్టు లక్ష్యం. ప్రాజెక్టు పనులకు నిధుల కొరత లేకుండా ప్రభుత్వం చర్యలు తీసుకుంది. కాళేశ్వరం ప్రాజెక్టు పనులు న భూతో న భవిష్యత్ అన్న రీతిలో మూడు షిఫ్టుల్లో పనులు జరిగినాయి. సుమారు 50 వేల మంది కార్మికులు, వందలాది మంది ఇంజనీర్లు ప్రాజెక్టు పనుల్లో శ్రమించారు.

పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో కాళేశ్వరం ప్రాజెక్టును డిజైన్ చేయడం జరిగింది. కాళేశ్వరం ప్రాజెక్టు బ్యారేజీలు, పంప హౌజ్ , సర్జ్ పూల్స్, టన్నెళ్ళు, గ్రావిటీ కాలువలు, పైప్ లైన్లు , గేట్ల తయారీ, బిగింపు, విద్యుత్ సబ్ స్టేషన్లు, ట్రాన్స్ మిషన్ లైన్లు .. ఇట్లా ఏక కాలంలో ప్రాజెక్టుకి సంబందించిన అనేక పనులు యుద్ధ ప్రాతిపదికన జరిగినాయి. కాళేశ్వరం ప్రాజెక్టు లింక్ 1 & లింక్ 2 పనులని 2019 జూన్ నెలాఖరు కల్లా పూర్తి చేసి మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లికి, ఎల్లంపల్లి నుంచి మిడ్ మానేరు జలాశయానికి నీటిని ఎత్తిపోసి శ్రీరాంసాగర్ ప్రాజెక్టు కింద ఉన్న మొదటి దశ, రెండో దశ ఆయకట్టుకు 2019 లోనే నీటి సరఫరా చేయడానికి ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకున్నది. పంపుల వెట్ రన్ జయప్రదంగా పూర్తి అయ్యింది. 2019 లో శ్రీరాంసాగర్ ప్రాజెక్టు ఆయకట్టుకు కాళేశ్వరం నీరు సరఫరా అయ్యింది. శ్రీరాంసాగర్ రెండో దశ 4 లక్షల ఎకరాల ఆయకట్టుకు సాగునీరు సరఫరా చేయడం జరిగింది. ఆయకట్టు పరిధిలో ఉన్న 600 పైగా చెరువులను కాళేశ్వరం నీటితో నింపడం జరిగింది. 2019-20 రబీ సీజన్ లో శ్రీరాంసాగర్ రెండు దశల్లో ఉన్న మొత్తం ఆయకట్టు 13 లక్షల ఎకరాలకు నీరివ్వడం ప్రాజెక్టు చరిత్రలోనే ఒక రికార్డు. మే 2020 నాటికి కాళేశ్వరం నీరు మిడ్ మానేరు(318 మీ) దాటుకొని అనంతగిరి(387 మీ), రంగనాయక సాగర్(490 మీ), మల్లన్న సాగర్(557 మీ), కొండపోచమ్మ సాగర్(618 మీ) ఎత్తుకు చేరడం తెలంగాణా రైతాంగానికి ఒక అపూర్వ అనుభవం. మే నెలలో సిద్ధిపేట నియోజకవర్గంలో చెరువులు, కుంటలు, చెక్ డ్యాంలు కాళేశ్వరం నీళ్ళతో నిండి మత్తడి దున్కుతున్న దృశ్యాలు నయనానందకరంగా ఉన్నాయి.

కాళేశ్వరం ప్రాజెక్టులో భాగంగా నిర్మాణం అవుతున్న వరుస బ్యారేజిల వలన 150 కి మీ గోదావరి నది సజీవం అయ్యింది. గోదావరి నదిలోనే 56 టిఎంసిల నీటి నిల్వ ఉంటుంది. వ్యవసాయం,

చేపల పెంపకం, టూరిజం, జల రవాణా, పరిశ్రమల స్థాపన తదితర రంగాలలో అనూహ్యమైన ఆర్థిక ప్రగతి జరగనుంది. ఇప్పటికే వ్యవసాయ, మత్స్య రంగాలలో అనూహ్యమైన ప్రగతి అనుభవంలోకి వచ్చింది. కాళేశ్వరం ప్రాజెక్టు తెలంగాణాకు ప్రగతి రథం(Growth Engine) లాగా మారబోతున్నది.

### 7.1.3 సమీకృత గోదావరి బేసిన్ అభివృద్ధి ప్రణాళిక : కాళేశ్వరం ప్రాజెక్టు

నిజాం హైదరాబాద్ రాజ్య పాలకుడు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ రామగుండం పారిశ్రామిక ప్రాంతాన్ని మాంచెస్టర్ ఆఫ్ హైదరాబాద్ స్టేట్ గా మార్చాలని కలగన్నాడు. నిజానికి దేశ స్వాతంత్ర్యానికి పూర్వమే హైదరాబాద్ రాజ్యం ఒక సమగ్రమైన గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకాన్ని (Godavari Valley Development Plan) తయారు చేసింది. అమెరికాలోని టెన్నేసి వ్యాలీ అథారిటీ వారి అభివృద్ధి నమూనా ఈ అభివృద్ధి ప్లాన్‌కు స్ఫూర్తిగా నిలచింది. ఈ పథకంలో డ్యాంలు, జలాశయాలు, కాలువల వ్యవస్థ, జల విద్యుత్ మరియు థర్మల్ విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు నిర్మించాలని సంకల్పించారు. ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో లక్షలాది ఎకరాలకు సాగునీరు, పరిశ్రమల స్థాపనకు నీరు అందించాలని భావించారు. 1951 లో శ్రీ సాదత్ అలీ ఖాన్ రచించిన "Projects For Prosperity : The Story of Hyderabad's Bid For Self-sufficiency through Irrigation and Power Projects" అన్న పుస్తకాన్ని హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం ప్రచురించింది. ఈ పుస్తకంలో గోదావరి వ్యాలీ అభివృద్ధి ప్రణాళిక ప్రతిపాదనల్ని సమగ్రంగా చర్చించారు. ఈ ప్రణాళికను రూపొందించడంలో ఆనాటి ప్రజా పనుల శాఖా మంత్రి నవాబ్ జైన్ యార్ జంగ్ బహాదూర్, సెక్రెటరి నవాబ్ అలీ నవాజ్ జంగ్ బహాదూర్ లు కీలక పాత్ర పోషించారు. 1956 లో తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల విలీనం అనంతరం తెలంగాణా సాగునీటి రంగం సంక్షోభంలోకి నెట్టబడింది. కొత్తగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రాధాన్యతలు మారిపోయినాయి. ఆ క్రమంలో హైదరాబాద్ రాష్ట్రం రూపొందించిన గోదావరి వ్యాలీ అభివృద్ధి ప్రణాళికా బుట్ట దాఖలు అయ్యింది. ఇప్పుడు 70 ఏండ్ల తర్వాత కాళేశ్వరం ప్రాజెక్టు మరో రూపంలో "సమీకృత గోదావరి వ్యాలీ అభివ ృద్ధి పథకం (Integrated Godavari Valley Development Plan)" గా మన ముందుకు వచ్చింది. వ్యవసాయం, తాగునీరు, పరిశ్రమలు, మత్స్య పరిశ్రమ, టూరిజం, పట్టాణాభిద్ధి, పర్యావరణం, దేశీయ జల రవాణా తదితర రంగాలను ప్రభావితం చేసి తెలంగాణా సమగ్ర వికాసానికి దోహదం చేసే ఒక ప్రగతి రథంగా (Growth Engine) మారబోతున్నది. కాళేశ్వరం ప్రాజెక్టు తెలంగాణా ప్రజల సాగునీటి ఆకాంక్షలను నెరవేర్చేందుకు సిద్ధం అయ్యింది. ఇదంతా తెలంగాణా ఒక రాష్ట్రంగా ఏర్పడినందు వల్లనే సాధ్యం అయిందనేది నిర్వివాదాంశం.

## 7.2 దక్షిణ తెలంగాణ వరదాయిని పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకం :

### 7.2.1 పాలమూరు ప్రాజెక్టు విషాద చరిత్ర :

పాలమూరు జిల్లాది ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక విషాద గాథ. పాలమూరు – రంగారెడ్డి ఎత్తిపోతల పథకానిది ఒక పోరాట చరిత్ర. 1956 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడడం వలన అధికంగా నష్టపోయిన జిల్లా పాలమూరు జిల్లా. ఫజల్ అలీ కమిషన్ సిఫారసుల మేరకు హైదరాబాద్ రాష్ట్రంగా కొనసాగి ఉండి ఉంటె అప్పర్ కృష్ణా, భీమా, తుంగభద్రా ఎడమ కాలువ ద్వారా దాదాపు 7 లక్షల



ఏదుల జలాశయం, పంప్‌హౌజ్, సిస్టన్ ఏరియల్ వ్యూ

ఎకరాలకు సాగునీరు అంది ఉండేది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు వలన పాలమూరు జిల్లా ఈ అవకాశం పూర్తిగా పోగొట్టుకున్నది పాలమూరు జిల్లా మొత్తం విస్తీర్ణం 43.73 లక్షల ఎకరాలు ఉంటే అందులో వ్యవసాయ యోగ్యమైన భూమి దాదాపు 35 లక్షల ఎకరాలు.

ఉమ్మడి రాష్ట్రంలో సాగునీటి సౌకర్యం ఉన్న భూమి 4.5 లక్షల ఎకరాలు మాత్రమే. ఇందులో ఒక లక్ష ఎకరాలకు సాగునీరు అందించే జూరాల, 87 వేల ఎకరాలకు బదులు 30 వేల ఎకరాలే పారే రాజోలిబండ మళ్లింపు పథకం, 2.5 లక్షల ఎకరాలకు బదులు 75 వేల ఎకరాలకు సాగునీరు అందించే చెరువులు ఉన్నాయి. జిల్లాలో మొత్తం మీద నికరంగా దాదాపు 2 లక్షల ఎకరాలకే సాగునీరు అందేది. ఉమ్మడి రాష్ట్ర పాలనలో సాగునీరు అందించే ఆలోచనే లేని కారణంగా పాలమూరు ప్రజలకు బతుకు దెరువు కోసం వలసలే గతి అయినాయి. ప్రతిపాదిత భీమా, కల్వకుర్తి, నెట్టెంపాడు పథకాలు నిరంతరం ఫైళ్ళల్లో మగ్గుతూ వచ్చాయి.

నల్లగొండ జిల్లాలో ఎలిమినేటి మాధవరెడ్డి ఎత్తిపోతల (AMRP) లిఫ్ట్ స్కీమ్ విజయవంతం అయిన తరువాత పాలమూరు ప్రజలలో కొంచెం చైతన్యం వచ్చిన కారణంగా, అప్పటికే ప్రత్యేక రాష్ట్ర సాధనకై టి ఆర్ ఎస్ పార్టీ తెలంగాణ రాజకీయ రంగంపైకి వచ్చిన కారణంగా 2003 లో కల్వకుర్తి, 2004 లో భీమా, నెట్టెంపాడు, కోయిల్ సాగర్ ఎత్తిపోతల పథకాలకు మోక్షం వచ్చింది. వైఎస్సార్ ప్రభుత్వం వీటిని జల యజ్ఞంలో భాగం చేసి పరిపాలనా అనుమతులు మంజూరు చేసి టెండర్లు పిలిచింది. కానీ పది సంవత్సరాలు గడచినా కూడా ప్రాజెక్టులు పూర్తి కాని స్థితి. ఈ ప్రాజెక్టులన్నీ పూర్తి అయితే 8 లక్షల ఎకరాలు సాగులోనికి వచ్చి ఉండేవి. ఇంకా చాలా ప్రాంతాలు సాగుకు నోచుకోని

పరిస్థితి ఉన్నది. జిల్లా గుండా కృష్ణా నది 300 కిలోమీటర్లు పారుతుంది. తుంగభద్రా నది కూడా ఈ జిల్లా సరిహద్దుగా పారుతుంది. అయినా జిల్లాలో ఈ దీన పరిస్థితి ఉన్నది.

తెలంగాణ ఉద్యమం ఉవ్వెత్తున లేచిన సందర్భంలో తెలంగాణ రిటైర్డు ఇంజనీర్లు 2005 లో పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం రూపకల్పన చేసి అప్పటి ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వానికి నివేదిక ఇస్తే రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వం బుట్ట ధాఖలు చేసింది. జిల్లా నాయకుల్లో దాన్ని పట్టించుకునే నాధుడే లేడు. 2009 ఎన్నికల ముందు సర్వేల గురించి జీ.ఓ ఇస్తామని చెప్పిన ప్రభుత్వం మొఖం చాటేసి అనేక సాకులు చెప్పింది. ఇప్పటికే చాలా ఎత్తిపోతల పథకాలు వచ్చాయి కనుక వాటి పనితీరు చూసిన తరువాతనే ఈ ఎత్తిపోతల పథకాన్ని చేపట్టటం జరుగుతుందని ఆదేశాలు ఇచ్చారు. ఈ విధంగా మొత్తం పాలమూరు, రంగారెడ్డి జిల్లా ప్రజా ప్రతినిధుల నోరు మూయించడం జరిగింది.

దీని తరువాత, టి ఆర్ ఎస్ పార్టీ సహా తెలంగాణ ఇంజనీర్లు, ప్రజా సంఘాలు ధర్నాలు, రౌండ్ టేబుల్ సమావేశాలు, అవగాహన సదస్సులు, కళారూపాల ద్వారా గ్రామ గ్రామాన భావ వ్యాప్తి జేశారు. ఉద్యమ ఒత్తిడికి తట్టుకోలేక ఎన్నికల్లో లబ్ది పొందడానికి పాలమూరు- రంగారెడ్డి ఎత్తిపోతల పథకానికి సర్వే నిమిత్తమై 2013 ఆగష్టులో జీ.ఓ. ఇచ్చింది. అయితే టెండర్ల ప్రక్రియ పూర్తి కాకుండా అడ్డుకున్నారు. రాష్ట్ర విభజన చట్టంలో అపెక్స్ కౌన్సిల్ అనుమతి కొత్త ప్రాజెక్టులకు తప్పనిసరి అయినందువల్ల అపెక్స్ కౌన్సిల్‌లో అడ్డుకోవచ్చన్న ముందు చూపుతో ప్రాజెక్టు పనులు ప్రారంభం కాకుండా ఆటంకాలు కల్పించారు ఉమ్మడి రాష్ట్ర పాలకులు.

### 7.2.2 తెలంగాణ ప్రభుత్వ కృషి :

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత కెసిఆర్ ముఖ్యమంత్రిగా ప్రభుత్వం అధికారం చేపట్టిన వెంటనే చేసిన మొదటి పని... అటక మీద దుమ్ముపట్టిపోయిన పాలమూరు రంగారెడ్డి దస్త్రాన్ని బయటకు తీసి ఇన్స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ (ఇండియా) వారి అధీనంలో పని చేస్తున్న ఇంజనీరింగ్ స్టాఫ్ కాలేజ్ ఆఫ్ ఇండియా(ESCI) వారిచే సమగ్ర ప్రాజెక్టు నివేదికను తయారు చేయించడానికి 5.71 కోట్ల రూపాయలను మంజూరు చేస్తూ జి ఓ నంబరు 69 ని తేదీ 1.8.2014 న జారీ చేసింది.

5 నెలల తర్వాత ఎస్కీ వారు తయారు చేసిన ముసాయిదా నివేదికలోని ప్రతిపాదనలపై ముఖ్యమంత్రి స్థాయిలో ప్రభుత్వ సలహాదారు దివంగత శ్రీ ఆర్ విద్యాసాగర్ రావు, సాగునీటి శాఖ సీనియర్ ఇంజనీర్లు, రిటైర్డ్ ఇంజనీర్లు, ఎస్కీ ఇంజనీర్లతో కూలంకషంగా సమీక్ష జరిగింది. ప్రాజెక్టు తొలి ప్రతిపాదనలు ఈ విధంగా ఉన్నాయి.

### 7.2.3 ప్రాజెక్టు తొలి ప్రతిపాదనలు :

1. జూరాల జలాశయం నుంచి 35 రోజుల్లో రోజుకు 2 టిఎంసిలు ఎత్తిపోసి మహబూబ్‌నగర్ జిల్లాలో 7 లక్షల ఎకరాలు, రంగారెడ్డి జిల్లాలో 2.7 లక్షల ఎకరాలు, నల్లగొండ జిల్లాలో 30 వేల ఎకరాలు.. మొత్తం 10 లక్షల ఎకరాలకు సాగునీరు, జంట నగరాలకు, దారి పొడుగునా

గ్రామాలకు తాగు నీరు, పరిశ్రమల అవసరాలకు నీరు అందించడం.

2. కోయిల్‌కొండ వద్ద 76 టిఎంసిలు, గండీడ్ వద్ద 35 టిఎంసిలు, లక్ష్మీదేవిపల్లి వద్ద 10 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాల నిర్మాణం

3. మూడు జలాశయాల్లో మొత్తం 47 గ్రామాలు, 84,400 మంది జనాభా, 16,342 ఆవాసాలు ముంపు బారిన పడుతున్నాయని తేలింది.

ఎస్కీ వారి పై ప్రతిపాదనలపై సమగ్ర చర్చ అనంతరం ఇంత భారీ ముంపుని తగ్గించడం ప్రభుత్వం ముందు ఒక సవాలుగ ముందుకు వచ్చింది. ఇంత భారీ ముంపును తగ్గించడానికి ప్రత్యామ్నాయాలు వెతకడం ఒక అంశం అయితే 7 టిఎంసిల నికర నిల్వ సామర్థ్యం మాత్రమే ఉన్న జూరాల జలాశయం మీద రోజుకు 2 టిఎంసిల నీటిని ఎత్తిపోసే భారీ పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని ప్రతిపాదించడం సమంజసమేనా అన్నది రెండవ అంశం. కృష్ణా నదిపై నిర్మించిన అతి చిన్న జూరాల జలాశయం నుండి ఇంత భారీగా నీటిని ఎత్తిపోయడం సాంకేతికంగా, ప్రాజెక్టుకు నీటి లభ్యత దృష్ట్యా సాధ్యమా? అన్న ప్రశ్నలను కూలంకషంగా సమీక్షించడం జరిగింది.

చిన్నదైన జూరాల జలాశయం ఇప్పటికే తన స్థాయికి మించిన భారాన్ని మోస్తున్నది. జూరాల స్వంత ఆయకట్టు(1.04 లక్షల ఎకరాలు), భీమా ఆయకట్టు (2 లక్షల ఎకరాలు), నెట్టెంపాడు ఆయకట్టు (2 లక్షల ఎకరాలు), కోయిల్ సాగర్ ఆయకట్టు (50 వేల ఎకరాలు), మహబూబ్ నగర్ పట్టణ తాగునీటి అవసరాలు, మిషన్ భగీరథ ద్వారా తాగునీరు తదితర అవసరాలను అతి కష్టం మీద తీరుస్తున్నది. యాసంగిలో జూరాల నుంచి ఈ ప్రాజెక్టులకు నీరు ఎత్తిపోయడం సాధ్యం కాదు. అందుకే ఈ చిన్న ప్రాణంపై మరొక భారీ ప్రాజెక్టుని మోపడం దానిపై ఆధారపడిన ప్రాజెక్టులకు అన్యాయం చేసినట్లవుతుందన్న వాదనలు సమీక్షలో ముందుకు వచ్చినాయి. దానితో పాటు వేల కోట్లు ఖర్చు చేసి నిర్మించే ప్రాజెక్టు నిరుపయోగంగా మారకూడదు అన్న వాదనలు కూడా చర్చకు వచ్చాయి.

సర్వే ఆఫ్ ఇండియా వారి టోపో మ్యాపులు, గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్, జూరాల, శ్రీశైలం వరద ప్రవాహాల గణాంకాల సాయంతో కూలంకషంగా అధ్యయనం జరిపిన తర్వాత పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో ముంపుని గణనీయంగా తగ్గించగలిగే అవకాశం ఉందని, జూరాల నుండి కాక 215 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన శ్రీశైలం జలాశయం నుండి రోజుకు 2 టిఎంసిల నీటిని 90 రోజుల పాటు (వరద లేని రోజుల్లో కూడా) ఎత్తిపోసుకోవడానికి అవకాశం ఉందని తేలింది. కృష్ణా నదికి అతిపెద్ద ఉపనది తుంగభద్ర నీరు కూడా శ్రీశైలం జలాశయానికే చేరతాయి. ఇన్ని వేల కోట్ల రూపాయలను ఖర్చుచేస్తున్నప్పుడు ప్రాజెక్టు సాఫల్యతపై దృష్టి పెట్టవలసిన అవసరం ఉన్నది. ఈ అన్ని అంశాలను పరిగణనలోనికి తీసుకొని పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని రీ డిజైన్ చెయ్యాలని ఆనాటి ముఖ్యమంత్రి కెసిఆర్ నిర్ణయించారు. ప్రాజెక్టు సమగ్ర నివేదిక తయారు చేస్తున్న ఎస్కీ వారిని పై చర్చల ఆధారంగా శ్రీశైలం నుండి ప్రాజెక్టుని రీ డిజైన్ చెయ్యమని ప్రభుత్వం ఆదేశించింది.

ఇదే సమయంలో ఆర్ విద్యాసాగర్ రావు డిండీ (నక్కలగండి) ఎత్తిపోతల పథకంపై కూడా చర్చ జరిగింది. నక్కలగండి ప్రతిపాదనలో కూడా ముంపు భారీగా ఉండడంతో ప్రత్యామ్నాయాలను పరిశీలించినారు. రెండు ప్రాజెక్టుల నీటి సోర్స్ శ్రీశైలం జలాశయమే అయినందున ఈ రెండు ప్రాజెక్టులకు ఒకే ఇన్టేక్ ద్వారా నీటిని సరఫరా చెయ్యడం సాంకేతికంగా సాధ్యమేనని నిర్ధారణకు వచ్చినారు. ఈ అంశాన్ని కూడా దృష్టిలో ఉంచుకొని రీ డిజైన్ చెయ్యాలని ముఖ్యమంత్రి ఎస్కీ సంస్థను ఆదేశించినారు. టోపో మ్యాపుల ద్వారా, క్షేత్ర స్థాయి వారిశీలన ద్వారా శ్రీశైలం జలాశయం నుంచి నీటిని ఎత్తిపోసేనదుకు ప్రాజెక్టు ప్రతిపాదనలను ఇంజనీర్లు సిద్దం చేసినారు. పలు మార్లు ముఖ్యమంత్రి స్థాయిలో ఈ ప్రపాదనలపై చర్చలు జరిగినాయి. ఆరు నెలల సుధీర్ఘ మేథో మథనం అనంతరం తుది ప్రతిపాదనలు తయారు అయినాయి.

### 7.2.4 రీ డిజైన్ తర్వాత ప్రాజెక్టు ముఖ్యాంశాలు :

రీ డిజైన్ తర్వాత ప్రాజెక్టు ప్రతిపాదనల్లో కీలక మార్పులు చోటుచేసుకున్నాయి. ప్రధానమైన మార్పులు..

1. నీటి సోర్స్ జూరాల నుంచి శ్రీశైలం జలాశయానికి మార్చడం,
2. ఆరు కొత్త జలాశయాలను ప్రతిపాదించచడం.. నార్లాపూర్ వద్ద 8.51 టిఎంసిలు, ఏదుల వద్ద 6.55 టిఎంసిలు, వట్టెం వద్ద 16.74 టిఎంసిలు, కరివెన వద్ద 17.34 టిఎంసిలు, ఉద్దండాపూర్ వద్ద 15.91 టిఎంసిలు, లక్ష్మీదేవిపల్లి వద్ద 2.80 టిఎంసిలు నిలువ సామర్థ్యంతో 6 జలాశయాల నిర్మాణం. వీటి మొత్తం నిల్వ సామర్థ్యం 67.97 టిఎంసిలు.
3. ఆయకట్టు 10 లక్షల ఎకరాల నుంచి 12.30 లక్షల ఎకరాలకు పెంచడం
4. గతంలో కంటే ముంపు గణనీయంగా తగ్గించడం జరిగింది. ఉమ్మడి మహబూబ్ నగర్ జిల్లాలో 7 లక్షల ఎకరాలు, రంగారెడ్డి జిల్లాలో 5 లక్షల ఎకరాలు, నల్లగొండ జిల్లాలో 30 వేల ఎకరాలు.. మొత్తం 12.30 లక్షల ఎకరాలకు సాగునీరు అందించడానికి, మొత్తం 70 మండలాల్లో 1226 గ్రామాలకు తాగునీరు అందించడానికి ప్రతిపాదనలు తుది రూపం తీసుకున్నాయి.
5. అన్ని జలాశయాల్లో కలిపి ముంపు మొత్తం 49 వేల ఎకరాలు, ప్రభావితం అయ్యే గ్రామాలు 3, తండాలు 20, ఆవాసాలు 2,781 మాత్రమే. పై గణాంకాలను పరిశీలిస్తే రీ డిజైన్ తర్వాత పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో ముంపు గణనీయంగా తగ్గిపోయిందని అర్థమవుతున్నది.

రాష్ట్ర మంత్రివర్గం ఈ ప్రతిపాదనల్ని ఆమోదించడంతో ప్రభుత్వం జి ఒ నంబరు 105 తేదీ 10.06.2016 ద్వారా ప్రాజెక్టుకు రూ. 35,200 కోట్లకు పరిపాలనా అనుమతులు మంజూరు చేసింది. ముఖ్యమంత్రి కెసిఆర్ ప్రాజెక్టుకు 11.06.2015 తేదీన కరివెన గ్రామం వద్ద శంకు స్థాపన చేసిన తర్వాత ప్రాజెక్టు పనులని 18 ప్యాకేజీలుగా విభజించి టెండర్లు ఖరారు చెయ్యడం జరిగింది. పనులు ప్రారంభమయినాయి.

ప్రాజెక్టుపై జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్‌లో వేసిన కేసుల కారణంగా పనులను రెండు దశలలో పూర్తి చేయాలని నిర్ణయించడం జరిగింది. మొదటి దశలో తాగునీటి సరఫరా పనులు, రెండో దశలో సాగునీటి సరఫరా పనులు పూర్తి చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. తాగునీటి సరఫరా పనులు పూర్తి అయ్యే దశకు చేసుకున్నాయి. నార్లాపూర్ పంప్ హౌజ్‌లో మొదటి పంపు (145 మె వా) డ్రై రన్ కూడా 2023 ఆగస్ట్ 3 న విజయవంతం అయ్యింది. 2023 సెప్టెంబర్ 16 న ముఖ్యమంత్రి చేతుల మీదుగా ప్రాజెక్టు ప్రారంభం అయింది.

### 7.2.5 ప్రాజెక్టుకు నిరంతర ఆటంకాలు :

పనులు ప్రారంభం అయినప్పటి నుంచి ప్రాజెక్టు వ్యతిరేకులు కోర్టుల్లో కేసులు వేసి అనేక ఆటంకాలు కల్పించడం మొదలు పెట్టారు. ఆ క్రమలోనే జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్‌లో పర్యావరణ అనుమతులు లేకుండా ప్రాజెక్టు పనులు చేస్తున్నారని, పర్యావరణ అనుమతులు వచ్చే వరకు పనులను నిలుపుదల చేస్తూ ఆదేశాలు ఇవ్వమని వారు జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్‌ను కోరినారు. ఈ కేసులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఇంప్లీడ్ అయి ప్రాజెక్టుకు వ్యతిరేకంగా వాదనలు చేసింది. ఇది కొత్త ప్రాజెక్టు కాబట్టి విభజన చట్టం ప్రకారం అపెక్స్ కౌన్సిల్ అనుమతి పొందిన తర్వాతనే ప్రాజెక్టును చేపట్టాలని వాదించింది.

ఈ ప్రాజెక్టుకు ఉమ్మడి రాష్ట్రంలోనే 90 టిఎంసిల నీటి కేటాయింపులు చేస్తూ జీవో జారీ అయ్యిందని, కాబట్టి దీన్ని కొత్త ప్రాజెక్టుగా పరిగణించడానికి వీలు లేదని తెలంగాణ ప్రభుత్వం వాదించింది. తొలుత 1226 గ్రామాలకు, హైదరాబాద్ నగరానికి తాగునీటి సరఫరా కోసం ప్రాజెక్టును నిర్మిస్తున్నామని, తాగునీటి ప్రాజెక్టులకు పర్యావరణ అనుమతుల నుంచి మినహాయింపు ఉందని, సాగునీటి పనులు మాత్రం పర్యావరణ అనుమతులు పొందిన తర్వాతనే చేపడతామని తెలంగాణ ప్రభుత్వం జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్ కు తెలిపింది.

ట్రిబ్యునల్ అందుకు అంగీకరించి ప్రాజెక్టులో తాగునీటి పనులు చేసుకోవడానికి అనుమతించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తిరిగి గ్రీన్ ట్రిబ్యునల్ లో మరో కేసు ఆంధ్రప్రదేశ్ రైతులతో వేయించి ట్రిబ్యునల్ ద్వారా ప్రాజెక్టు పనులకు స్టే ఆర్డర్ పొందింది. దాంతో పాటు పర్యావరణానికి హాని కలిగించినందుకు భారీ మొత్తంలో జరిమానా కూడా వేసింది. తెలంగాణ ప్రభుత్వం గ్రీన్ ట్రిబ్యునల్ స్టే ఆర్డర్ పై సుప్రీం కోర్టుకు అప్పీల్ చేసింది. అందరి వాదనలు విన్న సుప్రీంకోర్టు తాగునీటి సరఫరా పనులను కొనసాగించడానికి అనుమతిస్తూ తీర్పు ఇచ్చింది. సాగునీటి పనులు మాత్రం పర్యావరణ అనుమతులు పొందిన తర్వాతనే చేపట్టాలని సూచించింది. గ్రీన్ ట్రిబ్యునల్ వేసిన జరిమానాపై సుప్రీం కోర్టులో విచారణ ఇంకా కొనసాగుతున్నది.

### 7.2.6 కేంద్ర ప్రభుత్వ గజిట్ నోటిఫికేషన్ :

పరిస్థితులు ఈ రకంగా ఉన్న తరుణంలో కేంద్ర ప్రభుత్వం 15 జూలై 2020 న కృష్ణా, గోదావరి నదీ యాజమాన్య బోర్డుల పరిధులను నిర్దేశిస్తూ గజిట్ నోటిఫికేషన్‌ను జారీ చేసింది. ఇందులో

రెండు నదీ బేసిన్లలో కేంద్ర జల సంఘం నుంచి అనుమతులు లేని ప్రాజెక్టుల జాబితాను పొందు పరచింది. అందులో కృష్ణ బేసిన్లో పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టును కూడా చేర్చినారు. ఈ ప్రాజెక్టులకు 6 నెలల్లో కేంద్ర సంస్థల నుంచి అనుమతులు పొందాలని ఆదేశించింది. నోటిఫికేషన్లో పేర్కొన్న గోదావరి, కృష్ణా బేసిన్లలో ఉన్న అనుమతి లేని ప్రాజెక్టులకు కేంద్ర జల సంఘం నుంచి, కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ నుంచి, ఇతర కేంద్ర ప్రభుత్వ సంస్థల నుంచి అనుమతులు పొందడానికి డిపిఆర్‌లు సిద్దం చేయమని ముఖ్యమంత్రి సాగునీటి శాఖను ఆదేశించారు.

గోదావరి బేసిన్లో ఇప్పటి వరకు 9 ప్రాజెక్టుల డిపిఆర్ లను, కృష్ణా బేసిన్లో పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టు డిపిఆర్ సమర్పించి అనుమతుల కోసం తీవ్రంగా కృషి చేసింది తెలంగాణ ప్రభుత్వం. అందు కోసం దిల్లీలో ఎగ్జిగ్యూటివ్ ఇంజనీర్ ఆధ్వర్యంలో ఒక కార్యాలయాన్ని కూడా నెలకొల్పింది. అయితే కృష్ణా బేసిన్‌లో ఉన్న పాలమూరు సహా అన్ని ప్రాజెక్టులు.. కల్వకుర్తి, నెట్టెంపాడు, ఎలిమినేటి మాధవరెడ్డి, ఆర్ విద్యాసాగర్ రావు డిండి ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు లేవు. ఇవి వరద జలాల కేటాయింపులు ఉన్న ప్రాజెక్టులే. వీటిలో పాలమూరు, డిండి మినహా మిగతా మూడు ప్రాజెక్టులు ఉమ్మడి రాష్ట్రం ప్రారంభించినవే. వరద జలాలపై ఆధారపడిన ప్రాజెక్టులకు కేంద్ర జల సంఘం కానీ, కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ కానీ అనుమతులు ఇవ్వడానికి నిబంధనలు అనుమతించవు.

### 7.2.7 ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు :

పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టు దక్షిణ తెలంగాణకు జీవధార లాంటిది. కరువు పీడిత, ఫ్లోరైడ్ పీడిత ప్రాంతాలకు తాగునీరు, సాగునీరు అందించాలన్న లక్ష్యంతో తెలంగాణ ప్రభుత్వం ఈ ప్రాజెక్టును చేపట్టింది. కాళేశ్వరం కార్పొరేషన్లో భాగం చేసి బ్యాంకు లోన్ల ద్వారా నిధులు కూడా సమకూర్చింది. అయితే ఎన్జిటి కేసుల ఫలితంగా పర్యావరణ అనుమతులు పొందాలంటే ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు తప్పనిసరి.

ప్రభుత్వం ఈ విషయంపై మేధోమధనం చేసిన అనంతరం 90 టిఎంసిల నికర జలాలను తెలంగాణ వాటా నుంచే కేటాయించుకునే అవకాశం ఉందని తేలింది. చిన్న నీటి పారుదల కోసం ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు కేటాయించిన 90 టిఎంసిల కృష్ణా నికర జలాల్లో 45 టిఎంసిలకు మించి కృష్ణా బేసిన్లో వినియోగం జరగడం లేదని తేలింది. ఈ నీటిని పాలమూరు ప్రాజెక్టుకు కేటాయించ వచ్చునని భావించడం జరిగింది. కర్ణాటక ప్రభుత్వం కూడా ఈ రకమైన సేవింగ్స్ ను అప్పర్ భద్రా ప్రాజెక్టుకు కేటాయించుకున్నది.

ఇక గోదావరి ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం పోలవరం ప్రాజెక్టు ద్వారా 80 టిఎంసిల గోదావరి జలాలను కుడి కాలువ ద్వారా కృష్ణా డెల్టా అవసరాలకు తరలించుకోవచ్చు. ఆ మేరకు మిగులు కృష్ణా నీటిని నాగార్జునసాగర్ ఎగువన పోలవరం ప్రాజెక్టును కేంద్ర జల సంఘం అనుమతించిన రోజు నుంచే మహారాష్ట్రా 14 టిఎంసిలు, కర్ణాటక 21 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ 45 టిఎంసిలను బేసిన్లో ఉండే ఆయకట్టు అవసరాలకు, తాగునీటి అవసరాలకు వినియోగించుకోవచ్చు.

కర్ణాటక అప్పర్ భద్రా ప్రాజెక్టుకు ఈ వాటాలో కూడా కొంత నీటిని కేటాయించింది. అయితే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కర్ణాటక చేసుకున్న ఈ పునర్ కేటాయింపులను 2013 లోనే సుప్రీం కోర్టులో సవాలు చేసింది. అప్పటి నుంచి ఈ వివాదం సుప్రీం కోర్టులో నలుగుతూ ఉన్న సమయంలోనే కేంద్ర జల సంఘం అప్పర్ భద్రా ప్రాజెక్టుకు అనుమతులు మంజూరు చేసింది. కేంద్ర ప్రభుత్వం ఈ ప్రాజెక్టుకు జాతీయ హోదా కల్పించడానికి సిద్దపడింది. ఈ 2023-24 ఆర్థిక సంవత్సరంలో నిధులు కూడా కేటాయించింది. కర్ణాటక అవలంభించిన పద్దతిలోనే తెలంగాణ ప్రభుత్వం కూడా, ఇంతకు ముందు పేర్కొన్నట్టు, మైనర్ ఇరిగేషన్ లో 45 టిఎంసిల సేవింగ్స్, పోలవరం నుంచి తరలించే నీటిలో ఆంధ్రప్రదేశ్ వాటా 45 టిఎంసిలు .. మొత్తం 90 టిఎంసిలను పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టుకు పునర్ కేటాయింపులు (బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ అంతిమ తీర్పుకు లోబడి) చేస్తూ జి ఒ నంబరు 246 జారీ చేసింది.

ఆంధ్రప్రదేశ్ ఈ 45 టిఎంసిల నీటిని గోదావరి ట్రిబ్యునల్ తీర్పు ప్రకారం నాగార్జునసాగర్ ఎగువన బేసిన్‌లో ఉండే ఆయకట్టు అవసరాలకు మాత్రమే వినియోగించాలి. రాష్ట్ర విభజన తర్వాత నాగార్జునసాగర్ ఎగువన ఉన్నది తెలంగాణ మాత్రమే. నాగార్జునసాగర్ ఎగువన కృష్ణా బేసిన్లో ప్రాజెక్టులు కలిగి ఉన్న రాష్ట్రం తెలంగాణనే. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉన్న ప్రాజెక్టులు అన్నీ కూడా బేసిన్ ఆవలకు నీటిని తరలించేవి. కాబట్టి ఈ 45 టిఎంసిల నీటిపై పూర్తి హక్కు తెలంగాణ రాష్ట్రానికే ఉన్నది. ఈ రకమైన విశ్లేషణతో పాలమూరు-రంగారెడ్డి ప్రాజెక్టుకు మొత్తం 90 టిఎంసిల నికర జలాలను కేటాయించి డిపిఆర్ తయారు చేసి కేంద్ర జల సంఘానికి, పర్యావరణ మంత్రిత్వ శాఖకు సెప్టెంబర్ 2022 లోనే సమర్పించడం జరిగింది. ఇదే విషయాన్ని బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్‌కు కూడా తెలియజేయడం జరిగింది.

ఈ జి ఒ పై కూడా ఆంధ్రప్రదేశ్ కృష్ణా ట్రిబ్యునల్లో కేసు వేసి జి ఒ అమలు కాకుండా అడ్డుపడే ప్రయత్నం చేసింది. తెలంగాణ ప్రభుత్వం ట్రిబ్యునల్లో ఆంధ్రప్రదేశ్ వాదనలను తిప్పికొట్టింది. తెలంగాణ వాదనతో అంగీకరించిన ట్రిబ్యునల్ ఏ పి కేసును కొట్టి వేసింది. ఈ తీర్పుతో ప్రాజెక్టుకు కేంద్ర జల సంఘం అనుమతులు సాధించడానికి మార్గం సుగమం అయ్యింది. ఇది ధర్మ విజయం.

### 7.2.8 పాలమూరు డిపిఆర్ పరిశీలనలో వివక్ష :

ఆంధ్రప్రదేశ్ బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ ముందు పాలమూరు-రంగారెడ్డి ప్రాజెక్టుపై ప్రత్యేకమైన కేసు వేసింది. అందులో వారు తెలంగాణ ప్రభుత్వం జారీ చేసిన నీటి కేటాయింపుల జి ఒ 246 పై ఆక్షేపణలు చేసినారు. అయితే ఆ నీటిలో తమకు కూడా హక్కు ఉందని కానీ, తమకు కూడా వాటా కావాలని కానీ కోరలేదు. ఎందుకంటే ఈ నీటిని నాగార్జునసాగర్ ఎగువన వాడటానికి కృష్ణా బేసిన్లో తమకు ప్రాజెక్టులు లేవని వారికి తెలుసు. కేంద్ర జల సంఘం వారు ఆంధ్రప్రదేశ్ చేస్తున్న "న్యాయ విచారణ పరిధిలో ఉంది (Subjudice)" అన్న కారణాన్ని చూపి, తెలంగాణ వాదనలు గాని, సాక్ష్యాలు కానీ పరిగణనలోకి తీసుకోకుండా పాలమూరు ప్రాజెక్టును పరిశీలించలేమని వెనక్కి పంపుతూ లేఖ రాసింది.

ఈ లేఖపై తెలంగాణ రాష్ట్రం తీవ్రంగా స్పందించింది. కేంద్ర జల సంఘం కర్ణాటక అప్పర్

భద్రా ప్రాజెక్టు పట్ల ఒక రకంగా, తెలంగాణ పాలమూరు ప్రాజెక్టు పట్ల మరో రకంగా వివక్షాపూరితంగా వ్యవహరిస్తున్నదని ఆక్షేపించింది. కేంద్ర జల్ శక్తి మంత్రిత్వ శాఖ కార్యదర్శికి రాసిన లేఖలో .. "కర్ణాటక రాష్ట్రం అప్పర్ భద్రా ప్రాజెక్టుకు ఏ పద్దతులు అనుసరించి తమ వాటా నుంచే నీటి కేటాయింపులు జరుపుకున్నదో అవే పద్దతులను అనుసరించి తెలంగాణ కూడా తన వాటా నుంచే పాలమూరు ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు చేసుకున్నది" అని తెలిపింది. అప్పర్ భద్రా వివాదం కూడా సుప్రీం కోర్టు ముందు ఉన్నది. మరి ఇది న్యాయ విచారణ పరిధిలోని విషయం ఎట్లా కాకుండా పోయింది? తెలంగాణకు ఒక న్యాయం, ఇతర రాష్ట్రాలకు మరో న్యాయమా? అని ప్రశ్నించింది. 2021 జూలై 15 తేదీన కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన గెజిట్ ప్రకారం.. అనుమతి లేని ప్రాజెక్టుల జాబితాలో పాలమూరు-రంగారెడ్డిని చేర్చారని, ఆరు నెలల్లోగా అనుమతులు పొందాలని చెప్పారని, ఈ ఆదేశాల మేరకే అనుమతుల కోసం ప్రాజెక్టు డిపిఆర్‌ను సెప్టెంబర్ 2022 లో సమర్పించినట్టు తెలిపారు. అప్పటి నుంచి ఆరు నెలల్లోగా డిపిఆర్ ను పరిశీలించి, అనుమతులు ఇచ్చే బాధ్యత కేంద్రానిదేనని గుర్తు చేశారు.

అయితే ఆరు నెలలు కాలాయాపన చేసి "న్యాయ పరిధిలోని అంశం" అన్న సాకు చూపించి వెనక్కి పంపడం సమంజసం కాదు కాబట్టి డిపిఆర్‌ను పరిశీలించి, బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ తుది తీర్పునకు లోబడి అనుమతులు మంజూరు చేయాలని విజ్ఞప్తి చేసింది తెలంగాణ ప్రభుత్వం. డిపిఆర్ పరిశీలన కొనసాగించాలని, త్వరగా అనుమతులు మంజూరు చేసే విధంగా కేంద్ర జల సంఘాన్ని ఆదేశించాలని కేంద్ర జల్ శక్తి మంత్రిత్వ శాఖ కార్యదర్శి శ్రీ పంకజ్ కుమార్ ను రాష్ట్ర సాగునీటి శాఖ స్పెషల్ చీఫ్ సెక్రెటరీ రజత్ కుమార్ విజ్ఞప్తి చేశారు. కేంద్ర జల సంఘం లేవనెత్తిన అంశాలు అన్నిటికీ సవివరమైన సమాధానాలు సమర్పించామని రజత్ కుమార్ పేర్కొన్నారు. తెలంగాణ ప్రభుత్వ విజ్ఞప్తి మేరకు కేంద్ర జల్ శక్తి మంత్రిత్వ శాఖ స్పందించి పాలమూరు డిపిఆర్ పరిశీలన కొనసాగించాలని కేంద్ర జల సంఘాన్ని ఆదేశించింది. కేంద్ర ప్రభుత్వ ఆదేశాలతో తప్పనిసరై కేంద్ర జల సంఘం ప్రాజెక్టు నివేదిక పరిశీలన కొనసాగించింది.

విచిత్రం ఏమిటంటే.. 2024 జనవరిలో రాష్ట్రంలో అధికార మార్పిడి జరిగిన తర్వాత కేంద్ర జల సంఘం "ట్రిబ్యునల్ లో విచారణాంశం గా ఉంది" అన్న పాత అస్త్రాన్ని.. ప్రయోగించి ప్రాజెక్టు డిపిఆర్ ను వాపస్ చేసింది. అప్పటికే గత ప్రభుత్వం చేసిన కృషి కారణంగా ప్రాజెక్టుకు ఆరు అనుమతులు సాధించడం విశేషం.

### 7.2.9 ప్రాజెక్టుకు కేంద్ర ప్రభుత్వం నుంచి సాధించిన అనుమతులు :

1. అటవీ అనుమతి :

ఉమ్మడి మహబూబ్ నగర్, రంగారెడ్డి, నల్గొండ జిల్లాలో 12.30 లక్షల ఎకరాలకు నీరుసాగు , వెయ్యి కి పైగా గ్రామాలకు తాగునీరు అంధించే పాలమూరు రంగారెడ్డి ఎత్తి పోతల పథకానికి కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ తుది అటవీ అనుమతులను మజూరు చేసింది.

2. కేంద్ర విద్యుత్ ప్రాధికార సంస్థ(CEA) అనుమతి : తేదీ 17.03.2023

3. సెంట్రల్ సాయిల్ & మెటీరియల్ రీసెర్చ్ స్టేషన్(CSMRS) అనుమతి : తేదీ 05.06.2023

4. కేంద్ర గిరిజన మంత్రిత్వ శాఖ (MoTA) అనుమతి : తేదీ 17.07.2023

5. కేంద్ర భూగర్భ జల బోర్డు (CGWB) అనుమతి : తేదీ 28.07.2023

6. పర్యావరణ అనుమతికి కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ సలహా మండలి (EAC) సిఫారసు : సుప్రీం కోర్టు ఆదేశాల మేరకు ప్రాజెక్టుకు పర్యావరణ అనుమతుల కోసం పబ్లిక్ హియరింగ్ జరిపి పర్యావరణ మంత్రిత్వ శాఖకు డిపిఆర్‌ను సెప్టెంబర్ 2022 లో సమర్పించడం జరిగింది. మంత్రిత్వ శాఖ వారు కోరిన విధంగా పర్యావరణ నష్టాలను అంచనా వేసి సమర్పించడం జరిగింది. జూన్ 26 న సాగునీటి శాఖ స్పెషల్ చీఫ్ సెక్రెటరీ రజత్ కుమార్ పర్యావరణ సలహా కమిటి ముందు సోదాహరణంగా ప్రాజెక్టు కరువు పీడిత, ఫ్లోరైడ్ పీడిత ప్రాంతాలకు తాగునీరు, సాగునీరు ఇవ్వడానికి ఉమ్మడి రాష్ట్రమే అనుమతి ఇచ్చిందని. తెలంగాణ ప్రభుత్వం దాని నిర్మాణాన్ని పూర్తి చేస్తున్నదని చెప్పారు. పర్యావరణ అనుమతులు మంజూరు చేయాలని కోరినారు. ఆ తర్వాతనే సాగునీటి సరఫరా కోసం కాలువలు తవ్వ గలుగుతామని వివరించారు.

తెలంగాణ ప్రభుత్వ ప్రతినిధుల వివరణలకు సంతృప్తి చెందిన పర్యావరణ సలహా కమిటి (EAC) ప్రాజెక్టుకు పర్యావరణ అనుమతి జారీ చేయాలని 10.08.2023 తేదీన కేంద్ర పర్యావరణ & అటవీ మంత్రిత్వ శాఖకు సిఫారసు చేసింది. పర్యావరణ మంత్రిత్వ శాఖ అనుమతి పత్రాన్ని జారీ చేయడం ఇక లాంఛనమే. పర్యావరణ అనుమతి జారీ అయినాక సాగు నీటి సరఫరా పనులు చేపట్టడానికి ఉన్న అన్ని ఆటంకాలు తొలగిపోతాయి. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికే ఆ దిశగా సన్నాహాలు చేసుకున్నది. ఈ లోపల అధికార మార్పిడి జరగడంతో కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ కూడా EAC సిఫారసును బేఖాతరు చేసి అనుమతి ఇవ్వకుండా దస్త్రాన్ని అటకెక్కించేసింది. చంద్రబాబు ప్రభుత్వం ఒత్తిడి మేరకే ప్రాజెక్టుకు పర్యావరణ అనుమతి అటకెక్కిందన్న విషయం అందరికీ అర్థం అయ్యింది. ఎందుకంటే గతంలో ప్రాజెక్టుపై ఎన్జిటిలో కేసులు వేసి అడ్డంకులు సృష్టించింది ఆయన గారి ప్రభుత్వమే

అయితే లోపలి, బయటి శత్రువులు చేసిన అన్ని కుట్రలను, అడ్డంకులను అధిగమించి పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకాన్ని కెసిఆర్ ప్రభుత్వం ప్రారంభించింది. ప్రాజెక్టులో తాగునీటి కాంపోనెంట్స్ ను 80 శాతం పూర్తి చేసింది. 16 సెప్టెంబర్ న నార్లాపూర్ పంప్ హౌజ్ లో 145 మెగావాట్ల ఒక పంపు ను రన్ చేసి మహబూబ్ నగర్ ప్రజానీకానికి ప్రాజెక్టు నుంచి నీళ్ళు వస్తాయన్న భరోసాను కలిగించింది. ప్రాజెక్టు పూర్తి అయితే 6 దక్షిణ తెలంగాణ జిల్లాలకు, 19 నియోజకవర్గాలకు, 70 మండలాల్లో 1226 గ్రామాలకు ప్రాజెక్టు వరదాయనిగా మారబోతున్నది. ఉమ్మడి రాష్ట్రంలో అనుభవించిన 60 ఏండ్ల నీటి గోసకు ప్రాజెక్టు ఒక పరిష్కారం చూపనున్నది. ప్రస్తుత ప్రభుత్వం ఈ ప్రాజెక్టు పనులను ఎట్లా ముందుకు తీసుకుపోతుంది? అన్నది ప్రజల ముందు ఒక సవాలుగా మారింది.



నార్లాపూర్ పంపు హౌజ్ నుండి ఏదుల జలాశయంకు ప్రవహిస్తున్న కృష్ణా జలాలు

### 7.2.10 ప్రాజెక్టు పనుల పురోగతి :

ప్రాజెక్టు పనులను 18 ప్యాకేజీలుగా విభజించి టెండర్లు పిలవడం జరిగినకది. టెండరు ఒప్పందాల విలువ రు 29,518 కోట్లు. ప్రాజెక్టుకు తొలుత రు 35,200 కోట్లకు పరిపాలనా అనుమతులు ప్రభుత్వం జారీ చేసిన సంగతి ఇంతకు ముందు ప్రస్తావించాను. తర్వాత ప్రాజెక్టు అంచనా విలువను రు. 55,086 కోట్లకు సవరించడం జరిగింది. తొలి అంచనా విలువలో ఇప్పటివరకు అనగా 2023 వరకు రు. 27,513 కోట్ల పనులు (80 శాతం) పూర్తి అయినాయి. ఇంకా రు. 7,687 కోట్ల పనులు జరగవలసి ఉన్నది. సవరించిన అంచనా విలువతో పోలిస్తే చేయవలసిన వ్యయం రు. 27,573 కోట్లు.

ప్రాజెక్టుకు మొత్తం అవసరమయ్యే 27,368 ఎకరాలలో 2023 వరకు 27,191 ఎకరాల భూసేకరణ పూర్తి అయ్యింది. ఇందుకోసం ప్రభుత్వం రు 1,589 కోట్లు ఖర్చు చేసింది. ఇంకా సేకరించవలసిన భూమి కేవలం 177 మాత్రమే అని ప్రాజెక్టు అధికారులు ప్రభుత్వానికి నివేదించినారు.

ప్రాజెక్టు సాగునీటి కాంపొనెంట్ పనులపై ఎన్జిటి స్టే ఉన్నది కనుక పర్యావరణ అనుమతి సాధించే వరకు ప్రాజెక్టులో కాలువల తవ్వకం అనేది సాధ్యం కాదు. కృష్ణా ట్రిబ్యునల్ ప్రాజెక్టుకు నికర జలాల కేటాయింపులు చేస్తే తప్ప పర్యావరణ అనుమతి సాధించడం సాధ్యం కాదని నిపుణులు భావిస్తున్నారు.

### 7.3 ఆర్ విద్యాసాగర్ రావు డిండి ఎత్తిపోతల పథకం, నల్లగొండ జిల్లా

ఉమ్మడి రాష్ట్రంలో డిండీ ఎత్తిపోతల పథకం గాథ మరో వ్యధ. పాలమూరు – రంగారెడ్డి కంటే పాత కథ. నల్లగొండ జిల్లాలో దేవరకొండ, మునుగోడు, నాగార్జునసాగర్, నల్లగొండ నియోజకవర్గాలు,

మహబూబ్ నగర్ జిల్లాలోని అచ్చంపేట్, కల్వకుర్తి నియోజకవర్గాలు అత్యధిక ఫ్లోరైడ్ పీడిత ప్రాంతాలుగా దేశంలోనే పేరెన్నికగన్నవి. ఫ్లోరైడ్ నీళ్ళు తాగి, ఫ్లోరైడ్ నీళ్ళతో పండించిన పంటలు, ధాన్యాలు, కూరగాయలు తిని కాళ్ళు, చేతులు వంకరలు పోయి చిన్న వయసులోనే వికలాంగులైన వేలాది మందిని ఈ గ్రామాల్లో చూడవచ్చు. ఫ్లోరైడ్ భూతం ఎక్కడిదాకా ప్రభావం కలుగజేసిందంటే తల్లి పాలల్లో కూడా ఫ్లోరైడ్ చేరిపోయింది. కేవలం ఫ్లోరైడ్ నీటిని తాగినందువల్లనే అంగ వైకల్యం వస్తుందన్న అపోహ తొలగిపోయింది. ఫ్లోరైడ్ రహిత తాగునీటి వల్ల మాత్రమే ఫ్లోరైడ్ ప్రభావాలు తొలగిపోవని తేలిపోయింది. సేద్యానికి సాగునీటిని అందుబాటులోకి తేవడం ద్వారా చాలా మట్టుకు ఫ్లోరైడ్ నుండి విముక్తిని సాధించవచ్చునని, పంటలకు ఫ్లోరైడ్ రహిత సాగునీటిని అందించగిగితే తద్వారా నేలల్లో ఫ్లోరైడ్ శాతాన్ని తగ్గించగలుగుతామని ధాన్యాల్లో, కూరగాయల్లో ఫ్లోరైడ్ శాతాన్ని గణనీయంగా తగ్గించవచ్చునని, పరిశోధనలు నిర్ధారించినాయి.

తాగునీటి కోసం, సాగునీటి కోసం నల్లగొండ జిల్లాలో జలసాధనా ఉద్యమాలు జరిగినాయి. ఉద్యమాల ప్రభావం డిల్లీ సర్కారుపై కూడా పడింది. ఈ నేపథ్యంలో నల్లగొండ జిల్లా విశ్రాంత ఇంజనీర్లు డిండీ ఎత్తిపోతల పథకాన్ని(నక్కలగండి) నవంబరు 2005 లో రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వానికి నల్లగొండ పార్లమెంట్ సభ్యుడు శ్రీ సురవరం సుధాకర్ రెడ్డి ద్వారా నివేదించినారు. జిల్లా రాజకీయ నాయకత్వాన్ని చైతన్య పరచినారు. అప్పటికే తెలంగాణ ఉద్యమం కూడా బలపడింది. అంతకు ముందే దశాబ్దాలుగా జరుగుతున్న జలసాధనా ఉద్యమాలకి, తెలంగాణ ఉద్యమ ఒత్తిడికి తలఒగ్గి వై స్ రాజశేఖర్ రెడ్డి ప్రభుత్వం ప్రాజెక్టు సర్వేకి ఆదేశించినాడు. అయితే కృష్ణా బేసిన్లో ప్రాజెక్టులను ఆమోదించడం ఆయనకు ఇష్టం లేకుండింది. రెండు నెలలు గడచినా ఫైలు ముందుకు కదలలేదు.

జనవరి 2006 లో ముఖ్యమంత్రిని మరొక్కసారి కదిలించినారు. సర్వేకి, సమగ్ర ప్రాజెక్టు నివేదిక తయారీకి ఆదేశాలు జారీ చెయ్యాలని విజ్ఞప్తి చేసినారు. సిపిఐ శాసన సభ్యులు శ్రీ చాడ వెంకట రెడ్డి గారు ప్రశ్న నంబరు 5357 ద్వారా డిండీ ఎత్తిపోతల పథకంపై ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకున్నదో తెలుపాలని కోరినాడు. ప్రాజెక్టు సాంకేతిక సాధ్యాసాధ్యాలను పరిశీలిస్తున్నదని చెప్పి ప్రభుత్వం చేతులు దులుపుకున్నది. ఆ తర్వాత 2007 దాకా జిల్లా పార్లమెంట్ సభ్యుడు సురవరం సుధాకర్ రెడ్డి గారు, జిల్లా శాసన సభ్యులు, కాంగ్రేస్ పార్టీ నాయకులు ముఖ్యమంత్రికి మహాజర్లు సమర్పిస్తూనే ఉన్నారు. ఆ మహాజర్ల మీద ఎప్పటిలాగానే మొక్కుబడి ఎండార్స్మెంట్‌లు చేస్తూనే ఉన్నాడు ఆనాటి ముఖ్యమంత్రి వైఎస్సార్.

2009 ఎన్నికలు దగ్గర పడుతుండడంతో ప్రభుత్వం డిండీ ఎత్తిపోతల పథకం సర్వేకి, సమగ్ర నివేదిక తయారీకి జి ఒ నంబరు 159 తేదీ 7.7.2007 న అయిష్టంగానైనా జారీ చేయక తప్పలేదు. అయితే 2010 లో సర్వే సంస్థ ప్రాజెక్టు నివేదికను రోశయ్య ప్రభుత్వానికి సమర్పించింది. ఆనాటికి రాజశేఖర్ రెడ్డి దివంగతుడైనాడు గనుకనే నివేదిక సమర్పించడానికి మార్గం సుగమం అయ్యిందని ఆనాడు ఇంజనీర్లు వ్యాఖానించినారు.

ఇక డిపిఆర్‌ని ముందుకు సాగకుండా తొక్కిపెట్టడానికి కుట్రల పర్వం మొదలయ్యింది. డిపిఆర్ కు పరిపాలనా అనుమతులు మంజూరు చేయవలసిన ప్రభుత్వం ఎన్నడూ లేని విధంగా నివేదికను సాంకేతిక పరిశీలన కోసం ఒక కమిటీని జూలై 2010 లో ఏర్పాటు చేసింది. కమిటీ పనితీరు నత్త కంటే అధ్వాన్నం. కమిటీ మొదటి సమావేశమే రెండున్నరేండ్ల తర్వాత జరిగిందంటే కరువు పీడిత, ఫ్లోరైడ్ పీడిత ప్రాంతాలపై ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎంత చిత్తశుద్ధితో ఉన్నదో అర్థమవుతుంది.

ఫిబ్రవరి 2012 లో కమిటి మొదటి సమావేశం జరిగింది. కమిటీ ఆ నివేదికను ఆమోదించమని సిఫారసు చేసే బదులు మరిన్ని వివరాలు కోరుతూ వెనక్కి తోసేసింది. కమిటీ రెండో సమావేశానికి సమయమే రాలేదు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాతనే కమిటీ నివేదికని పరిశీలించింది. ఇదీ ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డిండీ ఎత్తిపోతల పథకంపై ప్రదర్శించిన నిర్లక్ష్య వైఖరి. తెలంగాణ రాష్ట్రం ఎర్పడిన తర్వాత ప్రభుత్వం ప్రాజెక్టుల సమీక్షలు మొదలు పెట్టింది. ఆ క్రమంలో అటక మీద దుమ్ము పేరుకుపోయిన డిండీ ఎత్తిపోతల పథకం నివేదికను దుమ్ము దులిపి ప్రభుత్వం పరిశీలించింది. ఆ నివేదికలో ప్రాజెక్టు ప్రతిపాదనలు ఇవి :

### 7.3.1 డిండీ ఎత్తిపోతల (నక్కలగండి) పథకం తొలి ప్రతిపాదనలు :

- నల్లగొండ జిల్లాలోని దేవరకొండ, మునుగోడు, నాగార్జున సాగర్, నల్లగొండ నియోజకవర్గాల్లోని 14 మండలాల్లో, మహబూబ్ నగర్ జిల్లాలో అచ్చంపేట, కల్వకుర్తి నియోజకవర్గాల్లోని 5 మండలాల్లో 3.41 లక్షల ఎకరాలకు సాగునీరు అందించడానికి నక్కలగండి పథకాన్ని ప్రతిపాదించినారు.
- ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టులో భాగంగా నిర్మాణం అవుతున్న డిండీ బ్యాలెన్సింగ్ జలాశయం (నక్కలగండి) నుండి మిడ్ డిండీ జలాశయం, అక్కడి నుండి ప్రస్తుత డిండీ జలాశయం దాకా శ్రీశైలం నీటిని ఎత్తిపోయడం,
- డిండీ జలాశయం నుండి గ్రావిటీ ద్వారా నల్లగొండ జిల్లాలో 3.10 లక్షల ఎకరాలకు, మిడ్ డిండీ జలాశయం ద్వారా మహబూబ్ నగర్ జిల్లాలో 31,500 ఎకరాలకు సాగునీరు అందించడం, 204 గ్రామాలకు తాగునీరు అందించడం ప్రాజెక్టు ముఖ్య లక్ష్యం. ఈ పథకానికి అవసరమయ్యే నీరు 28.30 టిఎంసిలు.
- ప్రతిపాదించిన జలాశయాలు : 3 (నక్కలగండి – 7.64 టిఎంసి, మిడ్ డిండీ – 10.933 టిఎంసి, అప్పర్ డిండీ – 7.248 టిఎంసి)
- లిఫ్ట్ లు: 2 స్టేజీలు. స్టేజి 1 – 70 మీ, స్టేజి 2 – 134 మీ, మొత్తం లిఫ్టు – 204 మీ
- అవసరమయ్యే విద్యుతు : 333 మెగావాట్లు

- ముంపు విస్తీర్ణము : 40,296 ఎకరాలు
- ముంపు గ్రామాలు : మిడ్ డిండీ కింద – 3 గ్రామాలు, 1403 కట్టడాలు

  అప్పర్ డిండీ కింద – 4 గ్రామాలు, 3200 కట్టడాలు

  ఆఫ్ లైన్ జలాశయం కింద – 15 గ్రామాలు, 2867 కట్టడాలు
- నియోజకవర్గాల వారీగా ఆయకట్టు వివరాలు

| క్ర.సం | శాసనసభా నియోజకవర్గం | మిడ్ డిండీ ఆయకట్టు( ఎ) | | అప్పర్ డిండీ ఆయకట్టు (ఎ) | | మొత్తం ఆయకట్టు |
|---|---|---|---|---|---|---|
| | | కుడి కాలువ | ఎడమ కాలువ | కుడి కాలువ | ఎడమ కాలువ | (ఎ) |
| 1 | దేవరకొండ | 33,795 | – | 96,635 | – | 1,29,430 |
| 2 | మునుగోడు | 24,842 | – | 1,23,190 | – | 1,51,198 |
| 3 | నాగార్జునసాగర్ | 24,842 | – | 625 | – | 25,467 |
| 4 | నల్లగొండ | 3,855 | – | – | – | 3,855 |
| 5 | కల్వకుర్తి | – | – | 27,550 | – | 27,550 |
| 6 | అచ్చంపేట్ | – | 1,000 | – | 3,000 | 4,000 |
| | మొత్తం | 90,500 | 1,000 | 2,47,000 | 3,000 | 3,41,500 |

- ప్రాజెక్టు అంచనా వ్యయం : రూ. 6565 కోట్లు

### 7.3.2 డిండి (నక్కలగండి) పథకం రీడిజైన్ :

పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంపై సమీక్ష జరుగుతున్న సమయంలోనే నక్కలగండి పథకంపై కూడా సమీక్ష జరిగింది. పాత నివేదికలోని ప్రతిపాదనలని కూలంకషంగా ముఖ్యమంత్రి స్థాయిలో సమీక్షించిన అనంతరం నక్కలగండి ఎత్తిపోతల పథకాన్ని రీ డిజైన్ చేయవలసి ఉన్నదని ప్రభుత్వం భావించింది. ఎస్ ఏల్ బి సి టన్నెల్ ప్రాజెక్టులో భాగమైన నక్కలగండి జలాశయం నుంచి ప్రాజెక్టుకు నీటిని ఎత్తిపోయడం వలన నల్లగొండ ఎస్ ఏల్ బి సి ఆయకట్టు రైతుల ప్రయోజనాలకు ఈ ప్రతిపాదనలు భంగకరంగా మారనున్నాయన్న విమర్శలు వెల్లువెత్తినాయి. నల్లగొండ జిల్లా రైతుల మధ్య వైషమ్యాలు పొడసూపే అవకాశాలు ఉన్నాయన్న భావన బలపడింది. మరింత మెరుగైన ప్రత్యామ్నాయాలను అన్వేషించాలని ప్రభుత్వం ఇంజనీర్లని, సర్వే ఏజెన్సీని ఆదేశించింది.

సర్వే ఏజెన్సీ ఎస్కీ 5 ప్రత్యామ్నాయాలను అధ్యయనం చేయడం జరిగింది. రీ డిజైన్ అనంతరం

డిండీ ఎత్తిపోతల పథకంలో భారీ మార్పులు చోటు చేసుకున్నాయి. రెండింటి నీటి సోర్స్ శ్రీశైలం జలాశయమే కాబట్టి భౌగోళిక అనుకూలత, విద్యుత్ వినియోగం, ఖర్చు, అటవీ భూసేకరణ సమస్యల దృష్ట్యా పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టుకు, డిండీ ప్రాజెక్టుకు కూడా శ్రీశైలం జలాశయం నుండే ఒకే ఇన్ టేక్ ద్వారా నీటిని ఎత్తిపోయాలని నిర్ణయించినారు.

### 7.3.3 రీడిజైన్ తర్వాత డిండి ఎత్తిపోతల పథకం ప్రతిపాదనలు :

రీడిజైన్ తర్వాత ప్రాజెక్టు కొత్త ప్రతిపాదనల్లో .. శ్రీశైలం జలాశయం నుంచి ఒకే ఇన్టేక్ వద్ద రోజుకు 2 టిఎంసిలను 60 రోజుల వరద కాలంలో మొత్తం 120 టిఎంసిలు ఎత్తిపోయడం జరుగుతుంది. అందులో పాలమూరు రంగారెడ్డి పథకానికి 90 టిఎంసిలు, డిండీ ఎత్తిపోతల పథకానికి 30 టిఎంసిలు సరఫరా చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఏదుల జలాశయానికి ముందే 0.5 టిఎంసిల నీరు క్రాస్ రెగ్యులేటర్ ద్వారా డిండీకి మళ్లించబడతాయి. మిగతా 1.5 టిఎంసిల నీరు ఏదుల జలాశయానికి చేరతాయి. సాంకేతికంగా రెగ్యులేటర్ వద్ద డిండీకి మళ్ళించే నీరు 0.5 టిఎంసిలకు మించే అవకాశమే లేదు. కాబట్టి మహబూబ్‌నగర్‌కు న్యాయంగా రావాల్సిన నీటిని నల్లగొండకు మళ్ళిస్తారన్నది అపోహ మాత్రమే. డిండీకి పోవాల్సిన 30 టిఎంసిల నీటి కోటా పూర్తి అయిన తర్వాత రెగ్యులేటర్ మూసివేసి మొత్తం 2 టిఎంసిల నీటిని ఏదుల జలాశయానికి తరలించవచ్చు. అందుకు వీలుగానే ఏదుల టన్నెల్ డిజైన్ చేయడం జరిగింది.

రీ డిజైన్ అనంతరం డిండీ ఎత్తిపోతల పథకంలో భారీ మార్పులు చోటు చేసుకున్నాయి. కొత్త ప్రతిపాదనలు ఈవిధంగా ఉన్నాయి.

- శ్రీశైలం జలాశయం నుండి 60 రోజుల పాటు రోజుకి 0.50 టిఎంసిల నీటిని ప్రస్తుత అప్పర్ డిండీ జలాశయానికి ఎత్తిపోసి 30 టిఎంసిల నీటిని నల్లగొండ, మహబూబ్ నగర్ జిల్లాలో 3.41 లక్షల ఎకరాలకు సాగునీరు అందించాలి.
- అప్పర్ డిండీ జలాశయం కింద ఉన్న 12,000 ఎకరాల ఆయకట్టుని స్థిరీకరిస్తూ నల్లగొండ, మహబూబ్ నగర్ జిల్లాల్లో మరో 18,000 ఎకరాల కొత్త ఆయకట్టును సాగులోనికి తీసుకరావడం
- అప్పర్ డిండీ జలాశయం నుండి 3 ఆన్ లైన్, 2 ఆఫ్ లైన్ జలాశయాలకు నీటిని గ్రావిటీ కాలువ ద్వారా సరఫరా చేయడం
- డిండి ఎత్తిపోతల ప్రాజెక్టులోని జలాశయాల వివరాలు:

| క్రసం | జలాశయం | నీటి నిల్వ (టిఎంసి) | ఆయకట్టు ఎకరాలు | ఎఫ్ఆర్ ఎల్ | ముంపు గ్రామాలు | ముంపు విస్తీర్ణం(ఎ) |
|---|---|---|---|---|---|---|
| 1 | ప్రస్తుత డిండీ | 2.640 | 30000 | 396.545 | - | - |
| 2 | సింగరాజుపల్లి | 0.810 | 13000 | 380.000 | 0 | 702 |
| 3 | గొట్టిముక్కల | 1.839 | 28000 | 340.000 | 2 | 1789 |
| 4 | చింతపల్లి | 0.910 | 15000 | 354.000 | 0 | 1544 |
| 5 | కిష్టరాంపల్లి | 6.252 | 1,00,000 | 385.000 | 2 | 2957 |
| 6 | శివన్నగూడెం | 10.959 | 1,55,000 | 384.000 | 3 | 3734 |
| | మొత్తం | 23.410 | 3,41,000 | - | 7 | 10729 |

ప్రభుత్వం రీ డిజైన్ చేసిన ఈ ప్రతిపాదనలకు రూ. 6190 కోట్లకు పరిపాలనా అనుమతులు మంజూరు చేస్తూ జి ఒ నంబరు 107 తేదీ 11.6.2015 ని జారీ చేసింది. మొత్తం ప్రాజెక్టు పనులని 12 ప్యాకేజిలుగా విభజించి టెండర్లు పిలిచింది. ప్రాజెక్టు పనులు ప్రారంభం అయినాయి. ప్రాజెక్టు పూర్తి అయితే నల్లగొండ జిల్లా ప్రజలకు ఫ్లోరైడ్ మహమ్మారి నుండి విముక్తి లభించబోతున్నది. ప్రభుత్వానికి సాగునీటి సలహాదారుగా పని చేసిన ఆర్ విద్యాసాగర్ రావు గారు మరణించిన తర్వాత ఆయన స్మారకార్థం ప్రాజెక్టు పేరును 'ఆర్ విద్యాసాగర్ రావు డిండి ఎత్తిపోతల పథకం' గా మారుస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

### 7.3.4 ప్రాజెక్టు పనుల పురోగతి :

2023 వరకు ప్రాజెక్టు పనుల మీద గత ప్రభుత్వం రు. 3152.78 కోట్లు ఖర్చు చేసింది. ప్రాజెక్టు కోసం అవసరమయ్యే 16,324 ఎకరాల భూమిలో గత ప్రభుత్వం 11,957 ఎకరాలు సేకరించింది. ఇందు కోసం రు.570.25 కోట్లు ఖర్చు చేసింది. 2023 వరకు జలాశయాల మట్టి పనులు 50 %, కాంక్రీట్ పనులు 25 %, స్ట్రక్చర్ల నిర్మాణం 20 %, కాలువల తవ్వకం 40 % పూర్తి అయినట్టు ప్రాజెక్టు అధికారులు ప్రభుత్వానికి నివేదించినారు. అయితే ప్రాజెక్టు పనుల ప్రారంభం అవడంతో కుట్రల పర్వం కూడా మొదలయ్యింది. పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టు మీద ఎన్ జి టి లో కేసులు వేసినట్టే డిండి ఎత్తిపోతల పథకంపై కూడా కేసులు వేసినారు. పర్యావరణ అనుమతులు పొందకుండానే ప్రాజెక్టు పనులు ప్రారంభించినారని ఆరోపిస్తూ ప్రాజెక్టు పనులను ఆపివేయమని ఎన్ జి టి ని విజ్ఞప్తి చేసినారు. పర్యావరణ అనుమతి పొందే వరకు ప్రాజెక్టు పనులు కొనసాగించరాదని ఎన్ జి టి స్టే విధించడంతో ప్రాజెక్టు పనులు ఆగిపోయినాయి. ఈ ప్రాజెక్టు కూడా 30 టిఎంసిల వరద




**16, ఫిబ్రవరి, 2016 రోళ్ళపాడు వద్ద సీతారామప్రాజెక్టుకు శంకుస్థాపన చేసిన కెసిఆర్.**

జలాల కేటాయింపులు కలిగిన ప్రాజెక్టు కాబట్టి కృష్ణా ట్రిబ్యునల్ నికర జలాల కేటాయింపులు చేస్తే తప్ప కేంద్ర ప్రభుత్వం నుంచి పర్యావరణ అనుమతి సాధించడం వీలు కాదు. పర్యావరణ అనుమతులు సాధించే వరకు ప్రాజెక్టు పనులు ముందుకు సాగడం న్యాయపరంగా కష్టమే అని నిపుణులు భావిస్తున్నారు.

## 7.4 సీతారామ & సీతమ్మసాగర్ బహుళార్థకసాధక ప్రాజెక్టు :

తెలంగాణ ప్రభుత్వం ఉమ్మడి ఖమ్మం జిల్లాను సస్యశ్యామలం చేసేందుకు రూపొందించిన సీతారామ ప్రాజెక్టుపై ఇటీవల కొంత మంది అప్పటి ప్రతిపక్ష, ఇప్పటి అధికార పక్షం నాయకులు అర్థ రహితమైన విమర్శలు చేయడం జరుగుతున్నది. ఈ విమర్శల నేపథ్యంలో ఈ ప్రాజెక్టు రూపకల్పనకు దారితీసిన పరిస్థితులను వివరించవలసిన అవసరం ఉన్నది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడగానే ప్రాజెక్టుల సమీక్షల్లో భాగంగా కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్, అనుభవజ్ఞులైన ఇంజనీర్లతో ముఖ్యమంత్రి సమక్షంలో జలయజ్ఞంలో ప్రారంభించిన రాజీవ్ దుమ్ముగూడెం, ఇందిరాసాగర్ రుద్రమకోట ప్రాజెక్టులపై మేధోమధనం జరిగింది. ఆ చర్చల్లో ఈ రెండు ప్రాజెక్టులను కలిపి ఒకే సమీకృత ప్రాజెక్టుగా మార్చడానికి అవకాశం ఉన్నదని భావించడం జరిగింది. ఆ చర్చల ఆధారంగా రాజీవ్ దుమ్ముగూడెం, ఇందిరాసాగర్ రుద్రమకోట ప్రాజెక్టులను రీ ఇంజనీరింగ్ ద్వారా ఒకే సమీకృత సీతారామ ప్రాజెక్టుకు కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్ ప్రభుత్వానికి తుది నివేదికను



నిర్మాణం పూర్తైన సీతారామ ప్రాజెక్టు ప్రధాన కాలువ

సమర్పించింది. 2016 ఫిబ్రవరి 4 న జరిగిన క్యాబినెట్ సమావేశంలో ఈ నివేదికను ప్రభుత్వం ఆమోదించింది. ఆ తర్వాత ముఖ్యమంత్రి ప్రాజెక్టు పనులకు శంఖు స్థాపన చేసిన సంగతి అందర్కీ ఎరుకే. ఈ రెండు ప్రాజెక్టులను కలిపి ఒకే సమీకృత ప్రాజెక్టుగా ఎందుకు రూపకల్పన చెయ్యవలసి వచ్చిందో ప్రజలు తెలుసుకోవాలి.

### 7.4.1 సమీకృత సీతారామ ప్రాజెక్టు ఎందుకు ?

గత సమైక్యాంధ్ర ప్రభుత్వ హయాంలో జలయజ్ఞం కార్యక్రమంలో భాగంగా ఖమ్మం జిల్లాకు 16.5 టిఎంసిల గోదావరి నీటిని వినియోగించి 2 లక్షల ఎకరాలకు సాగునీరందించే రాజీవ్ దుమ్ముగూడెం ఎత్తిపోతల పథకం, 16.5 టిఎంసిల గోదావరి నీటిని వినియోగించి ఖమ్మం, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల్లో మరో 2 లక్షల ఎకరాలకు నీరందించే ఇందిరా సాగర్ – రుద్రమకోట ఎత్తిపోతల పథకం చేపట్టడం జరిగింది. ఇందిరాసాగర్ – రుద్రమకోట ఎత్తిపోతల పథకం ఖమ్మం జిల్లాలో 1,32,657 ఎకరాలకు, 68,272 ఎకరాలకు ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని భూములకు నీరందించడానికి రూపొందించిన పథకం. వెరసి ఈ రెండు పథకాల ద్వారా తెలంగాణలో 27.72 టిఎంసిల గోదావరి నికర జలాల వినియోగంతో 3 లక్షల 33 వేల ఎకరాల సాగవుతుంది. ఈ రెండు పథకాలకు అయ్యే ఖర్చు రు. 2,392 కోట్లుగా అంచనా వెయ్యబడింది. అయితే ఈ పథకం అమలు కోసం ప్రధానంగా 18 కిలోమీటర్ల పొడవున కిన్నెరసాని వన్యప్రాణి సంరక్షణ ప్రాంతం ప్రధాన ఆటంకంగా ఉండింది. ఈ రెండు పథకాలకు కలిపి 1.2 టిఎంసిల జలాశయ సామర్థ్యం మాత్రమే అదనంగా కల్పించబడింది.

### 7.4.2 రాజీవ్ దుమ్ముగూడెం ఎత్తిపోతల పథకం ముఖ్య వివరాలు :

- పరిపాలనా అనుమతి : రూ.1681 కోట్లు, జి ఒ నం 249 తేదీ 30.12.2005
- నీటి కెటాయింపులు : 16.50 టి ఎం సి లు
- అప్రోచ్ చానల్ పొడవు : 18.60 కి మీ
- పైప్ లైన్ పొడవు : 55.68 కి మీ
- గ్రావిటీ కాలువ పొడవు :150.52 కి మీ
- పంపు హౌజ్‌ల సంఖ్య : 7
- విద్యుత్ వినియోగం : 119.75 మెగావాట్లు
- ఆయకట్టు : తెలంగాణ – ఖమ్మం జిల్లా : 1,97,000 ఎకరాలు వరంగల్ జిల్లా :3,000 ఎకరాలు
- 2014 జూన్ వరకు అయిన మొత్తం ఖర్చు : రూ. 889.185 కోట్లు.

### 7.4.3 ఇందిరా సాగర్ - రుద్రమకోట ఎత్తిపోతల పథకం ముఖ్య వివరాలు :

- పరిపాలనా అనుమతి : రూ. 1824 కోట్లు , జి ఒ ఎం ఎస్ నం 249 తేదీ 30.12.20005
- నీటి కెటాయింపులు : 16.50 టిఎంసిలు
- అప్రోచ్ చానల్ పొడవు : 15.00 కి మీ
- పైప్ లైన్ పొడవు : 21.70 కి మీ
- గ్రావిటీ కాలువ పొడవు :118.00 కి మీ
- పంపు హౌజ్‌ల సంఖ్య : 3
- విద్యుత్ వినియోగం : 229.10 మెగావాట్లు
- ఆయకట్టు : తెలంగాణ – ఖమ్మం జిల్లా : 1,32,657 ఎకరాలు
- ఆంధ్ర ప్రదేశ్ – కృష్ణా జిల్లా : 24,450 ఎకరాలు పశ్చిమ గోదావరి జిల్లా : 43, 822 ఎకరాలు
- 2014 జూన్ వరకు మొత్తం ఖర్చు : రూ. 1063.878 కోట్లు.

రాష్ట్ర విభజన తర్వాత ఖమ్మం జిల్లా 7 మండలాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి బదిలీ అయిన కారణంగా ఇందిరాసాగర్ రుద్రమ కోట ప్రాజెక్టు అంతర్రాష్ట్ర ప్రాజెక్టుగా మారింది. ఈ ప్రాజెక్టు హెడ్ వర్క్స్ ఉన్న ప్రాంతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భూభాగంలోకి మారిపోయింది. ఈ మార్పు కారణంగా ఖమ్మం జిల్లాలోని ప్రతిపాదిత 1,33,000 ఎకరాలకు నీరు అందివ్వగలగటం ఆంధ్రప్రదేశ్ అనుమతి, సహకారం లేకుండా సాధ్యపడదు. ప్రాజెక్టు హెడ్ వర్క్స్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉన్నందున భవిష్యత్తులో ఈ ప్రాజెక్టు నిర్వహణలో సమస్యలు ఉత్పన్నం అయ్యే అవకాశాలు ఉన్నవి. దీన్ని అంతర్రాష్ట్ర ప్రాజెక్టుగా



సీతారామ ప్రాజెక్టులో పూర్తైన పంపు హౌజ్ నెంబర్ 1

ఒప్పందం కుదుర్చుకోవడానికి తెలంగాణ ప్రభుత్వం లేఖలు రాసినప్పటికీ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నుంచి స్పందన రాలేదు.

అదే సమయంలో రాజీవ్ దుమ్ముగూడెం ప్రాజెక్టు పైప్ లైన్ మార్గం కిన్నెరసాని వన్యప్రాణి అటవీ ప్రాంతం నుండి వెళుతున్నందున అటువంటి ఎకో సెన్సిటివ్ జోన్‌లో అనుమతులు పొందడం కష్టం. అంతర్రాష్ట్ర సమస్యలను శాశ్వతంగా అధిగమించడానికి, వన్యప్రాణి అటవీ ప్రాంతం అనుమతుల సమస్యలని అధిగమించడానికి ఈ రెండు ప్రాజెక్టులను కలిపి ఒకే సమీకృత ప్రాజెక్టుగా (సీతారామ ప్రాజెక్టు) గా రూపొందించడం అనివార్యంగా మారింది.

ఈ రెండు ప్రాజెక్టుల ద్వారా ప్రతిపాదించిన 3,33,000 ఎకరాలకు అదనంగా మరో 1,65,000 ఎకరాలకు నీరిచ్చే ఉద్దేశ్యంతోనూ, ప్రస్తుతం ప్రతిపాదించిన 1.2 టిఎంసి నిలువ సామర్థ్యానికి అదనంగా మరో 10 టిఎంసిల సామర్థ్యం కల్పించే లక్ష్యంతో ప్రత్యామ్నాయంగా సమీకృత సీతారామా ఎత్తిపోతల పథకాన్ని రు 7967 కోట్ల ఖర్చుతో చేపట్టాలని తెలంగాణ ప్రభుత్వం భావించింది. ఈ ప్రాజెక్టు ద్వారా ఖమ్మం జిల్లాలోని 25 మండలాల్లో, వరంగల్ జిల్లాలోని ఒక మండలంలో స్థిరీకరణ సహా మొత్తం 16.74 లక్షల ఎకరాలకు సాగునీరు , వందలాది గ్రామాలకు తాగునీరు అందించడానికి ఈ పథకాన్ని రూపొందించడం జరిగింది.

### 7.4.4 సీతారామ ఎత్తిపోతల పథకం ముఖ్యాంశాలు :

- ప్రదేశం : గోదావరిపై ప్రస్తుత దుమ్ముగూడెం ఆనకట్టకు ఎగువన
- ఆయకట్టు : కొత్త ఆయకట్టు 3.29 లక్షల ఎకరాలు, స్థిరీకరణ ఆయకట్టు 3.45 లక్షల ఎకరాలు, మొత్తం 6.74 లక్షల ఎకరాలు
- నీటి కెటాయింపులు : 67 టిఎంసిలు (ఆరుతడి పంటలకు)
- పంపింగ్ సామర్థ్యం : 9000 క్యూసెక్కులు
- అప్రోచ్ చానల్ పొడవు : 46.46.30 కి.మీ
- పైప్ లైన్ల పొడవు : 10.30 కి.మీ
- పంపింగ్ స్టేషన్ల సంఖ్య : 11
- విద్యుత్ వినియోగం : 755 మె వా
- భూసేకరణ : అటవీ భూమి – 11,861 ఎకరాలు, అటవీయేతర భూమి – 8154 ఎకరాలు
- ఆన్ లైన్ జలాశయాల సంఖ్య : 4
- ప్రాజెక్టు అంచనా విలువ : రూ. 7926 కోట్లు (2016)
- ప్రాజెక్టు సవరించిన అంచనా విలువ : రు 13,058 కోట్లు (2018)

ఈ ప్రాజెక్టు రూపకల్పన వెనుక ఖమ్మం జిల్లా ప్రజల ప్రయోజనాలు, అంతర్రాష్ట్ర సమస్యలను శాశ్వతంగా అధిగమించడం, నీటి నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవడానికి జలాశయాల నిర్మాణం, కిన్నెరసాని వన్యప్రాణి నివాస ప్రాంతాన్ని తప్పించడం మొదలైన లక్షాలే ఉన్నాయి తప్ప మరే ఇతర కారణాలు లేవు.

ఇందిరాసాగర్ – రుద్రమకోట ప్రాజెక్టుల పనులు 80% పూర్తి అయినట్లు, ఇట్టి ప్రాజెక్టును ప్రభుత్వం వదిలేసిందని కొందరు ఆరోపించడం పూర్తిగా సత్యదూరం. పంపుహౌజ్ గుంతలు తవ్వి పెట్టినారు. పంపులు, మోటార్లు తెప్పించి గోదాముల్లో పెట్టుకున్నారు. పైపులు మాత్రం వేసినారు. పంప్ హౌజ్ నిర్మాణం పూర్తి కాకుండానే, పంపులు, మోటార్లు బిగించకుండానే 80 % పనులు పూర్తి అయినాయని వారు చెప్పడం విడ్డూరం. ఆంధ్రప్రదేశ్ నిరంతరం తెలంగాణ ప్రాజెక్టులను అడ్డుకుంటున్నది. మనకు రావాల్సిన కృష్ణా నీటి వాటాలపై పేచీలు పెడుతున్నది. ఇటువంటి పేచీకోరు రాష్ట్రంతో శాశ్విత పరిష్కారంగా సమీకృత సీతారామా ప్రాజెక్టును రూపకల్పన చేసి గతంలో కన్న ఎక్కువ భూమికి సాగునీరు అందించే ప్రయత్నం చేస్తుంటే స్వాగతించవలసింది పోయి విమర్శలకు దిగడం శోచనీయం. రు 1145 కోట్ల అగ్రిమెంట్ విలువలో 768 కోట్లు ఖర్చు పెట్టి 80% పనులు పూర్తి అయినాయని చెప్పడం వాస్తవ విరుద్దం. ప్రాజెక్టు పనుల భౌతిక పురోగతి 60 % కూడా లేదు. నీటిని ఎత్తిపోసే క్రిటికల్ పనులు అయిన పంపు హౌజ్ పనులు ఎక్కడివి అక్కడే ఉన్నాయి.

ఇక రీడిజైన్ వలన 400 టిఎంసి శబరి నీళ్లను కోల్పోవలసి వస్తున్నదని వారు బాధపడుతున్నారు. శబరి నది గోదావరిలో కలిసిన తర్వాతనే ఇందిరాసాగర్ హెడ్ వర్క్స్ ఉన్నమాట వాస్తవమే. ఇందిరాసాగర్–

రుద్రమకోట ప్రాజెక్టుకు కెటాయించిన నీళ్ళే 16.5 టిఏంసిలు. ఇక 400 టిఎంసిలు కోల్పోవడం అనే సమస్య ఎక్కడిది ? అయినా ఈ పాపం ఎవరిది ? ఖమ్మం జిల్లా 7 మండలాలని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి అప్పనంగా రాసిచ్చిన కేంద్రంలో అధికారంలో ఉన్న బిజెపి ప్రభుత్వానిది. వారితో ఆ పని చేయించిన చంద్రబాబు నాయుడుది. భౌగోళికంగా కూడా శబరి నీళ్ళని తెలంగాణ వాడుకునే పరిస్థితి లేదు. దుమ్ముగూడెం వద్ద గోదావరిలో పుష్కలంగా నీళ్ళున్నాయి. కనుకనే 67 టిఎంసిలతో సమీకృత సీతారామ పథకానికి రూపకల్పన చేయడం జరిగింది. ఖమ్మం జిల్లా సశ్యశ్యామలం అవుతుంటే తమకు రాజకీయ భవిశ్యత్తు ఉండదన్న అక్కసుతో వారు ఇటువంటి విమర్శలకు దిగుతున్నట్లు భావించవలసి వస్తుంది. ఖమ్మం జిల్లా ప్రజలు విజ్ఞత కలిగినవారు. సీతారామా ప్రాజెక్టు వలన ఖమ్మం జిల్లాకు అందే ప్రయోజనాలు వారికి ఎరుకే. గత ప్రభుత్వం చేపట్టిన రెండు ప్రాజెక్టులని, సీతారామ ప్రాజెక్టుని పోల్చి చూసినట్లైతే తేడా అర్థమవుతుంది.

- సీతారామ ప్రాజెక్ట్ మొత్తం తెలంగాణ రాష్ట్రంలోనే ఖమ్మం, వరంగల్ జిల్లాల్లోనే ఉన్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంతో ఎదురయ్యే అంతర్రాష్ట్ర సమస్యలని శాశ్వితంగా పరిష్కరిస్తుంది. ఇందిరాసాగర్ ప్రాజెక్ట్ అంతర్రాష్ట్ర ప్రాజెక్టు అన్న సంగతిని ప్రజలు గమనించాలి.
- సీతారామ ప్రాజెక్టు యొక్క పైప్ లైన్లు, కాలువలు కిన్నెరసాని వన్యప్రాణి సంరక్షణా కేంద్రానికి, ఎకో సెన్సిటివ్ జోన్‌కి దూరంగా ఉన్నాయి. అటవీ అనుమతుల్లో సమస్యలు ఉండవు.
- సమీకృత ప్రాజెక్టులో గతంలో ఏ ప్రాజెక్టు పరిధిలోనికి రాని ఎత్తైన ప్రాంతాలైన తిరుమలాయపాలెం, కూసుమంచి, ముదిగొండ మండలాల్లో భూములకు సాగునీటి సౌకర్యం కల్పిస్తుంది.
- గత ప్రాజెక్టుల్లో తెలంగాణలో ఆయకట్టు 3.33 లక్షలు అయితే ప్రస్తుత సమీకృత ప్రాజెక్టులో ఆయకట్టు 6.74 లక్షల ఎకరాలు. ఇందులో కొత్త ఆయకట్టు 3.29 లక్షల ఎకరాలైతే స్థిరీకరణ ఆయకట్టు 3.45 లక్షల ఎకరాలు.
- తర్వాతి కాలంలో ఎల్లెందు నియోజకవర్గంలో 1.13 లక్షల ఎకరాల ఆయకట్టు చేర్చడంతో కొత్త ఆయకట్టు 4.42 లక్షల ఎకరాలకు చేరింది. మొత్తం ఆయకట్టు 7.87 లక్షల ఎకరాలు.
- పాత ప్రాజెక్టుల్లో నీటి వినియోగం 33 టిఎంసిలైతే సమీకృత సీతారామ ప్రాజెక్టులో ప్రతిపాదించిన నీటి వినియోగం 67.05 టిఎంసిలు.
- నీటి కొరత ఉన్న సంవత్సరాల్లో సమీకృత ప్రాజెక్టు ద్వారా పాలేరు నుండి నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆయకట్టును, వైరా, లంకసాగర్, పెద్దవాగు, రోళ్ళవాగు, బయ్యారం వంటి మధ్యతరహా ప్రాజెక్టులకు నీరు సరఫరా చేసి వాటి కింద ఆయకట్టుని స్థిరీకరించవచ్చు.

ఖమ్మం జిల్లాలో 6.74 లక్షల ఎకరాలకు సాగునీరు అందించే సీతారామ ఎత్తిపోతల పథకం ద్వారా సాగునీరు, తాగునీరు అందించడానికి ప్రభుత్వం ప్రాజెక్టుల నిర్మాణం కొనసాగింది. సీతారామ ప్రాజెక్టుకు నీటి సరఫరా చేసే హెడ్ వర్క్స్, పంప్ హౌజ్ లు, కాలువల పనులను 16 ప్యాకేజీలుగా

విభజించి టెండర్లు పిలవడం జరిగింది. వాటి అగ్రిమెంట్ విలువ రు 7,396 కోట్లు. 2023 వరకు ప్రాజెక్టు పనులపై అయిన ఖర్చు రు 7,479 కోట్లు (58 %). రు 5,579 కోట్ల పనులు ఇంకా పూర్తి చేయవలసి ఉన్నది.

### 7.4.5 సీతమ్మసాగర్ బహుళార్ధకసాధక ప్రాజెక్టు :

తర్వాతి కాలంలో ప్రస్తుతం గోదావరి నదిపై ఉన్న దుమ్ముగూడెం ఆనకట్టకు సుమారు 200 మీటర్ల దిగువన 36.57 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో సీతమ్మసాగర్ బ్యారేజీని కూడా నిర్మించాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. బ్యారేజీకి అనుబంధంగా 282.80 మెగావాట్ల స్థాపిత సామర్థ్యం కలిగిన జల విద్యుత్ కేంద్రం కూడా నిర్మించాలని తలపోసింది. ఈ బ్యారేజి ద్వారా ఏడాది పొడుగునా సీతారామ ఎత్తిపోతల పథకానికి సాగునీరు సరఫరా చేయడంతో పాటు గోదావరి ప్రవాహాలను వినియోగించి జల విద్యుత్తును కూడా ఉత్పత్తి చేయడానికి వీలు కలుగుతుంది. సీతారామ ఎత్తిపోతల పథకం, సీతమ్మసాగర్ బ్యారేజి, జల విద్యుత్ కేంద్రం అనే మూడు ముఖ్యమైన విభాగాలు ఉండడంతో ప్రాజెక్టును "సమీకృత సీతారామ & సీతమ్మసాగర్ బహుళార్ధకసాధక ప్రాజెక్టు" గా నామకరణం చేసి రు. 19,954.10 కోట్లకు డిపిఆర్ తయారు చేసి జూన్ 2023 లో కేంద్ర జల సంఘానికి, పర్యావరణ అనుమతి కోసం కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖకు, కేంద్ర విద్యుత్ ప్రాధికార సంస్థకు(CEA) పంపించడం జరిగింది. ఇందులో సాగునీటి కాంపొనెంట్ విలువ రు. 19,026.96 కోట్లు, జల విద్యుత్ ప్లాంట్ విలువ రు 927.14 కోట్లు.




నిర్మాణంలో ఉన్న సీతమ్మసాగర్ ప్రాజెక్టు

### 7.4.6 సీతమ్మసాగర్ బ్యారేజి ముఖ్యాంశాలు :

- బ్యారేజి మొత్తం పొడవు 1332.75 మీటర్లు. బ్యారేజిని మొత్తం 6 బ్లాకులుగా విభజించడం జరిగింది.
- బ్యారేజీలో మొత్తం గేట్ల సంఖ్య 67.
- బ్యారేజి నిల్వ సామర్థ్యం : 36.57 టిఎంసిలు
- బ్యారేజీలో నీటి నిల్వ మట్టం (FRL) : 63 మీటర్లు
- విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం : 282.80 మెగావాట్లు

### 7.4.7 సమీకృత సీతమ్మసాగర్ ప్రాజెక్టు పురోగతి :

- ప్రాజెక్టు అధికారులు ప్రభుత్వానికి సమర్పించిన నివేదికల ప్రకారం సీతమ్మసాగర్ బ్యారేజి పనులు పురోగతిలో ఉన్నాయి.
- సీతారామ ఎత్తిపోతల పథకం ప్రధాన కాలువ పనులు 114 కిలోమీటర్లు పూర్తి అయినాయి
- ఈ రీచ్‌లో మూడు పంప్ హౌజ్‌ల పనులు పూర్తి అయినాయి వీటి వెట్‌రన్ కూడా విజయవంతం అయినాయి.
- సత్తుపల్లి లింకు కాలువ, పాలేరు లింకు కాలువ పనులు పురోగతిలో ఉన్నాయి.
- నాగార్జున సాగర్ కాలువకు నీటిని సరఫరా చేసే ఎన్కూరు లింకు కాలువ పనులు పూర్తి అయినాయి. ఇటీవలే ఈ కాలువ ద్వారా నాగార్జునసాగర్ కాలువలోకి నీటిని విడుదల చేయడం జరిగింది.
- డిస్ట్రిబ్యూటరీ కాలువలకు టెండర్లు పిలువడానికి అంచనాలు సిద్ధంగా ఉన్నాయి

### 7.4.8 2023 నాటికి బ్యారేజి ం హెడ్ రెగ్యులేటర్ ం పర్ణశాల రక్షణ పనుల పురోగతి :

- మట్టి పనులు : 100 శాతం పూర్తి
- కాంక్రీట్ పనులు : 86 శాతం పూర్తి
- హైడ్రో మెకానికల్ పనులు : 36 శాతం పూర్తి
- గైడ్ బంద్ మట్టి కట్ట పనులు : 58 శాతం పూర్తి

సీతారామ – సీతమ్మసాగర్ ప్రాజెక్టుకు గత ప్రభుత్వ కాలంలోనే కేంద్ర జల సంఘం అన్ని విభాగాల నుంచి అనుమతులు వచ్చి ఉన్నాయి. అంతిమ అనుమతి TAC నుంచి రావలసి ఉండగా వారు బ్యారేజి డిజైన్లను మరొక సారి కూలంకషంగా పరిశీలించి నివేదించమని కేంద్ర జల సంఘాన్ని కోరినారు. డిజైన్ల పరిశీలన పూర్తి అయి వారు సంతృప్తి చెందితే సమీకృత సీతమ్మసాగర్ ప్రాజెక్టుకు కేంద్ర జల వనరుల మంత్రిత్వ శాఖ సలహా మండలి అనుమతి జారీ చేస్తుంది. చివరికి 24.04.2025న ఢిల్లీలో జరిగిన 158వ టిఎసి సమావేశంలో సమీకృత సీతమ్మసాగర్ ప్రాజెక్టుకు క్లియరెన్స్ జారీ చేసింది.

దీనితో 67 టిఎంసిల ప్రాజెక్టుకు అన్ని అనుమతులు కేంద్ర జలశక్తి శాఖ నుండి పొందినట్టయ్యింది. ప్రాజెక్టుకు కేంద్ర పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ నుంచి పర్యావరణ, అటవీ అనుమతులు రావలసి ఉంది. సమీకృత సీతమ్మసాగర్ ప్రాజెక్టు పనులన్నిటిని 2027 నాటికి పూర్తి చేయడానికి ప్రాజెక్టు అధికారులు ప్రణాళికలు సిద్ధం చేశారు.

అయితే ప్రాజెక్టుకు పర్యావరణ అనుమతి లేదని కొంతమంది ప్రాజెక్టు వ్యతిరేకులు జాతీయ గ్రీన్ ట్రిబ్యునల్ లో కేసు వేసినందున పర్యావరణ అనుమతి వచ్చే వరకు ప్రాజెక్టు పనులు ఆపివేయమని ట్రిబ్యునల్ ఆదేశించడంతో బ్యారేజి నిర్మాణ పనులు ఆగిపోయినాయి. అయితే గతంలోనే సీతారామా ఎత్తిపోతల పథకానికి పర్యావరణ అనుమతి ఉండడంతో సీతారామ ఎత్తిపోతల పథకం పనులు పూర్తి చేసుకోవడానికి ఏ ఆటంకాలు లేవు. ప్రభుత్వం పనులకు, భూసేకరణకు నిధులు సమకూర్చితే పనులు అనుకున్న సమయానికే పూర్తి చేయడానికి అవకాశం ఉన్నది. ఈ లోపు బ్యారేజీకి కూడా పర్యావరణ అనుమతి పొందినట్లైతే బ్యారేజి పనులు కూడా పూర్తి చేసుకోవచ్చు.

### 7.5 కంతనపల్లి / సమ్మక్కసాగర్ బ్యారేజి :

కంతనపల్లి బ్యారేజీని రెండు లక్ష్యాలతో ఉమ్మడి రాష్ట్రంలో జలయజ్ఞంలో ప్రతిపాదించడం జరిగింది.

1. శ్రీరాంసాగర్ మొదటి దశ , రెండో దశ ఆయకట్టు 7.50 లక్షల ఎకరాలను స్థిరీకరించడం 2. దేవాదుల ఎత్తిపోతల పథకానికి 170 రోజుల పంపింగ్ కు వీలుగా ఒక జలాశయాన్ని సృష్టించడం.



సమ్మక్క సాగర్ బ్యారేజి

అయితే కంతనపల్లి బ్యారేజీని 85 మీటర్ల ఎఫ్ఆర్ఎల్(FRL) తో నిర్మించడానికి డిజైన్లు తయారుచేయడం జరిగింది. ఈ మట్టం వద్ద 11,000 ఎకరాల ఆదివాసీ భూములు, 4 ఆదివాసీ గ్రామాలు ముంపు బారిన పడుతున్నాయి. ఆదివాసీ ప్రజల నుండి ముంపుకి వ్యతిరేకంగా తీవ్ర నిరసన వ్యక్తం అయ్యింది. శ్రీరాంసాగర్ మొదటి దశ, రెండో దశ ఆయకట్టుకి కాకతీయ కాలువను ఆధునీకరించి పూర్తి ప్రవాహ సామర్థ్యంతో నీటిని తరలించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. శ్రీరాంసాగర్ పునరుజ్జీవన పథకం ద్వారా శ్రీరాంసాగర్ జలాశయానికి నీటి సరఫరా జరుగుతున్నందున ఆధునీకరించిన కాకతీయ కాలువ ద్వారానే నీటిని సరఫరా చేసే పరిస్థితి ఏర్పడుతున్నందున కంతనపల్లి నుండి ఈ ఆయకట్టుకు నీటిని ఎత్తిపోసే అవసరం లేదు. ఈ నేపథ్యంలో కంతనపల్లి రెండు లక్ష్యాల్లో కేవలం దేవాదుల ప్రాజెక్టుకు జలాశయం సృష్టించడం ఒకటే మిగిలిపోయింది. కనుక ఆదివాసీల భూములను, గ్రామాలను ముంపు నుండి బయట పడేయడానికి బ్యారేజీ స్థలాన్ని కంతనపల్లి బ్యారేజికి 14 కిమీ ఎగువన తుపాకులగూడెంకు మార్చాలన్న నిర్ణయాన్ని ప్రభుత్వం తీసుకున్నది. ఈ తుపాకుల గూడెం బ్యారేజీకి అనంతర కాలంలో ప్రభుత్వం “సమ్మక్క సాగర్” గా పేరు మార్చడం జరిగింది.

ఛత్తీస్‌ఘర్ రాష్ట్రంలో ముంపు లేకుండా ఉండడానికి తుపాకులగూడెం బ్యారేజి పూర్తి స్థాయి నీటి మట్టం 83 మీ గా నిర్ధారించినారు. వాప్కోస్ వారి సర్వేలో తుపాకులగూడెం వద్ద బ్యారేజి నిర్మాణం వలన గోదావరి ఒడ్డున కేవలం 637 ఎకరాలు మాత్రమే ముంపునకు గురి అవుతున్నాయి. ఆదివాసీ గ్రామాలు గాని, ఇండ్లు గాని ముంపులోకి రావడం లేదని తేలింది. సుమారు 7 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో ఏర్పడే జలాశయం దేవాదులకు జీవాన్ని ప్రసాదిస్తుంది. దేవాదుల ప్రాజెక్టు ప్రతిపాదిత లక్ష్యాలను నెరవేర్చగలుగుతుంది. బ్యారేజి నిర్మాణం జూన్ 2020 నాటికి పూర్తి అయ్యింది. బ్యారేజి నిర్మాణం కాక మునుపు గోదావరిలో 72 మీటర్ల ఎత్తులో ప్రవాహాలు ఉన్నప్పుడే దేవాదుల పంప్ హౌజ్ లోకి నీటిని తరలించగలిగేవారు. 72 మీటర్ల ఎత్తులో గోదావరిలో ప్రవాహాలు ఏడాదికి 90 నుంచి 100 రోజులకు మించి అందుబాటులో ఉండేవి కావు. ఇప్పుడు దేవాదుల ప్రాజెక్టుకు ఏడాదికి 205 రోజుల పాటు పంపింగ్ చేయడానికి వెసులు బాటు ఏర్పడింది. కాబట్టి ఏ కారణం చేతనైనా దేవాదుల ప్రాజెక్టు కింద ఉన్న ఆయకట్టులో గాని, చెరువుల కింద గాని పంటలు ఎండిపోవడం అనేది జరగకూడదు. ఈ ఏడాది (2025) యాసంగిలో పంటలు ఎండిపోవడం చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది. బ్యారేజి నిర్మాణం అయి పంప్ హౌజ్ వద్ద 77 మీటర్ల వద్ద నీరు నిలువ ఉన్న సందర్భంలో కూడా దేవాదుల పంపులను తిప్పి నీటిని ఎత్తిపోయలేకపోవడాన్ని ఎట్లా విశ్లేషించాలి ? ఇది ప్రకృతి వల్ల దాపురించిన కష్టమా? లేక ప్రభుత్వ వైఫల్యమా?

కేంద్ర ప్రభుత్వం 2020 లో జారీ చేసిన గజిట్ నోటిఫికేషన్‌లో సమ్మక్కసాగర్ బ్యారేజి ప్రాజెక్టును అనుమతిలేని ప్రాజెక్టుగా ప్రకటించింది. అనుమతి లేని ప్రాజెక్టులకు 6 నెలల్లో అనుమతులు తీసుకోవాలని నిర్దేశించింది. అందుకని కెసిఆర్ ప్రభుత్వం గోదావరి బేసిన్‌లో నిర్మాణం పూర్తి చేసుకున్న 9 ప్రాజెక్టుల డిపిఆర్‌లను తయారు చేయించి కేంద్ర జల సంఘానికి పంపించింది. అందులో సమ్మక్కసాగర్ ప్రాజెక్టు డిపిఆర్ కూడా ఉన్నది. ఇందులో రామప్ప లింకు కాలువ కాంపొనెంట్ కూడా చేర్చడం జరిగింది.

రెండేండ్ల కృషి ఫలితంగా కేంద్ర జల సంఘంలోని అంతర్రాష్ట్ర విభాగం తప్ప అన్ని విభాగాలు అనుమతిని జారీ చేసినాయి. 83 మీటర్ల ఎత్తు వద్ద తమ రాష్ట్రంలో పట్టా భూములు మునిగి పోతున్నాయని ఛత్తీస్‌ఘర్ రాష్ట్రం మెలిక పెట్టడంతో అంతర్రాష్ట్ర విభాగం వారు అనుమతిని నిరాకరించారు.

ఛత్తీస్‌ఘర్ రాష్ట్రంలో 83 మీటర్ల వద్ద ముంపుకు గురి అవుతున్న భూమిని సేకరించే వరకు 80 మీటర్ల వరకే బ్యారేజీలో నీటిని నింపుతామని ప్రభుత్వం తరపున ఒక అండర్ టేకింగ్‌ను కేంద్ర జల సంఘానికి సమర్పించడం జరిగింది. అయినా కూడా 80 మీటర్ల ఎత్తుకు కూడా ఛత్తీస్‌ఘర్ నుంచి అనుమతి పత్రం (NoC) సమర్పించాలని కేంద్ర జల సంఘం తెలంగాణ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఈ అంశంలో ఛత్తీస్‌ఘర్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరిగాయి. రెండు రాష్ట్రాల రెవెన్యూ, సాగునీటి శాఖల అధికారులతో జాయింట్ సర్వే జరిగింది. అనంతరం బీజాపూర్ జిల్లా కలెక్టర్ నివేదికను ప్రభుత్వానికి పంపినాడు. అయినా ఆనాడు అధికారంలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం స్పందించ లేదు. ఇప్పుడున్న బిజెపి ప్రభుత్వం కూడా అదే మొండి వైఖరి ప్రదర్శిస్తున్నది. 83 మీటర్ల ఎఫ్ ఆర్ ఏల్ వద్ద ఛత్తీస్‌ఘర్ రాష్ట్రంలో ముంపు కేవలం 50 ఎకరాలు మాత్రమే.

అయితే వారు HFL వద్ద ముంపుకు గురి అవుతున్న భూములకు కూడా నష్ట పరిహారం చెల్లించాలని కోరుతున్నారు. ఇది చాలా విచిత్రమైన కోరిక. దేశంలో ఏ జలాశయంలో నైనా FRL దాకా మాత్రమే భూసేకరణ చేసి నష్ట పరిహారం చెల్లిస్తారు తప్ప కొన్ని గంటలు వరద ఉండే HFL ఎత్తుకు చేయరు. ఛత్తీస్‌ఘర్ మాత్రం ఇటువంటి గొంతెమ్మ కోరిక వ్యక్తం చేయడం కేంద్ర జల సంఘం అధికారులను కూడా విస్మయానికి గురి చేసింది. ఛత్తీస్‌ఘర్‌తో సంప్రదింపులు కొనసాగుతుండగానే రాష్ట్రంలో అధికార మార్పిడి జరిగింది. అధికార మార్పిడి జరిగి 15 నెలలు కావస్తున్నా ఛత్తీస్ ఘర్ రాష్ట్రం నుంచి ఎన్‌ఓసి సాధించలేక పోయింది ప్రస్తుత ప్రభుత్వం. దానితో ప్రాజెక్టుకు కేంద్ర జల శక్తి మంత్రిత్వ శాఖ TAC అనుమతి పెండింగ్ లో పడిపోయింది.

ఈ లోపు కేంద్ర జల సంఘం మరో మెలికతో ప్రాజెక్టు డి పి ఆర్ ను వాపస్ చేసిందని తెలిసింది. అదేమిటంటే సమ్మక్కసాగర్ జలాశయం నుంచే దేవాదుల ప్రాజెక్టుకు నీటి సరఫరా చేస్తారు కనుక 'దేవాదుల + సమ్మక్క సాగర్' బ్యారేజి లను కలిపి ఒకే డిపిఆర్ సమర్పించాలట. దేవాదుల ప్రాజెక్టుకు ఎప్పుడో 2007 లోనే TAC అనుమతి వచ్చి ఉన్నది. చాలా ఏళ్ల క్రితమే అనుమతి వచ్చిన ప్రాజెక్టును ఇప్పుడు సమ్మక్కసాగర్ తో కలిపి డిపిఆర్ సమర్పించమని కేంద్ర జల సంఘం ఆడగడంలో ఏమన్నా ఔచిత్యం ఉన్నదా? 47 టిఎంసిల వినియోగంతో సమ్మక్కసాగర్ బ్యారేజి ప్రాజెక్టును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మొదటి నుంచి వ్యతిరేకిస్తూ వస్తున్నది. చంద్రబాబు రెండవ సారి అధికారంలోకి రాగానే కేంద్ర జల సంఘం అకస్మాత్తుగా ఈ రకమైన నిర్ణయాన్ని తీసుకోవడంలో చంద్రబాబు ప్రభుత్వం ఒత్తిడి ఉందని అనుకోవడానికి ఆస్కారం ఉన్నది. ఛత్తీస్‌ఘర్ రాష్ట్రం ఎన్‌ఓసి ఇస్తే అనుమతులు జారీ చేయడానికి సిద్దంగా ఉన్న కేంద్ర జల సంఘం రెండు రాష్ట్రాలలో అధికార మార్పిడి జరగగానే ఒక్కసారిగా తమ వైఖరిని మార్చుకొని మెలిక పెట్టి డిపిఆర్‌ను వాపస్ చేయడం సమంజసమా? ప్రస్తుత ప్రభుత్వం ఈ

యుటర్న్ పట్ల నిరసన వ్యక్తం చేయక తప్పదు. ఛత్తీస్‌ఘర్ రాష్ట్రం నుంచి ఎన్‌ఓసి సాధించి కేంద్ర జల సంఘం అనుమతి సాధించడానికి తీవ్రంగా కృషి చేయాలి.

### 7.6 శ్రీరాంసాగర్ వరద కాలువ ప్రాజెక్టు :

శ్రీరాంసాగర్ వరద కాలువ పథకం పి వి నరసింహారావు ప్రధాన మంత్రిగా ఉన్న కాలంలో 20 టిఎంసిల వరద నీటిని శ్రీరాంసాగర్ జలాశయం నుండి మళ్ళించి కరీంనగర్ జిల్లాలో 2.20 లక్షల ఎకరాలకు సాగునీరు అందించాలన్న లక్ష్యంతో ప్రారంభమయ్యింది. ఎగువన మహారాష్ట్ర గోదావరిపై, గోదావరి ఉప నదులపై వందలాది బ్యారేజీలను నిర్మించిన కారణంగా శ్రీరాంసాగర్ జలాశయానికి వరద ప్రవాహాలు గణనీయంగా తగ్గిపోవడంతో వరద కాలువ పథకం ప్రతిపాదిత లక్ష్యాలని అందుకునే పరిస్థితిలో లేదు. కెటాయించిన 20 టిఎంసిల వరద నీరు కూడా వరద కాలువలో ప్రవహించే పరిస్థితి లేదు. వరద కాలువ పై మానేరు నదిపై 25 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో  మిడ్ మానేరు బ్యాలెన్సింగ్ జలాశయాన్ని ప్రతిపాదించినారు. మిడ్ మానేరు జలాశయ నిర్మాణం అనేక కారణాల వలన ముఖ్యంగా భూ సేకరణ, ముంపు గ్రామాల పునరావాసం సమస్యల కారణంగా నత్త నడకన సాగింది.

### 7.6.1 శ్రీరాంసాగర్ వరద కాలువ తొలి ప్రతిపాదనలు :

ఈ సందర్భంగా ప్రాజెక్టు పూర్వపరాలను ప్రజలకు తెలియపర్చాల్సిన అవసరం ఉంది. తొలుత శ్రీ రాంసాగర్ ఇందిరమ్మ వరద కాలువ పథకంలో భాగంగా కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో సాగునీరు అందించడానికి ప్రభుత్వం ఈ కింది జలాశయాల నిర్మాణానికి అనుమతిని ఇచ్చింది.

- మిడ్ మానేర్ జలాశయం – 68,000 ఎకరాలు
- గౌరవెల్లి జలాశయం – 1,20,000 ఎకరాలు
- కోనరావుపేట వద్ద పెద్దవాగు & కొరుట్ల వాగులపై జలాశయం నిర్మాణం – 32,000 ఎకరాలు

పై జలాశయాల నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం నుంచి అనుమతులు పొందడం జరిగింది. ఆ తర్వాత ప్రభుత్వం వీటికి అదనంగా మరో మూడు జలాశయాలను నిర్మించడానికి ప్రతిపాదించి కొన్ని మార్పులని చేసింది. దాని ప్రకారం మిడ్ మానేరు కింద  31,000 ఎకరాలు, గౌరవెల్లి కింద 1,06,000 ఎకరాలు, మోతె జలాశయం కింద 20,000 ఎకరాలు, తోటపల్లి బ్యాలెన్సింగ్ జలాశయం కింద 49,000 ఎకరాలు, గండిపల్లి జలాశయం కింద 14,000 ఎకరాలు, మొత్తం 2,20,000 ఎకరాలకు నీరివ్వాలని నిర్ణయించినారు. అదే సమయంలో ప్రజల వ్యతిరేకత కారణంగా కోనరావుపేట జలాశయాన్ని రద్దు చెయ్యడం కూడా జరిగింది.

24-07-2007 న జి ఒ నంబరు 172 ద్వారా 254.80 కోట్లకు ప్రభుత్వం  తోటపల్లి జలాశయం నిర్మాణానికి పరిపాలనా అనుమతిని ఇచ్చింది. 171.88 కోట్లకు సాంకేతిక అనుమతి 9.4.2008 న జారీ చెయ్యడం జరిగింది. ఆ తర్వాత ఇ పి సి పద్ధతిన టెండర్లు పిలిచి వారిగేట్ ప్రాజెక్ట్స్

ప్రైవేట్ లిమిటెడ్ & జి వెంకట్ రెడ్డి & కొ (జె వి ) కి 131.68 కోట్లకు 24.9.2008 న పనులు అప్పగించడం జరిగింది. కాల పరిమితి నాలుగేండ్లు. కాంట్రాక్టర్ తోటపల్లి జలాశయ నిర్మాణ పనులు మొదలు పెట్టలేదు. ప్రాజెక్టు ఇంజనీర్లు అనేక నోటీసులు జారీ చేసి ఉన్నారు. అందుకని ఇంజనీర్లు కాంట్రాక్టును రద్దు చేసి 28 కోట్ల పెనాలిటీని వేయడం జరిగింది. తిరిగి అంచనా విలువని లెక్కగట్టినప్పుడు తోటపల్లి జలాశయ నిర్మాణానికి, మూడు గ్రామాల పునరావాసానికి (ఓగులాపూర్, గాగిల్లాపూర్, నారాయణ పూర్) ఖర్చు 840 కోట్లకు పెరిగినట్లుగా ప్రభుత్వం గుర్తించింది. ఈ గ్రామాలకు అదనంగా మరో మూడు (రామచంద్రాపురం, ఇందుర్తి, వారికోల్) గ్రామాల ప్రజలు తమకు కూడా పునరావాస ప్యాకేజిని ఇవ్వాలని డిమాండ్ చేసినారు. వీటి పునరావాస ఖర్చును లెక్కిస్తే మొత్తం ఖర్చు 1640 కోట్లకు పెరిగే అవకాశం ఉన్నది.

### 7.6.2 తోటపల్లి జలాశయం రద్దు :

ఈ నేపథ్యంలో ప్రాజెక్టు పున: సమీక్షలో తోటపల్లి జలాశయం లేకుండానే, ఆరు గ్రామాలను ముంచకుండానే, 2227 ఎకరాల భూమిని సేకరించకుండానే మిడ్ మానేరు జలాశయం ద్వారానే తోటపల్లి జలాశయం కింద ఉన్న నిర్దేశిత 49,000 ఎకరాలు, గౌరవెల్లి జలాశయం కింద ఉన్న1,06,000 ఎకరాలు, గండిపల్లి కింద ఉన్న14,000 మొత్తం 1,69,000 ఎకరాల అయకట్టుకు నీరందించే అవకాశం ఉన్నదని తేలింది. అదనంగా తోటపల్లి జలాశయం కింద ముంపుకు గురయ్యే 3000 ఎకరాలకు కూడా సాగునీటిని అందించే అవకాశం ఉన్నదని తేలింది. ఇంత పెద్ద మొత్తాన్ని ఖర్చు చేసినా తోటపల్లి జలాశయం మొత్తం నిల్వ సామర్థ్యం 1.7 టిఎంసిలకు మించదు. అందులో డెడ్ స్టోరేజీ పోనూ వినియోగించుకునే నీటి పరిమాణం 0.95 టిఎంసిలు మాత్రమే. 1640 కోట్ల ప్రజాధనాన్ని ఆదా చెయ్యడానికి, గ్రామాలను తరలించకుండా, ప్రజలని నిర్వాసితులను చెయ్యకుండా, వ్యవసాయ భూములు ముంపుకు గురి కాకుండా ఉండే అవకాశం ఉన్న కారణంగా తోటపల్లి బ్యాలెన్సంగ్ జలాశయాన్ని రద్దు చెయ్యాలని ప్రభుత్వం నిర్ణయించింది. కేవలం 100 కోట్ల ఖర్చుతో మోహితుమ్మెద వాగు, ఎల్లమ్మగడ్డ వాగులపై రెండు ఆక్విడక్టులు, కాలువ నిర్మాణం ద్వారానే మిడ్ మానేరు నుంచి గౌరవెల్లి జలాశయానికి నీరు తరలించడం జరుగుతుంది. అదే సమయంలో రాజీవ్ రహదారికి అవతలి వైపున 0.3 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో తోటపల్లి జలాశయాన్ని ప్రభుత్వం 30 కోట్లతో నిర్మించింది. 2500 ఎకరాలకు సాగునీరు అందుతుంది. భూగర్భ జలాలు పెరిగి బావులు, బోర్లల్లో నీరు లభించే అవకాశాలు పెరుగుతాయి. వీటి కింద అదనపు ఆయకట్టు సాగులోనికి వస్తుంది. తోటపల్లి జలాశయాన్ని రద్దు చేసినప్పుడు కొందరు విమర్శలు చేసినారు. అయితే తోటపల్లి జలాశయం అవసరం లేకుండానే ప్రాజెక్టు ప్రయోజనాలు పొందడానికి అవకాశం ఉందని అధ్యయనంలో తేలింది. ఊర్లని ముంచకుండా ప్రజలని నిర్వాసితులని చెయ్యకుండానే ప్రాజెక్టు నుండి ప్రయోజనాలని పొందే అవకాశం ఉన్నప్పుడు కూడా ప్రజలని నిర్వాసితులని చెయ్యాలా?

ప్రజాధనం దుర్వినియోగం కాకుండా ఆరు గ్రామాల ప్రజలకు మేలు చెయ్యడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుంటే కొందరు స్వార్థపర శక్తులు దీనిపై నానా యాగీ చేసి పభుత్వంపై విమర్శలు

చేస్తున్నారు. ప్రజలను రెచ్చగొట్టి ధర్నాలు చేస్తున్నారు.దేశ వ్యాప్తంగా ప్రాజెక్టుల్లో ముంపు బారిన పడి నిర్వాసితులవుతున్న ప్రజలు తమ బతుకు కోసం ఉద్యమాలు చేస్తున్నారు. ఇక్కడ ఆరు గ్రామాల ప్రజలను నిర్వాసితులను చెయ్యకుండానే నిర్దేశిత ప్రయోజలని, అదనపు ప్రయోజనాలని ప్రజలకు ఇవ్వగలుగుతున్నప్పుడు తోటపల్లి రద్దును వ్యతిరేకించడం విజ్ఞత కాదు. తోటపల్లి జలాశయాన్ని నిర్మించి 7 గ్రామాల ప్రజలని నిర్వాసితులని చేయమని డిమాండ్ చేస్తున్న వారే మల్లన్నసాగర్ నిర్వాసితుపట్ల సానుభూతిని వ్యక్తం చేయడం ఒక అభాస.

### 7.6.3 జలాశయాల నిల్వ సామర్థ్యం పెంపు :

రీ ఇంజనీరింగ్ లో భాగంగా వరద కాలువ బ్యాలెన్సింగ్ జలాశయాల నీటి నిల్వ సామర్థ్యాన్ని, కాలువల ప్రవాహ సామర్థ్యాన్ని, పంపుల సామ్ర్థ్యాన్ని పెంచుకోవడం జరిగింది. గౌరవెల్లి జలాశయం నీటినిల్వ సామర్థ్యాన్ని 1.4 టిఎంసిల నుండి 8.23 టిఎంసిలకు, గౌరవెల్లి జలాశయానికి నీటిని తరలించే గ్రావిటీ కాలువ ప్రవాహ సామర్థ్యాన్ని 1130 క్యూసెక్కుల నుండి 2000 క్యూసెక్కులకు, పంపుల సామర్థ్యాన్ని 2600 క్యూసెక్కుల నుండి 4600 క్యూసెక్కులకు పెంచుకోవడం జరిగింది. అదే విధంగా గౌరవెల్లి కింద ఉన్న గండిపల్లి బ్యాలెన్సింగ్ జలాశయ నీటి నిల్వ సామర్థ్యాన్ని0.15 టిఎంసిల నుండి 1 టిఎంసికి పెంచుకోవడం జరిగింది.

ఈ రీ ఇంజనీరింగ్ వలన కరీంనగర్ జిల్లా హుస్నాబాద్ నియోజక వర్గంలోని ఆయకట్టుకు, వరంగల్ జిల్లాలోని జనగాం నియోజకవర్గంలోని 2,52,882 ఎకరాల ఆయకట్టుకు సాగునీరు,



మిడ్‌మానేరు నుంచి గౌరవెల్లి జలాశయంలోకి ప్రవేశించిన గోదావరి జలాలు

తాగునీరు అందుతుంది. ఆ ప్రాంతాల్లో భూగర్భ జలాలు పెరిగి బోరు బావుల కింద వ్యవసాయం పుంజుకుంటుంది. ఈ రెండు నియోజకవర్గాలు కరువు ప్రాంతాలు. వరద కాలువ రీ ఇంజనీరింగ్ వలన ఈ కరువు ప్రాంతాలు సస్యశ్యామలమవుతాయని రైతులు భావిస్తున్నారు. కాళేశ్వరం, వరద కాలువ, దేవాదుల ప్రాజెక్టుల కింద ఆయకట్టుకు నీరందించడంలో మిడ్ మానేరు జలాశయం కీలకంగా మారనున్నది.

### 7.6.4 ప్రాజెక్టు పురోగతి :

- ప్రాజెక్టు సవరించిన అంచనా వ్యయం : రు 11,820 కోట్లు
- 1.6.2014 వరకు ప్రాజెక్టు మీద పెట్టిన ఖర్చు : రు 3,526.8 కోట్లు
- 2014 నుంచి 2023 వరకు ప్రాజెక్టు మీద పెట్టిన ఖర్చు : రు 6,575 కోట్లు
- ప్రాజెక్టు పై పెట్టిన మొత్తం ఖర్చు : రు 10,101.8 కోట్లు, ఇందులో తెలంగాణ స్టేట్ వాటర్ రిసోర్సెస్ ఇన్ఫ్రాస్ట్రక్చర్ డెవలప్మెంట్ కార్పొరేషన్ ద్వారా సమకూర్చిన నిధులు రు. 3669 కోట్లు.
- ప్రాజెక్టుకు అవసరమయ్యే భూమి : 45138.08 ఎకరాలు. ఇప్పటివరకు సేకరించిన భూమి : 40798.85 ఎకరాలు, ఇంకా సేకరించవలసిన భూమి : 4339.23 ఎకరాలు, భూసేకరణ మీద పెట్టిన ఖర్చు : రు 1478.28 కోట్లు.
- మొత్తం ప్రతిపాదిత ఆయకట్టు 2,52,882 ఎకరాలలో ఇప్పటి వరకు సాధించిన ఆయకట్టు 50,300 ఎకరాలు

## 8.0 ప్రాజెక్టుల ఆధునీకీకరణ:

గత ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వాల కాలంలో తెలంగాణ ప్రాజెక్టులు దారుణమైన నిర్లక్ష్యానికి లోనై నిర్వహణ లేక కాలువలు శిథిలావస్థకు చేరుకున్నాయి. ఆయకట్టు సగానికి సగం పడిపోయింది. చివరి



పూర్తి అయిన నాగార్జునసాగర్ కాలువల ఆధునీకీకరణ

భూములకు నీరందే పరిస్థితి  లేదు. కాలువల్లో పూర్తి మోతాదులో డిస్చార్జ్ పోయే పరిస్థితి లేదు. ప్రభుత్వం తెలంగాణలో పాత సాగునీటి ప్రాజెక్టులను పునరుద్దరించాలని, ప్రాజెక్టుల్లో పెరిగిపోతున్న ఈ గ్యాప్ ఆయకట్టుని తగ్గించాలని సంకల్పించింది.

నాగార్జునసాగర్, నిజాంసాగర్, ఘన్ పూర్ ఆనకట్ట కాలువల ఆధునీకీకరణ పనులని పూర్తి చేసి మొత్తం ఆయకట్టుకు నీరందించడం జరిగింది. శ్రీరాంసాగర్ ప్రాజెక్టు కాలువల ఆధునీకీకరణ కోసం ప్రభుత్వం 2000 కోట్లను నిధులను మంజూరు చేసింది. శ్రీరాంసాగర్ రెండో దశ కాలువల లైనింగ్ పనుల కోసం నిధులు మంజూరు చేసింది. పనులు వేగంగా పూర్తి అయినాయి. సదర్ మాట్ కాలువల  ఆధునీకీకరణ, సాత్నాల, చెలిమెలవాగు, స్వర్ణ, శనిగరం, కాలువల ఆధునీకీకరణ పనులు పూర్తి అయినాయి. రాష్ట్రంలో 28 ప్రాజెక్టుల ఆధునీకీకరణ కోసం ప్రధాన మంత్రి కృషి సించాయి యోజన పథకంలో ఒక భాగమైన  Incentivization స్కీంలో కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయానికి ప్రతిపాదించడం  జరిగింది.

29 డ్యాముల పునరుద్దరణ కోసం DRIP (Dam Rehabilitation and Improvement Project) పథకంలో 645 కోట్ల అంచనా వ్యయంతో కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయానికి ప్రతిపాదించడం జరిగింది.

## 9.0 సాగునీటి శాఖలో సంస్కరణలు:

సాగునీటి శాఖలో ప్రభుత్వం అనేక సంస్కరణలు ప్రవేశపెట్టింది. రాష్ట్ర అవసరాలను దృష్టిలో ఉంచుకొని శాఖను  పునర్ వ్యవస్థీకరించింది. కొన్ని కొత్త 19 ప్రాదేశిక చీఫ్ ఇంజనీర్ల యూనిట్లను ఏర్పాటు చేసింది.  ఈపిసి కాంట్రాక్ట్ పద్దతిని, మొబిలైజేషన్ అడ్వాన్సులను రద్దు చేసింది. క్వాలిటి కంట్రోల్, డిజైన్స్  విభాగాలని  పటిష్టం చేసింది. సాగునీటి శాఖలో అంచనాల అనుమతులు పొందే ప్రక్రియను సరళతరం చేసింది. వివిధ స్థాయిల్లో ఇంజనీర్ల ఆర్థిక అధికారాలను పెంచింది. ప్రాజెక్టుల అవసరాలకు అనుగుణంగా 4 విడతల్లో 600 పైగా సివిల్, మెకానికల్, ఎలెక్ట్రికల్, అగ్రికల్చర్  జూనియర్ ఇంజనీర్ల నియామకాలు జరిపింది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకోవడానికి నీటిపారుదల శాఖ ఉన్నత స్థాయి సంస్థలైన IIIT, IITH, BITS, ISRO, NABARD, ICRISAT తదితర సంస్థలతో MoU లు కుదుర్చుకుంది. సెక్రెటరియట్‌లో  ఫైళ్ళ సత్వర పరిష్కారానికి ఫైల్ మానిటరింగ్ సిస్టమ్ ని వినియోగించడం, మిషన్ కాకతీయ పథకాన్ని మొత్తంగా ఆన్ లైన్ లోనే పారదర్శకంగా  నిర్వహించడం, చెరువులన్నింటిని Geo Tagging చేయించడం జరిగింది.

## 10.0 ప్రాజెక్టులతో చెరువుల అనుసంధానం:

మిషన్ కాకతీయ విజన్ జయప్రదం కావాలంటే చెరువుల్లో కనీసం 10 నెలల పాటు నీరు నిలువ ఉండాలి. రెండు పంటలకు నీరు అందాలి. భూగర్భ జలాలు పైకి రావాలి. ఇందుకు చెరువులను భారీ మధ్యతరహా ప్రాజెక్టులతో అనుసంధానం చేసినప్పుడే సాధ్యం అని తొలి ముఖ్యమంత్రి భావించారు. రాష్ట్రంలో కెసిఆర్ పాలనా కాలంలో అనేక భారీ, మధ్యతరహా ప్రాజెక్టులో నిర్మాణం పూర్తి చేసుకొని 2019 జూన్ / జూలై నెలల్లో నీరు సరఫరాకు సిద్ధం అయ్యాయి. తెలంగాణాకు జీవ ధార అయిన కాళేశ్వరం ప్రాజెక్టు నుంచి నీరు 2019 లోనే అందుబాటులోకి వచ్చాయి. 2019 సంవత్సరాంతానికి మరిన్ని ప్రాజెక్టులు నీటి సరఫరా సిద్ధం అయ్యాయి. వీటిని చెరువులతో అనుసంధానం చేయడం ద్వారా చెరువులన్నీ రెండు పంటలకు నీరివ్వగలిగే స్థితి సాధ్యమైంది. మైనర్ ఇర్రిగేషన్ కోసం గోదావరి బేసిన్‌లో, కృష్ణా బేసిన్ లో మొత్తం నీటిని సంపూర్ణంగా వినియోగించుకోవాలన్న లక్ష్యంతో ముఖ్యమంత్రి ఈ భారీ కార్యక్రమానికి రూపకల్పన చేసారు.

ఇంజనీర్లు సేకరించిన సమాచారం, NRSA పటాల అధ్యయనం తర్వాత రాష్ట్రం మొత్తంలో 559 మండలాల్లో సుమారు 48,845 చిన్న నీటి వనరులున్నాయని తేలింది. వీటిలో 27,814 చెరువులు, కుంటలు 12,154 గొలుసుల కింద ఉన్నట్టు తేలింది. ఈ చెరువులను నింపడానికి ప్రాజెక్టుల కాలువలకు ఎక్కడెక్కడ తూములు నిర్మించాలన్న దానిపై స్పష్టత వచ్చింది. గొలుసులకు బయట ఉన్న 16,771 చెరువులు, కుంటలను నింపడానికి ప్రత్యామ్నాయ మార్గాలను ఇంజనీర్లు అధ్యయనం చేసినారు. ప్రతీ మండలానికి ఒక ఇర్రిగేషన్ చిత్రపటాన్ని రూపొందించి క్షేత్ర స్థాయి ఇంజనీర్లకు అందజేయడం జరిగింది. ఈ పటాల్లో అయా మండలాల్లో ఉన్న చెరువులు, కుంటలు, భారీ, మధ్య తరహా ప్రాజెక్టులు, ఎత్తిపోతల పథకాలు, వాటి ఆయకట్టు వివరాలు, కాలువల అలైన్మెంట్ తదితర వివరాలు ఉంటాయి.

వీటి ఆధారంగా తూముల నిర్మాణానికి, ఫీడర్ చానళ్ళ పునరుద్దరణకు అంచనాలు రూపొందించడం జరిగింది. ప్రతీ చెరువుకు ఫీడర్ చానల్ తప్పని సరిగా ఉంటుంది కనుక వీటికి ఎటువంటి భూసేకరణ అవసరం ఉండదు. అయితే తూముల ద్వారా వాటి సహజ ఫీడర్‌కు నీరు చేర్చడానికి కొన్ని సందర్భాల్లో కొద్దిపాటి భూసేకరణ అవసరం పడుతుంది. వాటి వివరాలు కూడా సేకరించమని ఇంజనీర్లను ఆదేశించడం జరిగింది.

మొదటి దశలో ప్రాజెక్టుల ఆయకట్టు పరిధిలో ఉన్న చెరువులను నింపడానికి 4 వేల తూముల నిర్మాణానికి ప్రభుత్వం అనుమతించింది. అక్టోబర్, 2020 వరకు తూముల నిర్మాణం పూర్తి చేయాలని ప్రాజెక్టుల ఇంజనీర్లను ఆదేశించింది. వీటిలో సుమారు 3391 తూముల నిర్మాణం పూర్తి అయ్యింది.



పోచ్చెర చెక్ డ్యాం, బోథ్ మండలం, ఆదిలాబాద్ జిల్లా

మిగతావి పురోగతిలో ఉన్నాయి. చెరువులను ప్రాజెక్టులతో అనుసంధానం చేయడం వలన ప్రాజెక్టుల ద్వారా వాటి పరిధిలో ఉన్న వందలాది చెరువులను సంవత్సరానికి రెండు సార్లు నింపడం జరుగుతున్నది. వివిధ ప్రాజెక్టుల ద్వారా నింపిన చెరువుల సంఖ్య: కాళేశ్వరం–1104, నిజాంసాగర్–313, శ్రీరాంసాగర్–1304, కడం–115, స్వర్ణ–13, శ్రీరాంసాగర్ రెండో దశ–843, సదర్ మాట్ – 8, వరదకాలువ – 18, శ్రీ రాజరాజేశ్వర – 96, ఎల్లంపల్లి–122, దేవాదుల–305, జూరాల–185, నెట్టెంపాడు–103, రాజోలిబండ–9, ఎలిమినేటి మాధవరెడ్డి ఎస్ఎల్బిసి–241, నాగార్జున సాగర్– 574, అలీ సాగర్–84, గుత్ప– 68, సింగూరు – 164, కోయిల్ సాగర్–107, కల్వకుర్తి –40, భీమా–109, మూసి–49, ఆసిఫ్ నహర్–63, రామడుగు –18, కౌలాస్ నాలా –14, పోచారం –24, సుద్దవాగు – 27, వట్టివాగు –8, మత్తడివాగు –2, నల్లవాగు –9, శనిగరం–6, వనదుర్గా (ఘన్‌పూర్ ఆనకట్ట)–31, కోటిపల్లి వాగు–20, బొగ్గులవాగు–2, చిన్న కాళేశ్వరం–6, మంథని ఎత్తి పోతలు – 2, పిల్లాయిపల్లి కాలువ–19, డిండి–7, చౌటుపల్లి ఎత్తిపోతలు– 28, గూడెం ఎత్తి పోతలు– 30, కొమురం భీం– 13, పీపీ రావు–1, చెలిమెలవాగు–1, గొల్లవాగు–14, నీల్వాయి–1, తాలిపేరు–17, కిన్నెరసాని–3, బేతుపల్లి వరద కాలువ–54, లంకసాగర్–10, రామప్ప–1, పాలెంవాగు–7, పాలేరు–126, పాలేరు పాత కాలువ–9, మొత్తం 6,547. ఇవి కాక రాష్ట్ర వ్యాప్తంగా మానేరు, హల్దీ, కూడవెల్లి, ఆకేరు, మున్నీరు, మంజీరా, స్వర్ణ తదితర నదులు, వాగులపై నిర్మించిన వందలాది చెక్ డ్యాంలను, కత్వాలను కూడా నింపడం జరిగింది.

## 11.0 వాగుల పునర్జీవన పథకం - చెక్ డ్యాంల నిర్మాణం :

చెరువుల అనుసంధానంతో పాటూ తెలంగాణాలోని అన్ని ప్రధాన వాగులు, వంకలు పునర్జీవనం పొందాలని ముఖ్యమంత్రి కెసిఆర్ భావించారు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని ప్రాజెక్టుల కింద 1.25 కోట్ల ఎకరాల్లో సాగునీరు సరఫరా చేసిన తర్వాత వాగుల్లోకి, నదుల్లోకి వచ్చే 20% పడవాటి (Regenerated) నీటిని ఎక్కడికక్కడ ఒడిసి పట్టడానికి రాష్ట్రంలో ప్రాజెక్టుల ఆయకట్టు పరిధిలో ఉండే అన్ని వాగులపై, నదులపై చెక్ డ్యాంలని నిర్మించాలని ముఖ్యమంత్రి తలపోశారు. ప్రాజెక్టులన్నీ పూర్తి అవుతున్న కారణంగా దాదాపు రాష్ట్రమంతా (కొన్ని ఎత్తైన ప్రాంతాలు మినహా) కమాండ్ ఏరియాగా మారబోతున్నది. ఈ ప్రాజెక్టుల ద్వారా భూములకు నీరు అందుతుంది. వాటి నుండి వచ్చే పడవాటి నీరు (Regenerated water) తిరిగి ఈ వాగుల్లోకి చేరుతాయి. వీటిని ఎక్కడికక్కడ నిల్వ చేసుకోగలిగితే ఆ ప్రాంతాల్లో ఆ వాగులు పునర్జీవనం చెంది భూగర్భ జలాలు రీచార్జ్ కావడంతో పాటు అనేక రకాలుగా ఈ నీరు గ్రామీణ ప్రాంతాల్లో వినియోగంలోనికి రానున్నాయి. ఈ పడవాటి నీటిని, వర్షపు నీటిని వొడిసి పట్టడానికి చెక్ డ్యాంల నిర్మాణాన్ని చేపట్టాలని ముఖ్యమంత్రి సాగునీటి శాఖ అధికారులను ఆదేశించారు. రోడ్డు భవనాల శాఖ, పంచాయతిరాజ్ శాఖ వారు వాగులపై నిర్మిస్తున్న బ్రిడ్జిలను చెక్ డ్యాంలతో సహా నిర్మించాలని ఇదివరకే ఆదేశాలు ఇచ్చినందున ఆ శాఖలు కూడా సాగునీటి శాఖ సహకారంతో చెక్ డ్యాంల నిర్మాణాలు చేపట్టినాయి.

ముఖ్యమంత్రి సూచించిన ఈ రెండు కార్యక్రమాల అమలు కోసం సాగునీటి శాఖ విస్తృత



గౌరిదేవిపల్లి చెక్‌డ్యాం మహబూబ్‌నగర్ జిల్లా

అధ్యయనం చేసింది. సర్వే ఆఫ్ ఇండియా వారి మ్యాపులతో పాటు నేషనల్ రిమోట్ సెన్సింగ్ ఏజెన్సీ (NRSA) వారి ఉపగ్రహ చిత్రాల సహకారంతో సమాచార సేకరణ చేసి విశ్లేషణ జరిపినారు. తెలంగాణ ఇంజనీర్ల బృందం మహారాష్ట్రకు వెళ్ళి అక్కడ చెక్ డ్యాంల నిర్మాణాన్ని, వారి అనుభవాలను అధ్యయనం చేయడం జరిగింది. వారి సలహాలు సూచనలు తెలంగాణ లో చెక్ డ్యాంల నిర్మాణానికి మార్గదర్శకాల రూపకల్పనలో దోహదం చేశాయి.

రాష్ట్రంలోని నదులను, వాగులను మొత్తం 8 స్థాయిల్లో వర్గీకరించడం జరిగింది. చెక్ డ్యాంల నిర్మాణానికి స్థలాలను 4 ఆపై స్థాయి కలిగిన నదులపై ఎంపిక చేయాలని, ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతాల్లో (Command Areas) ఉన్న వాగులను ప్రథమ ప్రాధాన్యత కింద ఎంపిక చేయాలని ఇంజనీర్లకు సూచించారు. ఇప్పటికే నిర్మించబడిన చెరువులు, జలాశయాలకు ఎటువంటి నష్టం వాటిల్లకుండా తగినంత నీటి లభ్యత ఉన్న వాగుల పైననే చెక్ డ్యాంలను ప్రతిపాదించాలని, చెక్ డ్యాంల మధ్య దూరాన్ని అక్కడి స్థానిక పరిస్థితులను బట్టి నిర్ణయించాలని, ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతాల్లో షేక్ హాండ్ చెక్ డ్యాంలు ప్రతిపాదించాలని, ఆయకట్టులో లేని వాగులపై అక్కడి స్థానిక పరిస్థితుల ఆధారంగా ప్రతిపాదించాలని సూచించారు. మంచి రాతి పునాది కలిగిన స్థలాలను ఎంపిక చేయాలని, 3 మీటర్ల లోతున భూగర్భ జలాలు లభ్యం అవుతున్న ప్రాంతాల్లో చెక్ డ్యాం లను ప్రతిపాదించరాదని, అత్యధికంగా భూగర్భ జలాల వినియోగం ఉన్న(Over Exploited) గ్రామాలకు అధిక ప్రాధాన్యం కల్పించాలని భూగర్భ జల శాఖ వారు సూచించారు. ఈ అంశాలన్నిటిని కలిపి మార్గ నిర్దేశనాలు జారీ చేయడం జరిగింది.

### 11.1 చెక్ డ్యాంల నిర్మాణం :

రాష్ట్రం మొత్తంలో ఉండే నదులను, వాగులను , వంకలను 8 స్థాయిల్లో (Orders) వర్గీకరించడం జరిగింది. 4 నుంచి 8 స్థాయి కలిగిన వాగులను పెద్ద వాగులుగా పరిగణించాలి. ఇవి రాష్ట్రంలో 683 ఉన్నట్టు, వాటి పొడవు 12,183 కిలోమీటర్లు ఉన్నట్టు అధ్యయనంలో తేలింది. వీటిలో నీటి ప్రవాహాలు ఎక్కువగా ఉంటాయి కనుక ప్రథమ ప్రాధాన్యతలో ఈ వాగులపై చెక్ డ్యాంలను ప్రతిపాదించాలని సూచించడం జరిగింది.

చెక్ డ్యాంల నిర్మాణం రెండు దశల్లో పూర్తి చేయాలని ముఖ్యమంత్రి ఆదేశించినారు. పూర్తి అయిన భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల కమాండ్ ఏరియాల్లో ఉండే వాగులను మొదటి దశలో ఎంపిక చేసుకోవాలని , రెండవ దశలో ఒకటి రెండు సంవత్సరాల్లో నిర్మాణం పూర్తి చేసుకోబోతున్న ప్రాజెక్టుల కమాండ్ ఏరియాల్లో ఉండే వాగులపై చెక్ డ్యాంలను ప్రతిపాదించాలని ముఖ్యమంత్రి సూచించినారు.

ఈ వాగులపై ఇప్పటికే 510 చెక్ డ్యాంలు, 245 ఆనకట్టలు, 29 కత్వాలు, 1 మాటు ఉన్నట్టు తెలుస్తున్నది. అని స్థాయిల వాగులపై ఇప్పటికే నిర్మాణం అయి ఉన్న చెక్ డ్యాంల సంఖ్య 2,376

ఉన్నట్టు అధ్యయనంలో తేలింది. అయితే చిన్న స్థాయి వాగుల పైననే పెద్ద సంఖ్యలో చెక్ డ్యాంల నిర్మాణం గతంలో జరిగినట్టు తెలుస్తున్నది.

నాగార్జున సాగర్, శ్రీరాంసాగర్, నిజాంసాగర్, కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, జూరాల, కడం, కొమురం భీం తదితర భారీ మధ్య తరహా ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతాల్లో ఉన్న పెద్ద స్థాయి వాగులపై ఇంకా సుమారు 1235 చెక్ డ్యాంల నిర్మాణానికి అవకాశం ఉన్నట్టు అధ్యయనంలో విశ్లేషించారు.

చెక్ డ్యాంల స్థల ఎంపిక దగ్గర నుంచి ప్రతీ దశలోనూ భూగర్భ జల శాఖతో సమన్వయము చేసుకోవాలని క్షేత్ర స్థాయి ఇంజనీర్లకు సూచించినారు. భూగర్భ జల శాఖ ఎంపిక చేసుకున్న చెక్ డ్యాంల వద్ద రీచార్జ్ గొట్టాలను అమర్చాలని కూడా సూచించారు.

ఈ ప్రాథమిక అధ్యయనాల తర్వాత ప్రభుత్వం ప్రాజెక్టులతో చెరువుల అనుసంధానానికి అవసరమయ్యే 4000 అదనపు తూముల నిర్మాణానికి, ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతాల్లో ఉన్న వాగులపై 1200 చెక్ డ్యాంల నిర్మాణానికి రూ. 4296 కోట్లకు పరిపాలనా అనుమతి మంజూరు చేస్తూ తేదీ 8.3.2019 న జి ఓ 8 ని జారీ చేసింది ప్రభుత్వం. దానితో పాటూ వీటి నిర్మాణానికి పాటించవలసిన మార్గనిర్దేశనాలని కూడా జారీ చేసింది. 2019 వర్షాకాలం నాటికి 80 % అదనపు తూముల నిర్మాణం పూర్తి అయ్యింది. ప్రాజెక్టుల ద్వారా చెరువులను నింపే కార్యక్రమం, చెక్ డ్యాంల నిర్మాణం జయప్రదంగా అమలు అవుతున్నది. జిల్లాల వారీగా ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతాల్లో ఎంపిక చేసిన వాగులపై నిర్మించే చెక్ డ్యాంల వివరాలు పట్టికలో ఉన్నాయి.

మొత్తం 1200 చెక్ డ్యాముల్లో మొదటి దశలో 638 చెక్ డ్యాంలు, మిగిలిన 562 చెక్ డ్యాంలు రెండో దశలో నిర్మాణానికి ఎంపిక చేయాలని ముఖ్యమంత్రి సాగునీటి శాఖ అధికారులను ఆదేశించినారు. మొదటి దశ చెక్ డ్యాంల నిర్మాణం జూన్ 2022 జూన్ నాటికి పూర్తి చేయాలని లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది. మిగతావి రెండో దశలో చేపడతారు.

వీటికి తోడు రోడ్లు భవనాల శాఖ వారు తెలంగాణా రాష్ట్రంలో నిర్మిస్తున్న వంతెనల వద్ద సుమారు 200 చెక్ డ్యాములను నిర్మిస్తున్నారు. తెలంగాణా వ్యాప్తంగా వాగులు, వంకలు, మంజీరా, మానేరు, కడెం, స్వర్ణ, హల్దీవాగు, మున్నేరు, డిండి, ఆలేరు, ఆఖేరు లాంటి నదులు కూడా సజీవం కానున్నాయి. తెలంగాణా పర్యావరణంలో గొప్ప మార్పులు చోటు చేసుకోనున్నాయి. భూగర్భ జలాల మట్టాలు గణనీయంగా పెరగనున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో పశువులకు, మేకలు, గొర్లకు, వన్య ప్రాణులకు తాగునీటి సమస్య తీరనున్నది. అడవులు తిరిగి పునరుజ్జీవనం పొందడానికి చెక్ డ్యాములు దోహదం చేయనున్నాయి. బహుముఖ ప్రయోజనాలున్న చెక్ డ్యాంలతో తెలంగాణా గ్రామీణ ప్రాంతాల రూపురేఖలు మారిపోతున్నాయి.

## జిల్లాలవారి చెక్ డ్యాంల వివరాలు

| క్రసం | జిల్లా | ఆయకట్టులోని చెక్ డ్యాంలు | ఆయకట్టులో లేని చెక్ డ్యాంలు | మొత్తం చెక్ డ్యాంలు | అంచనా విలువ (లక్షలు) |
|---|---|---|---|---|---|
| 1 | ఆదిలాబాద్ | 14 | 70 | 84 | 28,303 |
| 2 | భద్రాది కొత్తగూడెం | 0 | 114 | 114 | 28,109 |
| 3 | జగిత్యాల | 75 | 0 | 75 | 32,935 |
| 4 | జనగామ | 30 | 0 | 30 | 12,729 |
| 5 | జయశంకర్ భుపాలపల్లి | 15 | 13 | 28 | 13,148 |
| 6 | జోగులాంబ గద్వాల | 0 | 44 | 44 | 2,414 |
| 7 | కామారెడ్డి | 31 | 15 | 46 | 25,857 |
| 8 | కరీంనగర్ | 33 | 0 | 33 | 22,213 |
| 9 | ఖమ్మం | 39 | 14 | 53 | 19,831 |
| 10 | కమురంభీం ఆసిఫాబాద్ | 11 | 15 | 26 | 4771 |
| 11 | మహబూబాబాద్ | 47 | 8 | 55 | 35,196 |
| 12 | మహబూబ్ నగర్ | 32 | 0 | 32 | 16,962 |
| 13 | మంచిర్యాల | 5 | 18 | 23 | 5,421 |
| 14 | మెదక్ | 10 | 0 | 10 | 2,202 |
| 15 | మేడ్చల్ మల్కాజ్ గిరి | 1 | 0 | 1 | 80 |
| 16 | ములుగు | 0 | 13 | 13 | 8,836 |
| 17 | నాగర్ కర్నూల్ | 56 | 0 | 56 | 16,834 |
| 18 | నల్లగొండ | 69 | 0 | 69 | 16,268 |
| 19 | నారాయణపేట | 0 | 53 | 53 | 6,159 |
| 20 | నిర్మల్ | 40 | 32 | 72 | 42,626 |
| 21 | నిజామాబాద్ | 52 | 0 | 52 | 34,376 |
| 22 | పెద్దపల్లి | 24 | 0 | 24 | 34,825 |
| 23 | రాజన్న సిరిసిల్ల | 29 | 0 | 29 | 15,052 |
| 24 | రంగారెడ్డి | 7 | 0 | 7 | 510 |
| 25 | సంగారెడ్డి | 4 | 0 | 4 | 295 |
| 26 | సిద్ధిపేట | 38 | 0 | 38 | 16,835 |
| 27 | సూర్యాపేట | 35 | 0 | 35 | 9,955 |
| 28 | వికారాబాద్ | 24 | 4 | 28 | 11,145 |
| 29 | వనపర్తి | 40 | 0 | 40 | 2,249 |
| 30 | వరంగల్ రూరల్ | 31 | 0 | 31 | 21,003 |
| 31 | వరంగల్ అర్బన్ | 9 | 0 | 9 | 3,040 |
| 32 | యాదాద్రి భువనగిరి | 21 | 0 | 21 | 4,545 |
| | మొత్తం | 822 | 413 | 1235 | 4,94,724 |

## 12.0 తలసరి నీటి నిల్వ పెరుగుదల :

ప్రపంచ వ్యాప్తంగా వాతావరణంలో తీవ్రమైన మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఈ మార్పులకు అనేక కారణాలు ఉన్నప్పటికీ అడవుల నరికివేత ప్రధానమైన కారణంగా ముందుకు వచ్చింది. ఈ మార్పులు ఋతుపవనాల మీద ఆధారపడిన వ్యావసాయిక దేశాలైన భారత్, పాకిస్తాన్, బంగ్లాదేశ్, శ్రీలంక, నేపాల్, మియాన్మార్ తదితర దక్షిణాసియా దేశాల మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతున్నాయి. ఒకప్పుడు వర్షాకాలం నాలుగు నెలలు వర్షపాతం ఉండేది. ఇప్పుడు సగటు వర్షపాతంలో తగ్గుదల లేకపోయినా వర్షం కురిసే దినాలు సుమారు 25 నుంచి 30 రోజులకు పడిపోయింది. వర్షం నెల , నెలన్నర రోజులు అసలే కురువదు. కురిస్తే రెండు మూడు రోజుల్లో భారీ కుండ పోత వర్షం కురిసి పోతుంది. అనంతరం మళ్ళీ వర్షం అతా పతా ఉండదు. ఈ దోబూచులాట మనం గత కొన్నెండ్లుగా చూస్తూనే ఉన్నాము. ఈ పరిస్థితి 2023 సంవత్సరం కూడా మన అనుభవంలోకి వచ్చింది. జూన్, జూలై నెలల్లో వర్షం లేక కరువు పరిస్థితులను చూసాము. ఆగస్టు , సెప్టెంబర్ నెలల్లో తీవ్రమైన వర్షపాతం, నదుల్లో వరద భీభత్సం చూసాము. అక్టోబర్ నుంచి తిరిగి ఎండలు దంచి కొట్టే పరిస్థితులు వస్తాయి. ఈ 25, 30 రోజుల్లో కురిసే భారీ వర్షపు నీటిని వొడిసిపట్టే జలాశయాలు దేశంలో తగినంత లేవు. ఈ కారణంగా దేశంలో విచిత్రమైన పరిస్థితి నెలకొంటున్నది. కరువులు – వరదలు – కరువులు ప్రతీ ఏడూ పునరావృతం అవుతున్నాయి.

భారత దేశంలో తలసరి నీటి లభ్యత (Per Capita Water Availability), తలసరి నీటి నిల్వ సామర్థ్యం (Per Capita Storage Capacity) మిగతా దేశాలతో పోలిస్తే చాలా తక్కువ . వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| దేశం | తలసరి నీటి లభ్యత ఘనపు మీటర్లు | తలసరి నీటి నిల్వ ఘనపు మీటర్లు |
|---|---|---|
| రష్యా | 31,883 | 6,103 |
| ఆస్ట్రేలియా | 21,764 | 4,733 |
| బ్రెజిల్ | 41,865 | 3.145 |
| అమెరికా | 9,802 | 1,964 |
| టర్కీ | 2,890 | 1,739 |
| చైనా | 2,060 | 1,111 |
| భారత్ | 1,545 | 210 |

**(సోర్స్ : శ్రీ ఎ బి పాండ్యా, కేంద్ర జల సంఘం పూర్వ ఛైర్మన్, ICID సెక్రెటరీ జెనరల్)**

పై పట్టికలోని సమాచారం ఆధారంగా విశ్లేశిస్తే.. సంవత్సరానికి తలసరి నీటి లభ్యత 1700 ఘనపు మీటర్లకు తగ్గితే అది నీటి ఒత్తిడికి (Water Stress) సూచిక. 1000 ఘనపు మీటర్లకు తగ్గితే అక్కడ నీటి సంక్షోభం (Water Scarcity) ఏర్పడిన దానికి సూచన. ఈ సూచికకు నాలుగింతల ఎక్కువగా రష్యాలో తలసరి నీటి లభ్యత, తలసరి నీటి నిల్వ ఉన్నది. ఈ కారణంగా రష్యా నాలుగేండ్ల వరుస కరువులను తట్టుకోగలుగుతుంది. అదే విధంగా ఆస్ట్రేలియా మూడేండ్ల వరుస కరువులను తట్టుకోగలుగుతుంది. భారత్‌లో తలసరి నీటి లభ్యత, తలసరి నీటి నిల్వ సామర్థ్యం చాలా తక్కువగా ఉన్న కారణంగా 3, 4 నెలల కంటే మించి కరువును ఎదుర్కోలేదు.

దేశంలోని అన్ని ప్రధాన నదులపై తగినంత నీటి నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాలు లేవు. గంగా, బ్రహ్మపుత్ర లాంటి అత్యధిక నీటి లభ్యత ఉన్న నదులపై కూడా తగినంత నీటి నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాలు లేవు. ఈ నీరంతా సముద్రంలోనికి వెళ్లిపోతున్నది. గంగా నదిలో ఏటా సుమారు 18,000 టిఎంసి (75% విశ్వసనీయత) లు లభ్యమవుతాయి. తలసరి నీటి లభ్యత లెక్క గడితే అది 900 ఘనపు మీటర్లు. బ్రహ్మపుత్రా నదిలో ఏటా సుమారు 18,600 టిఎంసిల నీటి లభ్యత ఉంటే తలసరి నీటి లభ్యత 12,000 ఘనపు మీటర్లు. బ్రహ్మపుత్ర నది బేసిన్లో జనాభా గంగా బేసిన్‌తో పోల్చినప్పుడు చాలా తక్కువ. అయితే దేశంలోనే అత్యధిక నీటి లభ్యత ఉన్న ఈ రెండు నదులపై తగినంత నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాల నిర్మాణం జరగక పోవడం చేత అపారమైన ఈ నీరు నిరుపయోగంగా సముద్రం లోకి వెళ్ళిపోతున్నాయి. ఈ రెండు నదులతో పోలిస్తే గోదావరి, కృష్ణా నదుల్లో నీటి లభ్యత తక్కువ కానీ తలసరి నీటి నిల్వ సామర్థ్యం వీటి కంటే మెరుగ్గా ఉన్నది. 18,600 టిఎంసి నీటి లభ్యత ఉన్న బ్రహ్మపుత్ర నదిపై నికర నిల్వ సామర్థ్యం (Live Storage Capacity) కేవలం 84.72 టిఎంసి లంటే నమ్మశక్యం కాదు. కానీ అదే నిజం. అదే విధంగా 18 వేల టిఎంసిల నీటి లభ్యత ఉన్న గంగా నదిపై నికర నిల్వ సామర్థ్యం 1992.68 టిఎంసిలు. 4156 టిఎంసిల నీటి లభ్యత ఉన్న గోదావరి నదిపై నికర నిల్వ సామర్థ్యం 1541 టిఎంసిలు. 3143 టిఎంసిల నీటి లభ్యత ఉన్న కృష్ణా నదిపై నికర నిల్వ సామర్థ్యం 1920 టిఎంసిలు. గంగా నది కంటే కొద్దిగా తక్కువ. తగినంత నీటి నిల్వ సామర్థ్యం లేని కారణంగా నాలుగు నెలల వర్షా కాలంలో గంగా, బ్రహ్మపుత్ర ఇతర ఉత్తర భారత నదులకు కరువులు-వరదలు-కరువులు పరిస్థితిని ప్రతి ఏడాది ఎదుర్కోక తప్పటం లేదు.

### 12.1 తెలంగాణలో తలసరి నీటి లభ్యత నీటి నిల్వ పెరుగుదల :

దేశంలో ఉన్న అన్ని ప్రధాన నదులపై తగినంత నీటి నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాల నిర్మాణం జరగనట్టయితే మారుతున్న వాతావరణ పరిస్థితుల వల్ల రాబోయే దశకాల్లో దేశం తీవ్ర నీటి సంక్షోభం, తద్వారా ఆహార భద్రతకు సంబంధించిన సవాళ్లు ఎదుర్కోవలసి ఉంటుందని సాగునీటి రంగ నిపుణుడు, కేంద్ర జల సంఘం మాజీ చైర్మన్ శ్రీ ఎ బి పాండ్యా అభిప్రాయ పడినారు. తెలంగాణా రాష్ట్రం ఈ అంశంలో సరి అయిన దిశలోనే ప్రయాణిస్తున్నది. రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి కె సి ఆర్ గారు ప్రాజెక్టులను రీఇంజనీరింగ్ చేసే సమయంలో జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవాల్సిన అవసరాన్ని గుర్తించారు. వర్షాకాలం గడచిపోయిన తర్వాత మన నదుల్లో నీటి ప్రవాహాలు ఉండవు. ఆ సమయంలో మన వ్యవసాయ, తాగునీటి, పారిశ్రామిక అవసరాలను తీర్చేవి ఈ జలాశయాలే. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు తెలంగాణ ఎత్తిపోతల పథకాల్లో తగినంత నిల్వ సామర్థ్యం ఏర్పాటు చేయాలన్న అంశంపై

దృష్టి పెట్టలేదు. ప్రాణహిత చేవెళ్ళ లో 16 టిఎంసిలు, కల్వకుర్తిలో 4 టిఎంసిలు, నెట్టెంపాడులో 11 టిఎంసిలు, భీమాలో 8.50 టిఎంసిలు, దేవాదులలో 8 టిఎంసిలు, ఎ ఎం ఆర్ పి లో 13 టిఎంసి మాత్రమే ఉన్నాయి.

తెలంగాణా ఏర్పాటు తర్వాత ప్రాజెక్టుల రీఇంజనీరింగ్ లో భాగంగా కాళేశ్వరం ప్రాజెక్టులో 141 టిఎంసిలు, పాలమూరు రంగారెడ్డిలో 67 టిఎంసిలు, డిండీలో 25.56 టిఎంసి నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాలను ముఖ్యమంత్రి ప్రతిపాదించడం జరిగింది. ఎక్కడ అనుకూలత ఉంటె అక్కడ జలాశయాలను ఏర్పాటు చేయాలని కెసిఆర్ భావించారు. కల్వకుర్తి ప్రాజెక్టులో నిల్వ సామర్థ్యాన్ని పెంచడానికి స్థలాల అన్వేషణ చేయాలని అధికారులను ఆదేశించినారు. కడెం నదిపై 5.36 టిఎంసిల కుప్టి ప్రాజెక్టును ఆమోదించినారు. గోదావరిపై సదర్ మాట్, తుపాకులగూడెం ఆనకట్టల నిర్మాణం పూర్తి అయింది. కాళేశ్వరంలో భాగంగా మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ ఆనకట్టలు ఇప్పటికే పూర్తి అయినాయి. తమ్మిడిహట్టి వద్ద బ్యారేజి నిర్మాణం కోసం మహారాష్ట్రతో ఒప్పందం కుదిరింది. అయితే అక్కడ బ్యారేజి నిర్మాణంలో అనేక ఇబ్బందులు ఉన్న కారణంగా బ్యారేజి స్థలాన్ని వార్ధా నదిపైకి మార్చడం జరిగిగింది. ఇటీవలే బి ఆర్ అంబేద్కర్ వార్ధా ప్రాజెక్టు డిపిఆర్‌ను అనుమతుల కోసం కేంద్ర జల సంఘానికి, పరిపాలనా అనుమతి కోసం ప్రభుత్వానికి సమర్పించడం జరిగింది. చనాక కోరాటా బ్యారేజి ప్రాజెక్టులో పిప్పల్కోటి, గోమూత్రి జలాశయాలను ఆమోదించినారు. సీతారామ ప్రాజెక్టుకు నికరంగా నీటి సరఫరా కోసం దుమ్ముగూడెం ఆనకట్ట కింద గోదావరి నదిపై 36 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో బ్యారేజీ నిర్మాణం జరుగుతున్నది. దేవాదుల ప్రాజెక్టులో 10 టిఎంసిల లింగంపల్లి జలాశయాన్ని ఆమోదించినారు. సింగూర్ (30 టిఎంసి), నిజాంసాగర్ (17 టిఎంసి) , శ్రీరాంసాగర్ (90 టిఎంసి), గౌరవెల్లి (9 టిఎంసి), లోయర్ మానేరు (24 టిఎంసి) తదితర జలాశయాల్లో నీటి కొరత ఏర్పడినప్పుడు కాళేశ్వరం ప్రాజెక్టు ద్వారా నింపడానికి ఏర్పాట్లు జరిగాయి. కాళేశ్వరం ప్రాజెక్టు రాడార్ లో ఉన్న జలాశయాల్లో సుమారు 500 టిఎంసిల నీటిని నిల్వ చేసుకునే వెసులుబాటు ఉన్నది. ఇవన్నీ రాష్ట్రంలో తలసరి నీటి లభ్యతను, తలసరి నీటి నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవాడానికి దోహదం చేసేవి.

తెలంగాణలో కృష్ణా, గోదావరి బేసిన్లలో భారీ, మధ్య తరహా, చిన్న నీటి ప్రాజెక్టుల్లో కలిపి మొత్తం నీటి లభ్యత 1268 టిఎంసిలు. కృష్ణా బేసిన్లో న్యాయమైన వాటా కోసం తెలంగాణ పోరాటం చేస్తున్నది. కృష్ణా ట్రిబ్యునల్ తెలంగాణ ఆశించినట్టు 575 టిఎంసిల నీటి కేటాయింపులు జరిపితే తెలంగాణలో నీటి లభ్యత 1543 టిఎంసిలకు పెరుగుతుంది. తెలంగాణలో చిన్న నీటి వనరులను మినహాయిస్తే, ప్రస్తుతం అన్ని మేజర్, మీడియం ప్రాజెక్టులలో ఉన్న నీటి నిల్వ సామర్థ్యం 1100 టిఎంసిలు (ఉమ్మడి జలాశయాలైన నాగార్జునసాగర్, శ్రీశైలం కలుపుకుని). తెలంగాణ జనాభా 4 కోట్లుగా పరిగణిస్తే తలసరి నీటి లభ్యత 898 ఘనపు మీటర్లు, తలసరి నీటి నిల్వ 718 ఘనపు మీటర్లు. ఇది భారతదేశపు సగటు కంటె ఎక్కువ. నీటి నిల్వను ఎంత పెంచుకుంటే నీటి లభ్యత కూడా పెరుగుతుంది. ఈ అంశంపై అంతర్జాతీయంగా జరుగుతున్న చర్చకు అనుకూలంగానే తెలంగాణ ప్రభుత్వం అమలుచేస్తున్న ప్రక్రియ ఇది. ఇదంతా ముఖ్యమంత్రి కెసిఆర్ కు జల వనరుల అభివృద్దిపై ఉన్న అవగాహన, రాజకీయ సంకల్పం వల్లనే సాధ్యం అయ్యింది.

## 13.0. సాగునీటి శాఖ పునర్వ్యవస్థీకరణ - లక్ష్యాలు :

గత ఆరు సంవత్సరాలుగా సాగునీటి ప్రాజెక్టులు త్వరితగతిన పూర్తి కావడంలో, మిషన్ కాకతీయ చెరువుల పునరుద్ధరణలో సాగునీటి శాఖ ఇంజనీర్ల శ్రమను ముఖ్యమంత్రి కెసిఆర్ గుర్తించారు. సాగునీటి రంగం అభివృద్ధి మీదనే రాష్ట్ర సమగ్రాభివృద్ధి ఆధారపడి ఉన్నదన్న వాస్తవం కేసిఆర్‌కు తెలుసు. ఒక సమీక్షా సమావేశంలో ఇంజనీర్ల పాత్ర గురించి ఆయన వెలుబుచ్చిన అభిప్రాయాలు ఈ విధంగా ఉన్నాయి. "మీరు ఉమ్మడి రాష్ట్రంలో పని చేశారు.తెలంగాణ పట్ల ఉమ్మడి రాష్ట్ర పాలకుల వివక్షా పూరిత విధానాలను చూశారు. తెలంగాణ ఉద్యమంలో మీరు చురుకైనా పాత్ర పోషించారు. ఇప్పుడు తెలంగాణ పునర్నిర్మాణంలో చురుకుగా పాల్గొంటున్నారు. మీకు అన్నీ తెలుసు. మీరే రాష్ట్రానికి దీపధారులు (Torch Bearers). మీరు నీళ్లు ఇస్తేనే రాష్ట్రం అన్నీ రంగాల్లో వికాసం చెందుతుంది." ఇంజనీర్ల శ్రమను ఈ రకంగా గుర్తించిన ముఖ్యమంత్రి మరొకరు లేరు. ఆయన అక్కడితోనే ఆగలేదు. ముఖ్యమంత్రి సాగునీటి శాఖను పునర్ వ్యవస్థీకరించి కొత్త రూపాన్ని ఇచ్చారు.

రాష్ట్రంలో అన్ని సాగునీటి వ్యవస్థలను.. ప్రాజెక్టులు, కాలువలు, చెరువులు, చెక్ డ్యాంలు, ఆనకట్టలు, కత్వాలు, చిన్నా పెద్దా లిఫ్ట్ స్కీమ్‌లను ఒకే గొడుగు కిందకు తీసుకురావడానికి, వీటి వలన ఆశించిన ఫలితాలను పొందడానికి, సాగునీటి శాఖలో సమగ్రమైన పునర్వ్యవస్థీకరణ ప్రక్రియ చేపట్టాలని తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ తలపెట్టారు. ఒక సంవత్సరం పాటు ముఖ్యమంత్రి స్థాయిలో జరిగిన విస్తృతమైన చర్చల అనంతరం సాగునీటి శాఖను ఒక శక్తివంతమైన శాఖగా మార్చి ప్రజల అవసరాలను తీర్చడానికి సాగునీటి శాఖ పునర్వ్యవస్థీకరణ నిమిత్తం జి ఒ నంబరు 45, తేదీ 28.12.2020 ని జారీ చేయడం జరిగింది. అనంతరం మరికొన్ని సంబంధిత జిఒలు కూడా జారీ అయినాయి. జిఒ 45 లో ప్రభుత్వం ఈ కింది ఆదేశాలు జారీ చేసింది.

1. పునర్వ్యవస్థీకరణలో భాగంగా రాష్ట్రాన్ని19 ప్రాదేశిక ప్రాంతాలుగా విభజించి ఒక్కో ప్రాదేశిక ప్రాంతానికి ఒక ఇంజనీర్ ఇన్ చీఫ్/చీఫ్ ఇంజనీర్ ను నియమించడం జరిగినది.

2. రాష్ట్రంలో ఆదిలాబాద్, మంచిర్యాల, నిజామాబాద్, కామారెడ్డి, జగిత్యాల, కరీంనగర్, రామగుండం, వరంగల్, ములుగు, కొత్తగూడెం, ఖమ్మం, హైదరాబాద్, సంగారెడ్డి, గజ్వేల్, నాగర్ కర్నూల్, మహబూబ్‌నగర్, వనపర్తి, నల్లగొండ, సూర్యాపేటలో ప్రాదేశిక చీఫ్ ఇంజనీర్ల కార్యాలయాలు నెలకొల్పాలని ఆదేశించడమైనది.

3. వీరికి పై స్థాయిలో ముగ్గురు ఇంజనీర్ ఇన్ చీఫ్ లు ఉంటారు. గతంలో ఉన్న ఇంజనీర్ ఇన్ చీఫ్(ఇరిగేషన్) ఇప్పుడు ఇంజనీర్ ఇన్ చీఫ్(జనరల్) గా మార్చడమైనది. ఇంజనీర్ ఇన్ చీఫ్ (పరిపాలన) యధాతథంగా కొనసాగుతారు. ఇక మూడవది ఇంజనీర్ ఇన్ చీఫ్(ఒ&ఎం). ఇది కెసిఆర్ స్వయంగా ముందు చూపుతో సృష్టించిన పదవి.

4. ఇవి కాక మరో ఆరుగురు చీఫ్ ఇంజనీర్లు డిజైన్స్, క్వాలిటీ కంట్రోల్, వాలంతారీ, ఎంక్వైరీ,

సచివాలయంలో సెక్రెటరీ(టెక్నికల్), విజిలెన్స్ పనుల కోసం హైదరాబాద్ లో ఉంటారు.

5. ఈ పునర్వ్యవస్థీకరణతో సాగునీటి శాఖలో అన్ని స్థాయిల్లో మొత్తం 945 కొత్త పోస్టులకు ప్రభుత్వం అనుమతిని ఇచ్చింది.

6. సాగునీటి వ్యవస్థల సమర్థ నిర్వాహణ, వరద నష్టాలు తదితర అత్యవసర పనులను చేపట్టే నిమిత్తమై సాగునీటి శాఖలో డిఇఇ స్థాయి నుంచి ఇంజనీర్ ఇన్ చీఫ్ స్థాయి వరకు ఆర్థిక అధికారాలను దఖలు పరచడం జరిగినది. వాటి వివరాలు :

| క్ర. సం | క్యాడర్ | ఆర్థిక అధికారాల పరిమితి |
|---|---|---|
| 1 | ఇంజనీర్ ఇన్ చీఫ్ (జనరల్) | ఒక్కొక్క పనికి 1 కోటి మించకుండా<br>సంవత్సరానికి 25 కోట్ల వరకు |
| 2 | ఇంజనీర్ ఇన్ చీఫ్/చీఫ్ ఇంజనీర్ | ఒక్కొక్క పనికి 50 లక్షలు మించకుండా<br>సంవత్సరానికి 5 కోట్ల వరకు |
| 3 | పర్యవేక్షక ఇంజనీర్ (ఎస్ఈ) | ఒక్కొక్క పనికి 25 లక్షలు మించకుండా<br>సంవత్సరానికి 2 కోట్ల వరకు |
| 4 | కార్యనిర్వాహక ఇంజనీర్ (ఇఇ) | ఒక్కొక్క పనికి 5 లక్షలు మించకుండా<br>సంవత్సరానికి 25 లక్షల వరకు |
| 5 | ఉప కార్యనిర్వాహక ఇంజనీర్ (డిఇఇ) | ఒక్కొక్క పనికి 2 లక్షలు మించకుండా<br>సంవత్సరానికి 5 లక్షల వరకు |

7. పైన దఖలు పరచిన ఆర్థిక అధికారాల వినియోగం కోసం అవసరమయ్యే నిధులు మొత్తం సంవత్సరానికి రు. 280 కోట్లు. ఈ నిధులను ఖర్చుచేయడానికి వీలుగా ఈ మొత్తాన్ని సాగునీటి శాఖ ముఖ్య కార్యదర్శి అధీనంలో ఉంచడానికి అనుమతించడమైనది.

### 13.1 పునర్వ్యవస్థీకరణ ఎందుకు?

- సాగునీటి శాఖ పునర్వ్యవస్థీకరణ 2021 జనవరి 2 నుంచి అమల్లోకి వచ్చింది. పెద్ద ఎత్తున ఏర్పాటు కాబోతున్న సాగునీటి వ్యవస్థ నిర్వహణే భవిష్యత్తులో సాగునీటి శాఖకు ప్రధాన బాధ్యతగా ఉండబోతున్నది.

- 125 లక్షల ఎకరాల లక్షిత ఆయకట్టులో సుమారు 75 లక్షల ఎకరాలు ఎత్తిపోతల పథకాల కిందనే ఉండబోతున్నది. ఈ విషయాన్ని ముందుగా గుర్తించి సాగునీటి వ్యవస్థలన్నింటిని ఒకే

గొడుగు కిందకు తీసుకురావడం, అత్యవసర పనులు, మరమ్మతులు చేపట్టడానికి వివిధ స్థాయిల ఇంజనీర్లకు ఆర్థిక అధికారాలను కట్టబెట్టడం ఈ పునర్వ్యవస్థీకరణలో ముఖ్యమంత్రి కెసిఆర్ తీసుకున్న కీలకమైన విప్లవాత్మక నిర్ణయాలు. ఇది సాగునీటి వ్యవస్థకు జవసత్వాలు సమకూర్చి సమర్థ నిర్వాహణకు దోహదం చేస్తుందని, ఇంజనీర్లలో జవాబుదారీతనం పెరుగుతుందని భావిస్తున్నారు.

## 14.0 సాగునీటి వ్యవస్థల నిర్వహణ:

### 14.1 ప్రాజెక్టుల నీటి నిర్వహణ / యాజమాన్యం:

ప్రాజెక్టు కాలువల కింద ఒక టిఎంసి నీటికి ఎన్ని ఎకరాలు సాగు అవుతాయి? తరి పంటలకైతే 5 నుంచి 6 వేల ఎకరాలు, ఆరుతడి పంటలకైతే 10 వేల ఎకరాలు అనేది అందరికీ తెలిసిన జవాబు. కానీ ప్రపంచంలో నీటి నిర్వాహణలో అనేక నూతన సాంకేతిక పద్దతులు అమల్లోకి వచ్చిన తర్వాత ఒక టిఎంసికి 13 వేల ఎకరాల పైబడి తరి పంటలను, 15 వేల నుంచి 20 వేల ఎకరాల ఆరు తడి పంటలను పండించడం సాధ్యం అవుతున్నది.

మెరుగైన నీటి యాజమాన్య పద్దతులు అమలు చేయడం, వరి సాగులో పంట కాలం తక్కువగా ఉండే వరంగల్, జగిత్యాల, శ్రీవరి లాంటి వంగడాలని ప్రోత్సహించడం, ఆయకట్టులో మైక్రో ఇరిగేషన్ పద్దతులను అవలంభించే విధంగా రైతులను చైతన్య పరచడం, ఆరుతడి పంటలను, కూరగాయల సాగును ప్రోత్సహించడం, పూలు, పండ్ల తోటలను పెంచేందుకు ప్రోత్సహించడం తదితర చర్యల ద్వారా ఒక టిఎంసికి 13 వేల ఎకరాలను సాగు చెయ్యడం అసాధ్యం ఏమీ కాదు. మహారాష్ట్ర మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో piped irrigation పద్దతిని అవలంభించి ఒక టిఎంసికి 15 నుంచి 20 వేల ఎకరాల సాగు సాధిస్తున్నారు.

తెలంగాణా ఏర్పడిన తర్వాత మూడు ప్రధాన ప్రాజెక్టులైన శ్రీరాంసాగర్, నిజాంసాగర్, నాగార్జునసాగర్ కాలువల కింద వారాబంది(on & off), కింద నుంచి పైకి (Tail to Head) పద్దతులని సమర్థవంతంగా అమలు చేసినందున వరి పంటకే ఒక టిఎంసి కి 13 వేల ఎకరాలు సాగుబడి సాధ్యం అయింది. పంట దిగుబడి పెరిగింది. టెయిల్ టు హెడ్ పద్ధతిన నీటి సరఫరా చేసినందువలన గత 20 ఏండ్లుగా ఎన్నడూ నీరు పారని చిట్ట చివరి భూములకు కూడా నీరు పారించగలిగినారు. ఎకరానికి 35 బస్తాలు వరి పండించే పరిస్థితి నుంచి ఎకరాకు 50 బస్తాలు పైచిలుకు వరి దిగుబడిని రైతులు సాధించారు. ఇంటర్నేషనల్ కమిషన్ ఆన్ ఇరిగేషన్ & డ్రైనేజ్ వారు ఈ కృషిని గుర్తించి సెప్టెంబర్, 2019 లో ఇండోనేషియా బాలీ ద్వీపంలో జరిగిన అంతర్జాతీయ సదస్సులో పత్రాలు సమర్పించమని ప్రాజెక్టు చీఫ్ ఇంజనీర్లను ఆహ్వానించింది. తెలంగాణా రాష్ట్రంలోని ప్రధాన ప్రాజెక్టుల ఆయకట్టు పరిధిలో ఈ వినూత్న ప్రయోగం సఫలం కావడం శుభ సూచకం. గతంలో రైతులు కూడా వరి పంటకు పొలంలో నిలువ నీరు ఉండాలన్న తప్పుడు అవగాహనతో ఉండేవారు. కాని ఆన్ & ఆఫ్ పద్దతిలో కూడా వరి

పంట సాగుచేయవచ్చునని, అధిక దిగుబడులు సాధించవచ్చునని రైతులకు అనుభవపూర్వకంగా తెలిసి వచ్చింది. నీటి కొరత ఉన్న ఈ కాలంలో దుబారాను తగ్గించి పొదుపుగా వాడుకోవడం, నీటి నిర్వహణలో జోక్యం చేసుకోకుండా, కాలువలను తెగ్గొట్టకుండా క్రమశిక్షణ పాటించగలిగితే సాగునీటి ప్రాజెక్టుల్లో ఇంజనీర్లు చివరి భూములకు కూడా నీరు అందించడానికి కృషి చేస్తారు. అది వారు శ్రీరాంసాగర్, నాగార్జునసాగర్, నిజాంసాగర్ ప్రాజెక్టుల్లో నిరూపించి చూపారు. రాబోయే కాలంలో తెలంగాణలో ఎత్తిపోతల పథకాల నుంచి ఖరీదైన నీటి సరఫరా జరుగుతుంది కనుక ఆయకట్టు రైతులు ఈ క్రమశిక్షణ పాటించాలి. ఇంజనీర్లు మెరుగైన నీటి నిర్వహణ పద్దతులను అవలంభించాలి.

అదే సమయంలో భారీగా నిర్మిస్తున్న ఎత్తిపోతల పథకాల నిర్వహణ కోసం ప్రభుత్వం సమగ్రమైన ప్రణాళికను తయారుచేసింది. 75 లక్షల ఎకరాలు ఎత్తిపోతల పథకాల కింద ఉన్నందున వీటి నిర్వాహణ కోసం తగిన యంత్రాంగాన్ని ఏర్పాటు చేసింది.

### 14.2 సాగునీటి శాఖలో ఆస్తుల ఇన్వెంటరీ :

- సాగునీటి శాఖలో ఉన్న భూములు, ఇతర ఆస్తుల వివరాలను క్రోడీకరించడం జరిగింది. గత 60 ఏండ్లుగా ప్రాజెక్టుల కోసం, కాలువల కోసం, ఇతరతర్రా వినియోగం కోసం సాగునీటి శాఖ సేకరించిన సుమారు 13.05 లక్షల ఎకరాలను రెవెన్యూ శాఖ ద్వారా సాగునీటికి శాఖకు బదలాయించే బృహత్తర కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తి చేసింది.
- వీటితోపాటు సాగునీటి శాఖ సమస్త వివరాలను క్రోడీకరించి ప్రాజెక్ట్ మానిటరింగ్ సిస్టం వెబ్ సైట్లో పొందుపరచింది. రాష్ట్రంలో159 జలాశయాలు,8661 కిమీ ప్రధాన కాలువలు, 13,373 కిమీ డిస్ట్రిబ్యూటరీలు, 17,721 కిమీ మైనర్లు, 1044 కి మీ పైపులు,128 మేజర్ ఎత్తిపోతలు,20 మధ్యతరహా ఎత్తిపోతలు, 13 చిన్న తరహా ఎత్తిపోతలు,38,510 చెరువులు, కుంటలు, 8021 చెక్ డ్యాంలు, ఆనకట్టలు,4 242.3 కిమీ సొరంగాలు, కాలువల మీద 1,32,851 స్ట్రక్చర్లు,108 విద్యుత్ సబ్ స్టేషన్లు,84 రెయిన్ గేజులు, 200 రివర్ గేజులు ఉన్నాయని ఇన్వెంటరీలో నమోదు చేశారు.

రానున్న మూడు నాలుగేండ్లలో వీటి సంఖ్య ఇంకా పెరిగే అవకాశం ఉన్నది. వీటి సమర్థ నిర్వాహణకు ఈ పునర్వ్యవస్థీకరణ అవసరం అయ్యింది. ఇది సాగునీటి వ్యవస్థల నిర్వాహణకు ప్రాతిపదికగా ఉపయోగపడనున్నది. ఈ నేపథ్యంలో సాగునీటి వ్యవస్థల నిర్వాహణకు సంబంధించి కొన్ని కీలక అంశాలను చర్చిద్దాము .

### 14.3 కాలువల నిర్వాహణ :

ప్రాజెక్టులను నిర్మించిన తర్వాత భూములకు నీటిని సరఫరా చేసే కాలువల నిర్వాహణ అత్యంత కీలకమైనది. కాలువల నిర్వాహణపై గత ప్రభుత్వాలు అత్యంత నిర్లక్ష్యంతో వ్యవహరించినాయి. కొత్త వ్యవస్థల నిర్మాణంపై పెట్టిన శ్రద్ధ కాలువల నిర్వాహణపై చూపెట్టలేదు. అరకొర నిధులు కేటాయించడంతో కాలువలలో పూడిక పేరుకుపోయింది. వృక్షాలు మొలచినాయి. కాలువలపై నిర్మించిన స్ట్రక్చర్లు కొన్ని పూర్తిగా మరికొన్ని పాక్షికంగా కూలిపోయి, తూముల గేట్లు పాడై లీకేజీలతో నీటి వృధాకు కారణమైనాయి. దీని వలన నీటి వినియోగ సామర్థ్యం (Water Use Efficiency) 40 శాతానికి పడిపోయింది. తెలంగాణ ప్రభుత్వం ఈ అంశాన్ని గుర్తించి అన్ని భారీ మధ్యతరహ ప్రాజెక్టుల కాలువల వ్యవస్థలను ఆధునీకరించడానికి నిధులు మంజూరు చేసింది. శ్రీరాంసాగర్, నాగార్జునసాగర్, నిజాంసాగర్, వనదుర్గా, రాజోలిబండ, సదర్మాట్, మూసి, సాత్నాల, చెలిమెలవాగు, స్వర్ణ, నల్లవాగు, శనిగరం ప్రాజెక్టుల కాలువల ఆధునీకీకరణ, పాలేరు పాత కాలువ, బేతుపల్లి వరద కాలువ ఆధునీకీకరణ పనులను ప్రభుత్వం పూర్తి చేసింది. దీనితో ప్రాజెక్టుల కింద ఆయకట్టు విస్తీర్ణం బాగా పెరిగింది. ప్రభుత్వం అమలు చేసిన మెరుగైన విధానాల కారణంగా ఒక టిఎంసికి సాగు అయ్యే భూవిస్తీర్ణం కూడా పెరిగింది.

గతంలో ఒక టిఎంసికి 5–6 వేల ఎకరాల్లో తరి పంట 8–10 వేల ఎకరాల్లో ఆరుతడి పంటలు పండేవి. ప్రాజెక్టుల ఆధునీకీకరణ తర్వాత శ్రీరాంసాగర్, నిజాంసాగర్, నాగార్జునసాగర్ కాలువల కింద వారాబంది, టెయిల్ టు హెడ్ పద్దతులని సమర్థవంతంగా అమలు చేసినందున వరి సాగులోనే ఒక టిఎంసికి 13 వేల ఎకరాలు సాగుబడి సాధ్యం అయింది, పంట దిగుబడి ఎకరాకు 35 బస్తాల నుంచి 45–50 బస్తాలకు పెరిగింది. టెయిల్ టు హెడ్ పద్దతిన నీటి సరఫరా చేసినందువలన ఎన్నడూ నీరు పారని చిట్ట చివరి భూములకు నీరు పారించగలిగినారు. మెరుగైన నీటి నిర్వాహణ పద్దతులు, మైక్రో ఇరిగేషన్ అమలు చేస్తే ఒక టిఎంసికి 13 నుంచి 15 వేల ఎకరాలు సాగు చేయడం సాధ్యమేనని దేశంలో జరిగిన అనేక ప్రయోగాలు రుజువు చేసినాయి. 75 లక్షల ఎకరాల భూమికి సాగునీరు ఎత్తిపోతల పథకాల ద్వారా సరఫరా అయ్యే నీరు విలువైన నీరు. సాగునీటి శాఖ నీటి వినియోగ సామర్థ్యాన్ని కనీసం 60%–70% పెంచుకోవడంపై దృష్టి పెట్టాల్సిన అవసరం ఉన్నది. కేవలం 100 మిమీ కంటే తక్కువ వర్షపాతం ఉన్న ఇజ్రాయిల్‌లో నీటి వినియోగ సామర్థ్యం 90% పైగా ఉండడం గమనార్హం.

### 14.4 చెరువుల నిర్వాహణ :

తెలంగాణ గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు అనాది ఆధారాలుగా ఉన్న చెరువులను ప్రభుత్వం మిషన్ కాకతీయ పేరున నాలుగు దశలలో పునరుద్దరించింది. చెరువు కట్టలను బలోపేతం చేయడం, తూములు,

అలుగులను మరమ్మతు చేయడం, చెరువులకు నీటిని తరలించే ఫీడర్ కాలువలను, పంట కాలువలను బాగు చేయడం, రైతుల బాగస్వామ్యంతో చెరువుల్లో పూడికను తొలగించి పొలాల్లో చల్లుకోవడం.. మొదలైన కార్యక్రమాలు చోటు చేసుకున్నాయి. మిషన్ కాకతీయ అనంతరం తెలంగాణ ప్రభుత్వం మరో రెండు పథకాలను చేపట్టింది. ఒకటి చెరువులను ప్రాజెక్టులతో అనుసంధానం చేయడం. గతంలో చెరువులను ప్రాజెక్టుల కాలువలతో నింపడాన్ని ప్రభుత్వాలు అనుమతించలేదు. ఇప్పుడు చెరువులను నింపడం తొలి ప్రాధాన్యతగా ప్రభుత్వం నిర్దేశించింది. అందుకు 4 వేల కొత్త తూములను నిర్మించడానికి అనుమతినిచ్చింది. చెరువులను నింపిన తర్వాతనే ఆయకట్టుకు నీరివ్వడం ఇప్పుడు ప్రభుత్వ విధానం.

ఇక రెండోది నదులు, వాగుల పునరుజ్జీవన పథకం. రాష్ట్రంలో ఉన్న ప్రాజెక్టుల ఆయకట్టు పరిధిలో ఉన్న ప్రధాన నదులు, వాగులపై 1250 చెక్ డ్యాంలు నిర్మించి ఆయకట్టు నుంచి నదుల్లోకి చేరే పడవాటి నీటిని ఒడిసి పట్టి వాగులను పునరుజ్జీవింపజేయడం ఈ పథకం లక్ష్యం. దీనితో వాగులు ఎల్లకాలం నీటితో కళకళలాడుతూ ఉంటాయి. భూగర్భ జలాలు పెరుగుతాయి. వన్య ప్రాణులకు, పశు పక్ష్యాదులకు నీటి తావులు ఏర్పడుతాయి. పర్యావరణం వృద్ధి అవుతుంది. చెరువులు, కుంటలు, చెక్ డ్యాంలను ఎప్పటికప్పుడు బాగు చేసే పనులను సాగునీటి శాఖ చేపడుతుంది.

రైతులు చెరువుల నుంచి పూడిక మట్టిని తమ పొలాల్లో చల్లుకోవడానికి ప్రభుత్వం అనుమతినిచ్చింది. ఇది ప్రతీ ఏటా వానాకాలం పంట కాలానికి ముందు విధిగా జరిగే విధంగా వ్యవసాయ శాఖ ప్రత్యేక కార్యక్రమాన్ని చేపట్టాలి. ఉపాధి హామీ పథకం కింద చెరువులలో, పంట కాలువల్లో పెరిగిన చెట్లను తొలగించే కార్యక్రమాన్ని కూడా ప్రభుత్వం అనుమతించింది. ఇది నిరంతరం జరగాలి. ఇందుకు రెవెన్యు, సాగునీటి శాఖ, పంచాయతీరాజ్ శాఖలు సమన్వయంతో పని చేయాల్సి ఉన్నది.

### 14.5 డ్యాంల నిర్వాహణ :

రాష్ట్రంలో 125 చిన్నాపెద్దా డ్యాంలు ఉన్నట్టు సాగునీటి శాఖ లెక్కలు గట్టింది. డ్యాంల గేట్లు మొరాయించడం ఒక సమస్యగా ఉంటున్నది. వీటి నిర్వాహణకు సాగునీటి శాఖ ఇఎన్సీ(ఒ&ఎం) ఆధ్వర్యంలో గేట్ల మరమ్మతులు, గ్రీజింగ్, గేట్లను లేవనెత్తె ఇనుప తాళ్లను, విద్యుత్ జనెరేటర్లను పరీక్షించడం, తుప్పు పట్టకుండా గేట్లకు పెయింటింగ్ చేయడం, డ్యాం గ్యాలరీల నుంచి నీటి తోడడం తదితర పనులకు విధివిధానాలు ఖరారు చేసింది. నెలకు, మూడు నెలలకు, ఆరు నెలలకు, సంవత్సరానికి ఒకసారి చేయవలసిన పనులను సూచిస్తూ మార్గదర్శకాలు రూపొందించింది. రెగ్యులేటర్లు, ఇతర గేటెడ్ స్ట్రక్చరలను నిర్వహించడం కూడా ఇందులో భాగంగా ఉంటాయి. ఇటువంటి అత్యవసర పనుల

నిర్వాహణ కోసం ప్రభుత్వం ఒ&ఎం నిధులను సమకూర్చినందున వీటి నిర్వాహణ ఇక ముందు సజావుగా సాగుతుందని ఆశించవచ్చు.

### 14.6 పంప్ హౌజ్ ల నిర్వాహణ :

భవిష్యత్తులో రాష్ట్రంలో ఎత్తిపోతల ప్రాజెక్టుల కింద సుమారు 75 లక్షల ఎకరాల ఆయకట్టు ఉంటుంది. కాబట్టి ఎత్తిపోతల పథకాలలో పంప్ హౌజుల నిర్వహణ ఒక ప్రధానమైన కార్యక్రమం. సాగునీటి ప్రాజెక్టుల నిర్వాహణతో పోలిస్తే ఇది ప్రత్యేకమైనది, సాంకేతిక నైపుణ్యంతో కూడుకున్నది. నిపుణులైన మెకానికల్, ఎలెక్ట్రికల్ ఇంజనీర్ల నేతృత్వంతో పంప్ హౌజుల కాలానుగుణమైన (periodical) నిర్వాహణకు కూడా సాగునీటి శాఖ సమగ్రమైన విధివిధానాలను రూపొందించింది.

### 14.7 ఆపరేషన్ & మెయింటెనన్స్ లో రెండేండ్ల పురోగతి :

- సాగునీటి శాఖ పునర్ వ్యవస్థీకరణలో భాగంగా ఏర్పడిన ఆపరేషన్ & మెయింటెనన్స్ విభాగం రాష్ట్రంలోని అన్ని ప్రాజెక్టుల నిర్వాహణకు, అత్యవసర పనుల మరమ్మతులకు కావాల్సిన విధివిధానాలు, సర్క్యులర్స్ జారీ చేయడం జరిగింది.



నాగార్జున సాగర్ డ్యాం స్పిల్ వే మరమ్మత్తులు

- గత రెండేండ్లలో సుమారు 550 కోట్లతో 2800 పనులను చేపట్టడం జరిగింది. ఇందులో భాగంగా నాగార్జునసాగర్ కుడి తూము గేట్లు, ఎడమ కాలువకు పడిన గండి పూడ్చడం, అన్ని పంప్ హౌజ్ల మరమ్మతులు చేపట్టడం ద్వారా గడచిన రెండేండ్లలో అన్ని పంపులు నిర్విరామంగా పని చేసి రెండు పంటలకు సాగునీరు అందించడం, చెరువులను నింపడం జరిగింది.
- ప్రాజెక్టుల డ్యాం గేట్లు, రెగ్యులేటర్ల గేట్లు, తూముల గేట్లను ఎప్పటికప్పుడు పని చేసే స్థితిలో ఉంచడానికి ప్రత్యేక శ్రద్ధతో నిధులు మంజూరు చేస్తున్నది. రాష్ట్రంలో 149 చిన్న నీటి ఎత్తిపోతల పథకాలను మరమ్మతు చేసి వాటిని పునరుద్ధరించడం జరిగింది.

| సంవత్సరం | మంజూరు అయిన పనులు | విలువ రూ (కోట్లలో) |
|---|---|---|
| 2021-22 | 1288 | 364.77 |
| 2022-23 | 1528 | 251.13 |
| 2023 - 24 | 969 | 236,57 |

### 14.8 పంటల ఉత్పాదకత :

అయితే నీటి వినియోగ సామర్థ్యం పెంచుకోవడంతో పాటు పంటల ఉత్పాదకత (Productivity) కూడా పెంచుకోవడంపై దృష్టి సారించడం అవసరం. చైనా, వియత్నాం, ఇండోనేసియా, బంగ్లాదేశ్ తదితర ఆసియా దేశాలతో పోలిస్తే వరి ధాన్యం ఉత్పాదకత భారతదేశంలో చాలా తక్కువ. 2016 అమెరికా వ్యవసాయ శాఖ (USDA) గణాంకాల ప్రకారం వరి ఉత్పాదకత ఈ విధంగా ఉన్నది.

| దేశం | సాగు విస్తీర్ణం (మి.హెక్టార్లు) | మొత్తం ఉత్పత్తి (మి.టన్నులు) | ఉత్పాదకత (టన్నులు/హె) |
|---|---|---|---|
| 1. జపాన్ | 1.60 | 79.00 | 4.91 |
| 2. చైనా | 30.35 | 145.50 | 4.79 |
| 3. వియత్నాం | 7.66 | 28.20 | 3.68 |
| 4. ఇండోనేసియా | 12.16 | 36.30 | 2.99 |
| 5. బంగ్లాదేశ్ | 12.00 | 34.60 | 2.88 |
| 6. ప్రపంచం | 159.167 | 473.50 | 2.97 |
| 7. భారత్ | 43.20 | 103.50 | 2.40 |

భారతదేశంలో వరి పంట సాగు విస్తీర్ణం మిగతా దేశాలతో పోలిస్తే చాలా ఎక్కువగా ఉన్నా ఉత్పాదకత చాలా తక్కువ అని పై గణాంకాలు తెలియజేస్తున్నాయి. గోదుమ ఉత్పాదకత కూడా చైనాలో హెక్టారుకు 4.7 టన్నులు ఉంటే భారత్ లో 2.9 టన్నులే. పంటల ఉత్పాదకత భూముల నాణ్యత, సారం, సాగునీటి లభ్యత, ఎరువుల వినియోగం, పంటల ఉత్పత్తిని పెంచే వంగడాల వినియోగం, వాతావరణ అనుకూలత తదితర అంశాలపై ఆధారపడి ఉంటుంది. భవిష్యత్తులో 130 కోట్ల జనాభా

ఆహార భద్రతకు పూచీ పడాలంటే పంటల ఉత్పాదక పెరగాలి. ఉత్పాదక పెరగాలంటే సాగునీటి లభ్యత ప్రధాన వనరు. దేశంలో సాగునీటి లభ్యత 48% నికి మించి లేదని గణాంకాలు తెలియజేస్తున్నాయి. ఇందులో 80% నీరు సాగు కోసమే వినియోగిస్తున్నాము. గత ఆరేండ్లుగా తెలంగాణ రాష్ట్రంలో సాగునీటి లభ్యత పెంచడానికి విశేషమైన కృషి జరిగింది. ఇప్పుడు సాగునీటి వ్యవస్థల నిర్వాహణపై రాష్ట్ర ప్రభుత్వం దృష్టి పెట్టింది.

ఈ కృషిలో ప్రధానంగా దృష్టి పెట్టవలసిన అంశాలు

1. సాగునీటి వినియోగ సామర్థ్యం పెంచడం

2. పంటల ఉత్పాదకత పెంచడం. ఉత్పాదకత పెంచే కృషిలో సాగునీటి శాఖ, వ్యవసాయ శాఖ సమన్వయంతో పని చేయవలసి ఉంటుంది. సాగునీటి శాఖలో పని చేస్తున్న వ్యవసాయ ఇంజనీర్లను సేవలను కాలువల నిర్వాహణలో వినియోగించుకోవడం అవసరం.

ఇప్పటికే సాగునీటి శాఖ పునర్ వ్యవస్థీకరణ ప్రక్రియ పూర్తి అయినందున ఇక ప్రాదేశిక చీఫ్ ఇంజనీర్లు ప్రాజెక్టులను పూర్తి చేయడంతో పాటు సాగునీటి వ్యవస్థల సమర్థ నిర్వాహణకు సిద్దం అవుతున్నారు.

## 15.0 ఉపాధి హామీ పథకాన్ని సాగునీటి పనులకు వినియోగం :

- గత సంవత్సరం ప్రభుత్వం ఒక కీలక నిర్ణయం తీసుకున్నది. ఉపాధి హామీ పథకం నిధులతో కాలువలను బాగు చేసుకోవాలని ఇంజనీర్లను, జిల్లా కలెక్టర్లను ఆదేశించింది.

- ఈ ప్రక్రియలో వందల కిలోమీటర్ల కాలువల్లో పూడి తీసివేత, చెట్లను తొలగించే పని జయప్రదంగా పూర్తి చేసినారు. చెరువు కట్టల మీద చెట్లను తొలగించినారు. ఈ విధంగా ఉపాధి హామీ పథకం నిధులను సాగునీటి శాఖ సద్వినియోగం చేసింది.



కాలువ పనులు

## 16.0 దేశానికి సమగ్ర జల విధానం :

దేశంలో ప్రతీ సంవత్సరం కురుస్తున్న వర్షపాతం సుమారు 1,40,000 టిఎంసిలని, ఇందులో భూమిలోకి ఇంకి పోయే నీరు, ఆవిరి అయ్యే నీరు, మంచు రూపంలో హిమాలయాలలో ఉండిపోయే నీరు మినహాయిస్తే దేశంలోని అన్ని నదులలో లభ్యమయ్యే నీరు సుమారు 70 వేల టిఎంసిలని కేంద్ర జల సంఘం లెక్క గట్టింది. దేశం భౌగోళిక విస్తీర్ణం సుమారు 83 కోట్ల ఎకరాలు. ఇందులో సాగు యోగ్యమైన భూమి సుమారు 41 కోట్ల ఎకరాలు. ఈ భూమిలో ప్రతీ ఎకరానికి సాగునీరు ఇవ్వడానికి తగినంత నీరు దేశ నదులలో ప్రవహిస్తున్నాయి. కానీ స్వాతంత్ర్యం వచ్చిన 75 ఏండ్లలో 35 – 40 వేల టిఎంసి లకు మించి నీరు వాడకంలోకి తీసుకు రాలేకపోయామని రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ అనేక మార్లు చెప్పారు. అపారమైన జలరాసులు నిరుపయోగంగా సముద్రంలోకి వెళ్లిపోతున్నాయని ఆయన ఆవేదన వ్యక్తం చేసేవారు.

దేశంలో అతి పెద్ద మెట్రో నగరం చెన్నై తాగునీటి కోసం కటకటలాడడం ఏమిటి? చెన్నై నగరానికి తాగునీరు ఇవ్వలేని దౌర్భాగ్యం ఏమిటి? ఈ దేశానికి ఆ బాధ్యత లేదా? దేశంలో వేలాది గ్రామాలు ఇంకా తాగునీటి కోసం తపించి పోతున్నాయి. తాగునీరు కూడా ఇవ్వలేని ఈ స్వాతంత్ర్యం దేనికి? ప్రతీ నదీ బేసిన్లో సాగు, తాగు నీటి కోసం బేసిన్ రాష్ట్రాల మధ్య పంచాయతీలు దశాబ్దాలుగా కొనసాగుతున్నాయి. మహానది జలాల కోసం ఒడిషా, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాలు, కావేరీ జలాల కొసం, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలు, రావి బియాస్ జలాల కోసం పంజాబ్, హర్యానా రాష్ట్రాలు, నర్మదా జలాల కోసం మధ్యప్రదేశ్, గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రాలు, గోదావరి కృష్ణా జలాల కోసం తెలంగాణ, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రా, కర్ణాటక రాష్ట్రాల మధ్య ఎడతెగని పంచాయతీలు నడుస్తున్నాయి. దశాబ్దాల తరబడి ట్రిబ్యునళ్లలో వాదనలు కొనసాగుతున్నాయి. ఇంత పెద్ద మొత్తంలో నీటి లభ్యత ఉన్నా ఈ నీటి వివాదాలు ఎందుకు? అని ఆయన ప్రశ్నిస్తున్నారు. ఈ దేశ పాలకులకు సమగ్ర జల విధానం, దార్శనికత, చిత్త శుద్ది లేకపోవడమే ప్రధాన కారణం అని ఆయన అభిప్రాయం. వ్యవసాయ రంగంలో ఇజ్రాయిల్ సాధించిన అభివృద్దిని, చైనా సాధించిన అభివృద్దిని ప్రస్తావిస్తాము కానీ మనమెందుకు ఆ పని సాధించడం లేదు? అన్న అంశంపై సీరియస్ చర్చ దేశంలో జరగడం లేదు. సమగ్ర విధాన రూపకల్పనపై చర్చ జరగడం లేదు. ఒక వైపు దేశ ప్రజలు తాగునీటి కోసం, దేశ రైతాంగం సాగునీటి కోసం తపిస్తుంటే గంగా, బ్రహ్మపుత్ర నదులలో అపారమైన జలరాశి నిరుపయోగంగా సముద్రంలోకి వెళ్ళి పోతున్నాయి. దేశంలో ప్రతీ ఏడు కరువు–వరదలు–కరువు స్థితి ఎందుకు నెలకొంటున్నది? అని ఆవేదన వ్యక్తం చేసినారు. ఈ అంశంపై ఆయన విస్తృతంగా అధ్యయనం చేసినారు. దేశానికి ఒక సమగ్ర జల విధానాన్ని రూపకల్పనకు అధ్యయనం చేసినారు. దేశంలో 17 జాతీయ ప్రాజెక్టులు ఉండగా అవి 11 రాష్ట్రాలలో మాత్రమే ఉన్నాయి. 18 రాష్ట్రాలలో ఒక్క జాతీయ ప్రాజెక్టు లేకపోవడం ఎందుకు ? అని ప్రశ్నించారు. గత కేంద్ర ప్రభుత్వాలు తమ పార్టీ పాలిత రాష్ట్రాలకే జాతీయ ప్రాజెక్టులను మంజూరు చేసినాయి. వివక్షకు తావు లేకుండా ప్రతీ రాష్ట్రానికి ఒక జాతీయ ప్రాజెక్టును కేంద్ర ప్రభుత్వం నిర్మించాలని డిమాండ్ చేసినారు.

## 17.0 సాగునీటికి బడ్జెట్ కేటాయింపులు / నిధుల సమీకరణ / నీటి కేటాయింపులు:

బడ్జెట్‌లో సాగునీటి శాఖకు తొలి మూడు సంవత్సరాలు 25 వేల కోట్ల అత్యధిక నిధులు కేటాయించి పెండింగ్ ప్రాజెక్టుల పనులను సకాలంలో పూర్తి చేయడానికి చర్యలు తీసుకుంది. కాళేశ్వరం, పాలమూరు, సీతారామ, తుపాకులగూడెం, వరద కాలువ, దేవాదుల ప్రాజెక్టులకు జాతీయ బ్యాంకులు, పవర్ ఫైనాన్స్ కార్పొరేషన్, రూరల్ ఎలెక్ట్రిఫికేషన్ కార్పోరేషన్, నాబార్డ్ ద్వారా నిధులు సమకూర్చింది. కల్వకుర్తి ప్రాజెక్టు నీటి కేటాయింపులను 25 నుంచి 40 టిఎంసిలకు పెంచింది. గోదావరిలో తెలంగాణ వాటా 968 టిఎంసిల నీటిని సంపూర్ణంగా వాడుకోవడానికి ప్రణాళికలు తయారు చేసి ప్రాజెక్టులను పూర్తి చేస్తోంది. కృష్ణా జలాల్లో న్యాయమైన వాటా 575 టిఎంసిలు పొందడానికి బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ ముందు, సుప్రీం కోర్టు ముందు వాదనలు కొనసాగిస్తున్నది.

## 18.0 పరస్పర సహకారమే లక్ష్యంగా అంతర్రాష్ట్ర సంబందాలు:

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నదీ జలాల వినియోగం విషయంలో పొరుగు రాష్ట్రాలతో ఘర్షణ వైఖరితోనే వ్యవహరించడం వలన పొరుగు రాష్ట్రాలతో సంబందాలు చెడిపోయినాయి. అంతర్రాష్ట్ర వివాదాలు దశాబ్దాలుగా పరిష్కారం కాకుండా ఉండిపోయినాయి. ఫలితంగా ఇచ్చంపల్లి, పెన్ గంగా, ప్రాణహిత, లెండి ప్రాజెక్టులు అమలు కాకుండా లేదా పూర్తి కాకుండా పెండింగ్ పడిపోయినాయి. 1975 లోనే వీటిపై అంతర్రాష్ట్ర ఒప్పందాలు జరిగినా పొరుగు రాష్ట్రాలతో సత్సంబందాలు నెరపకపోడంతో, అంతర రాష్ట్ర ప్రాజెక్టులపై చర్చలు జరిపి వారిని విశ్వాసంలోకి తీసుకోకపోవడంతో అవి దశాబ్దలుగా అమలుకు నోచుకోలేకపోయినాయి. దానికి ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వాలు తెలంగాణ ప్రాజెక్టులపై చూపించిన వివక్ష తోడైంది. ప్రాజెక్టులపై ఈ స్థితి కొనసాగుతున్న సందర్భంలోనే పొరుగు రాష్ట్రాలతో నీటి పంపకాలు, అక్రమ ప్రాజెక్టుల నిర్మాణం, కోర్టు కేసులు, ట్రిబ్యూనల్ లో వాదనలు తదితర అంశాలపై పొరు రాష్ట్రాలతో సంబంధాలు బలహీనపడినాయి.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన అనంతరం ఈ స్థితి మారాలని ప్రభుత్వం భావించింది. పొరుగు రాష్ట్రాలతో సత్సంబంధాలు నెరపడం, పరస్పర అవగాహనతో చర్చల ద్వారా అంతర్రాష్ట్ర వివాదాలను పరిష్కరించుకోవాలని భావించింది. తెలంగాణకు అది అత్యవసరం. అంతర్రాష్ట్ర వివాదాల కారణంగా పెండింగ్ పడిపోయిన ప్రాజెక్టులన్నీ తెలంగాణవే. ఈ ప్రాజెక్టులని గ్రౌండ్ చెయ్యాలంటే మహారాష్ట్ర, కర్నాటక, చత్తీస్‌ఘర్ రాష్ట్రాల సహకారం అవసరం. తెలంగాణ రాష్ట్రం ఏర్పడగానే ప్రాజెక్టుల సమీక్షలో భాగంగా ముఖ్యమంత్రి కెసిఆర్ అంతర్రాష్ట్ర ప్రాజెక్టులపై, వివాదాలపై దృష్టి సారించినారు. గత ప్రభుత్వాలు పొరుగు రాష్ట్రాలతో అనుసరించిన ఘర్షణాత్మక వైఖరిని వీడి స్నేహ సంబందాలని పెంపొందించుకోవాలని, తమది ఇచ్చి పుచ్చుకునే వైఖరని ప్రకటించినాడు. ఆంధ్రప్రదేశ్ సహా అన్ని పొరుగు రాష్ట్రాలతో చర్చల ప్రక్రియ ద్వారానే అంతర్రాష్ట్ర వివాదాలను పరిష్కరించుకుంటామని అన్నారు. అందులో భాగంగానే మహారాష్ట్రతో, కర్నాటక రాష్ట్రాలతో వివాద పరిష్కారానికి, ప్రాజెక్టు పనులని పురోగతిలో పెట్టడానికి చర్చలకు ఉపక్రమించింది.

## 18.1 మహారాష్ట్రతో అంతర రాష్ట్ర సమస్యలు :

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన వెంటనే మహారాష్ట్ర ప్రభుత్వంతో తెలంగాణ ప్రభుత్వం సంప్రదింపులు ప్రారంభించింది. రెండు రాష్ట్రాల మధ్య చిరకాలంగా పెండింగ్ పడిపోయిన సాగునీటి ప్రాజెక్టు పనులను పురోగతిలో పెట్టింది. ఆదిలాబాద్ జిల్లాలో పెన్ గంగ బ్యారేజీ, ప్రాణహిత నదిపై తుమ్మిడిహట్టి బ్యారేజీ, నిజామాబాద్ జిల్లాలో నత్తనడక నడుస్తున్న లెండి ప్రాజెక్టులపై ముఖ్యమంత్రి స్వయంగా ముంబాయి వెళ్ళి మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ దేవేంద్ర ఫడ్నవీస్‌తో చర్చించినారు. ఆ తర్వాత కూడా మంత్రుల స్థాయిలో, అధికారుల స్థాయిలో నిరంతర చర్చలు జరిగినాయి. ఆనాటి సాగునీటి మంత్రి శ్రీ హరీశ్ రావు ముంబాయి వెళ్ళి మహారాష్ట్రా జలవనరుల శాఖామంత్రి శ్రీ గిరీశ్ మహాజన్‌తో పలుమార్లు చర్చించడం జరిగింది. ఈ నిరంతర సంప్రదింపులు ఫలించినాయి. 12 జనవరి 2016 న ముంబాయిలో రెండు రాష్ట్రాల జలవనరుల శాఖా మంత్రుల స్థాయిలో జరిగిన సమావేశంలో ఇరు రాష్ట్రాలకు సంబందించిన అంతర్రాష్ట్ర ప్రాజెక్టుల సమస్యల పరిష్కారం కోసం, వాటి అమలు కోసం ఒక ఉమ్మడి అంతర్రాష్ట్ర బోర్డ్ ఏర్పాటుకు సూత్రప్రాయమైన అంగీకారం కుదిరింది. బోర్డ్ అంతర్రాష్ట్ర ప్రాజెక్టులపై పెండింగ్ సమస్యలని వేగంగా ఇరు రాష్ట్రాలకు అమోదయోగ్యంగా పరిష్కరించాలి. ప్రాజెక్టు పనులను పురోగతిలో పెట్టడానికి పరస్పరం సహకరించుకోవాలి. బోర్డ్ యొక్క విధివిధానాలు ఖరారు అయిన తర్వాత 8 మార్చ్ 2016 న ముంబాయిలో రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు గోదావరి ఉమ్మడి ప్రాజెక్టులపై అంతర్రాష్ట్ర బోర్డ్ ఆవిర్భావానికి ఒప్పందంపై సంతకాలు చేసినారు. ఈ క్రింది ప్రాజెక్టులను బోర్డ్ పరిధిలోనికి తీసుకవచ్చినారు.

1. లెండి ప్రాజెక్టు
2. డా. బి ఆర్ అంబేద్కర్ ప్రాణహిత ప్రాజెక్ట్ & కాళేశ్వరం ప్రాజెక్ట్. ఈ రెండు ప్రాజెక్టుల్లో ప్రాణహితపై తుమ్మిడిహట్టి బ్యారేజీ , గోదావరి నదిపై మేడిగడ్డ బ్యారేజీని బోర్డ్ పరిధిలో చేర్చడం జరిగింది.
3. పెన్ గంగ నదిపై రాజాపేట్ వద్ద బ్యారేజి
4. పెన్ గంగ నదిపై చనకా – కొరట వద్ద బ్యారేజి
5. పెన్ గంగ నదిపై పింపరాడ్ – పర్సోడా వద్ద బ్యారేజీ
6. దిగువ పెన్ గంగ ప్రాజెక్ట్

పైన పేర్కొన్న ప్రాజెక్టుల సంబందించి నిర్మాణానికి ముందు, నిర్మాణం తర్వాత తలఎత్తే అన్ని సాంకేతిక మరియు ఇతర సమస్యలని పరిష్కరించడానికి అంగీకారం కుదిరింది. ఇవే కాక భవిస్యత్తులో గోదావరి నదిపై రెండు రాష్ట్రాలు చేబట్టే ప్రాజెక్టులు కూడా ఈ అంతర్రాష్ట్ర బోర్డ్ పరిధిలోనికే వస్తాయి. బోర్డ్ అవిర్భావం తర్వాత దశాబ్దాలుగా అటకెక్కిన ప్రాజెక్టులు వేగంగా కదిలినాయి. రెండు రాష్ట్రాల ఇంజనీర్లు, ఉన్నతాధికారులు పరస్పరం సహకరించుకుంటూ ప్రాజెక్టుల సాంకేతిక అంశాలని ఒక్కొక్కటిగా పరిష్కరించుకున్నారు. చనాక కొరాటా బ్యారేజికి సంబందించిన అటవీ, వన్యప్రాణి, గనుల అనుమతులని

మహారాష్ట్ర ప్రభుత్వం జారీ చేసింది. చనాక కొరాట బ్యారేజీ పనులు పూర్తి అయినాయి. ఆదిలాబాద్ జిల్లా బేలా, జైనాద్ మండలాల్లోని 50 వేల ఎకరాలకు సాగునీరు అందించేందుకు ఉద్దేశించిన బ్యారేజీ పనులు ప్రారంభం కావడానికి ఈ అంతర్రాష్ట్ర ఒప్పందం కారణమయ్యింది. ఆదిలాబాద్ జిల్లా ప్రజలు గత 40 సంవత్సరాలుగా పెన్‌గంగ నీటి కోసం ఎదురుచూస్తూ ఉన్నారు. ఉమ్మడి రాష్ట్ర పాలకుల నిర్లక్ష్యం కారణంగా తలాపున పెన్‌గంగ ఉధృతంగా పారుతున్నా అవి సముద్రంలోకి పోయినాయి తప్ప ఆదిలాబాద్ పశ్చిమ జిల్లా రైతాంగానికి మాత్రం దక్కలేదు. ఈ ఒప్పందం కారణంగా ఆదిలాబాద్ పశ్చిమ జిల్లా ప్రజల చిరకాల వాంచ నెరవేరబోతున్నది.

అట్లె దశాబ్ద కాలంగా అపరిష్కృతంగా ఉండిపోయిన తుమ్మిడిహట్టి బ్యారేజి సమస్యలు కూడా ఈ ఒప్పందం ద్వారా పరిష్కారం అయినాయి. తుమ్మిడిహట్టి ఎఫ్ ఆర్ ఏల్ ని 4 మీటర్లు తగ్గించి మహారాష్ట్రా కోరుకున్నట్లు వారి భూభాగంలో ముంపు తగ్గించి తుమ్మిడిహట్టి బ్యారేజి నిర్మాణానికి ఉన్న అడ్డంకిని తొలగించుకున్నాము. ప్రాణహిత ప్రాజెక్టును రీ డిజైన్ చేసుకొన్నందున కొత్తగా గోదావరి నదిపై ప్రతిపాదించిన మేడిగడ్డ బ్యారేజీ నిర్మాణంపై కూడా కూడ మహారాష్ట్రాతో అడ్డంకులని ఈ ఒప్పందం ద్వారా తొలగించుకోగలిగినాము. నత్త నడక నడుస్తున్న లెండి ప్రాజెక్ట్ పనులని వేగవంతం చేసుకోగలిగినాము. అందుకే తెలంగాణ రాష్ట్ర ప్రయోజనాల దృష్టికోణం నుంచి చూసినప్పుడు ఈ ఒప్పందం చారిత్రాత్మకమైనది, అత్యంత కీలకమైనది.

కాళేశ్వరం ప్రాజెక్టు సాకారం కావడానికి అత్యంత కీలకమైనది మహారాష్ట్రతో కుదిరిన అంతర్రాష్ట్ర ఒప్పందం. ముఖ్యమంత్రి స్వయంగా రెండు సార్లు ముంబాయి వెళ్లి మహారాష్ట్రా ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవిస్ తో పరస్పర సహకారమే లక్ష్యంగా చర్చలు జరిపి ఒప్పందానికి అనుకూలంగా మార్చినారు. ఇటువంటి ఒప్పందం ఉమ్మడి రాష్ట్రంలో సాధ్యం కాలేదు కనుకనే తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజి నిర్మాణం పదేండ్లు ముందుకు కదలలేదు. ఈ చారిత్రాత్మక ఒప్పందం కారణంగా పెన్ గంగ, ప్రాణహిత, గోదావరి నదులపై చనాకా కొరట, తుమ్మిడిహట్టి, మేడిగడ్డ బ్యారేజిల నిర్మాణానికి మార్గం సుగమం అయ్యింది. ఈ మూడింటిలో మేడిగడ్డ బ్యారేజి, చనాకా కొరట బ్యారేజి పూర్తి అయినాయి . మహారాష్ట్రాతో ఈ అంతర్రాష్ట్ర ఒప్పందమే కేంద్రం నుంచి ప్రాజెక్టుకు అనుమతులు రాబట్టడానికి ప్రాతిపదిక అయ్యింది. మహారాష్ట్రాతో ఒప్పందం నదీ జలాల వివాదాల పరిష్కారానికి దేశానికి ఒక మార్గనిర్దేశనం చేసింది. ఇచ్చి పుచ్చుకునే వైఖరిని ప్రదర్శిస్తే దశాబ్దాల తరబడి అపరిష్కృతంగా ఉన్న వివాదాలు కూడా పరిష్కారం అవుతాయని ఈ ఒప్పందం నిరూపించింది.

## 18.2 కర్నాటకతో అంతర రాష్ట్ర సమస్యలు :

పొరుగు రాష్ట్రాలతో ఇచ్చిపుచ్చుకునే ధోరణితో వ్యవహరించే క్రమంలో భాగంగా కర్నాటకతో కూడా చర్చలకు సిద్దపడింది. ఉమ్మడి రాష్ట్రంలో రాజోలిబండ డైవర్షన్ స్కీం ఆధునికీకరణ పనులకు అనుమతి ఇవ్వడం జరిగింది. అందులో కాలువల మరమ్మతులతో పాటు ఆనకట్ట ఎత్తు 15 సెం మీ పెంచడం, ఆనకట్ట గేట్లను మరమ్మత్తు చెయ్యడం, గేట్లకు హైస్టింగ్ పరికరాలు అమర్చడం, ఆనకట్ట కన్

స్ట్రక్షన్ తూములని మూసివేయడం కూడా ఉన్నాయి.

రాజోలిబండ డైవర్షన్ స్కీం 1944 లోనే విలీనానికి ముందు హైదరాబాద్ రాష్ట్రం తుంగభద్ర నదిపై నిర్మించింది. అప్పుడు రాయచూర్ జిల్లా హైదరాబాద్ రాజ్యంలో భాగంగా ఉండేది. మహబూబ్ నగర్ జిల్లాలో 87,000 ఎకరాలకు సాగు నీరు అందించడానికి ఈ ఆనకట్టను నిర్మించడం జరిగింది. రాజోలిబండ కాలువకు మొత్తం 17.10 టిఎంసిల నికర నీటి కెటాయింపులు ఉన్నాయి. రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ తర్వాత రాయచూర్ జిల్లా కర్నాటకకు బదిలీ అయ్యింది. దాంతో ఆనకట్ట హెడ్ వర్క్స్ 42 కి మీ కాలువ కర్నాటకలోకి పోయినాయి. టిఎంసి నీటి కెటాయింపుల్లో 1.20 టిఎంసిలు కర్నాటకకు, 15.90 టిఎంసిలు ఆంధ్రప్రదేశ్ మహబూబ్ నగర్ జిల్లాకు కెటాయించినారు. రాజోలిబండకు దిగువన సుంకేసుల ఆనకట్ట ద్వారా కె సి కెనాల్ కు తుంగభద్ర నీరు సరఫరా అవుతుంది. సుంకేసుల ఆనకట్ట నుంచి కెసి కెనాల్ కు 39 టిఎంసిల కెటాయింపులు ఉన్నాయి. అయితే ఉమ్మడి రాష్ట్రంలో రాజోలిబండ కాలువకు సరాసరి 5 నుంచి 6 టిఎంసిలకు మించి ఎన్నడూ సరఫరా కాలేదు. అదే సమయంలో కర్నూలు–కడప కాలువకు మాత్రం 60 నుంచి 65 టిఎంసిల నీరు సరఫరా అయ్యేది. కర్నూలు రైతులు దౌర్జన్యంగా నీటిని తరలించుక పొయ్యేది. కన్ స్ట్రక్షన్ తూములని మూసివెయ్యమని ప్రభుత్వాన్ని ఎంత మొర పెట్టుకున్నా ప్రభుత్వం పెడ చెవిన పెట్టింది. మహబూబ్ నగర్ రైతుల ఒత్తిడికి లొంగి ఎప్పుడైనా తూములని మూసివేసే ప్రయత్నం చేసినా కర్నూలు రాజకీయ నాయకులు బాంబులు పెట్టి తూములని తెరిచేవారు. ఆ రకంగా రాజోలిబండ కాలువలోకి సరిపడినన్ని నీరు మళ్ళేది కాదు. ఈ అన్యాయాన్ని సవరించేందుకు ఉమ్మడి ప్రభుత్వం ఏనాడు ప్రయత్నించలేదు.

తెలంగాణ ఉద్యమం బలపడి కె సి ఆర్ రాజోలి కాలువపై పాదయాత్ర తర్వాత ప్రభుత్వానికి అధునీకీకరణ పనులు చేపట్టక తప్పలేదు. 2007 సంవత్సరంలో 92 కోట్లతో పనులకు పరిపాలనా అనుమతులు మంజూరు చేసింది. పనులను అమలు చెయ్యడానికి 58 కోట్లని కర్నాటక ప్రభుత్వానికి జమ చేసింది. పదేండ్లు గడచినా పనులు నత్తనడకన సాగుతున్నాయి. ఆనకట్ట ఎత్తు పెంచే పనులు మొదలే కాలేదు. ఆనకట్ట ఎత్తు పెంచితే మరికొంత ఎక్కువ నీరు రాజోలిబండ కాలువలోనికి మళ్ళించవచ్చునని ఉన్నతస్థాయి కమిటీ సిఫారసు చేసిన దరిమిలా ప్రభుత్వం అనుమతించింది. కాని అమలు చెయ్యడం పట్ల శ్రద్ధ చూపలేదు. కర్నూలు రాజకీయ నాయకత్వం ఒత్తిడికి లొంగి ఆనకట్ట ఎత్తు పెంచేపని చేయడానికి సాహసించలేదు.

తెలంగాణ రాష్ట్రం ఎర్పడగానే ప్రభుత్వం రాజోలిబండ ఆధునీకీకరణ పనుల పురోగతిపై దృష్టి పెట్టింది. మొదట కర్నాటక ప్రభుత్వానికి ఆనాటి సాగునీటి మంత్రి శ్రీహరీశ్ రావు గారు కర్నాటక మంత్రి శ్రీ ఎం బి పాటిల్ గారికి 2015 లో లేఖ రాసినారు. పోలీసు బలగాలని దింపి అయినా పనులని కొనసాగించాలని కోరినారు. కాలువ మరమ్మత్తు పనులు పుంజుకున్నాయి కాని ఆనకట్ట పనుల పురోగతిలో మార్పులేదు. పనులు ప్రారంభమైన ప్రతిసారి వేలాది మందితో ఆనకట్ట వద్దకు చేరుకొని కర్నూలు రైతులు పనులని అడ్డుకున్నారు. ఈ నేపథ్యంలో 2016 ఖరీఫ్ పంట కాలానికల్ల పనులని పూర్తి చేయించాలన్న లక్ష్యంతో 28 ఏప్రిల్ 2016 న ఉన్నతాధికారులతో కలిసి బెంగుళూరు వెళ్ళి ఎం బి

పాటిల్ తో సమావేశం అయినారు. రాజోలిబండ ఆధునీకీకరణ పనులని పూర్తి చేయించడానికి తగిన చర్యలు తీసుకోవాలని కోరినారు. అదే సమయంలో నారాయణ్ పూర్ జలాశయం నుంచి జూరాలకు 3 టిఎంసిల నీటిని మహబూబ్ నగర్ జిల్లా తాగునీటి అవసరాలకు మానవతా దృక్పథంతో వదలాలని విజ్ఞప్తి చేసినారు. కర్నాటక ప్రభుత్వం సానుకూలంగా స్పందించింది. అయితే ఆనకట్ట పనులని పూర్తి చెయ్యాలంటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సహకారం కూడా అవసరమని, వారితోకూడా చర్చించాలని సూచించినారు. వారి సూచన మేరకు హరీశ్ రావు గారు ఆంధ్రప్రదేశ్ సాగునీటి మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు గారితో బెంగుళూర్ నుండే ఫోన్ ద్వారా సంప్రదించినారు.

కర్నాటక పనులని పూర్తి చెయ్యడానికి సిద్ధంగా ఉన్నప్పటికీ ఆంధ్రప్రదేశ్ సహాయ నిరాకరణ వైఖరి వలన ఆనకట్ట పనులని పూర్తి చెయ్యలేకపోయింది. కాలువ మరమ్మతుల పనులని వేగవంతం చేసింది. మహబూబ్ నగర్ దాహార్తిని తీర్చడానికి ఒక టిఎంసి నీటిని జూరాలకు 2015మే నెలలో విడుదల చేసి తన ఔదార్యాన్ని చాటుకున్నది. తెలంగాణ రాష్ట్రం పట్ల స్నేహపూర్వక వైఖరిని ప్రదర్శించింది. చర్చల ద్వారా రాష్ట్రాల మధ్య స్నేహపూర్వక వాతావరణం ఏర్పడుతుందని ఈ సంఘటన రుజువు చేసింది.

తెలంగాణ ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ నుండి కూడా అటువంటి స్పందన వస్తుందని ఆశించింది. ఆంధ్రప్రదేశ్ మాత్రం ఉమ్మడి ప్రభుత్వం అనుమతించిన పనులని పూర్తి చేయడానికి సహకరించ లేదు. పైగా కర్నూలు ఆర్డివో ద్వారా పనులని చేపట్టరాదని కర్నాటక ఇంజనీరుకు లేఖ రాయించింది. ఆర్డీఎస్ వివాదాలతో పాటు పులిచింతల ప్రాజెక్టు పునరావాస పనులని కూడా సమీక్షించుకుందామని దేవినేని గారికి ఎన్నిసార్లు విన్నవించినా స్పందన రాలేదు. చర్చలకు రాలేదు. 2017 వరకు కూడా రాజోలిబండ ఆనకట్ట పనులు పూర్తికాలేదు. పులిచింతల పునరావాస పనులు పూర్తి కాలేదు. అయినా కూడా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంతో కూడా సంప్రదింపులు, చర్చల ద్వారానే వివాదాలని పరిష్కరించుకుంటామన్న వైఖరిని ముఖ్యమంత్రి కేసిఆర్ అసెంబ్లీలో ప్రకటించినారు. కృష్ణా జలాల పంపిణీ అయినా, ఉద్యోగుల పంపిణీ అయినా, ఆస్తుల పంపిణీ అయినా చర్చల ద్వారానే పరిష్కారం అవుతాయన్న విధానాన్నే అనుసరించాలని కెసిఆర్ ప్రభుత్వం భావించింది.

## 19.0 న్యాయబద్ధమైన నీటి వాటా కోసం పోరాటం :

నదీ జలాల వివాదాల ట్రిబ్యునల్ ముందు వాదనలను వినిపించే అధికారం కేవలం బేసిన్ రాష్ట్రాలకు మాత్రమే ఉంటుంది. తెలంగాణా ఒక రాష్ట్రంగా లేదు కనుక కృష్ణా జలాల పంపిణీ కోసం గతంలో ఏర్పాటు చేసిన రెండు ట్రిబ్యునళ్ల ముందు తెలంగాణా తన వాదనలని వినిపించలేకపోయింది. బచావత్, బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునళ్ల ముందు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృష్ణా బేసిన్ ఆవల ఉండే కోస్తా, రాయలసీమ ప్రాంత అవసరాలకు ప్రాధాన్యతనిచ్చి వాదనలు వినిపించిందే తప్ప తెలంగాణా అవసరాలను పట్టించుకోలేదు. మొత్తం ఆయకట్టు బేసిన్ ఆవలనే గల తెలుగుగంగ ప్రాజెక్టుకు కేటాయింపులు చేయాలని పట్టుబట్టిన ఆంధ్రప్రదేశ్, బేసిన్లోని కరువు ప్రాంతాలకు నీళ్లిచ్చే కల్వకుర్తి,

నెట్టెంపాడు, ఎస్ ఎల్ బి సి ప్రాజెక్టులకు పట్టుబట్టలేదు అని కూడా బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ పేర్కొన్నది.

తెలంగాణా అవసరాలను ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ట్రిబ్యునల్ ముందు పెట్టకపోవడం చేత వంద శాతం బేసిన్ లోపల ఉన్న మహబూబ్ నగర్, నల్లగొండ జిల్లాల ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు జరగలేదు. కృష్ణా బేసిన్ ఆవల ఉండే కృష్ణా డెల్టా ఆయకట్టు, నాగార్జునసాగర్ కుడి కాలువ ఆయకట్టు, కేసి కాలువ ఆయకట్టు ప్రాంతాలు ముందు నుంచి నీటిని వినియోగిస్తున్నారన్న సిదాంతం మీద వాటికి రక్షణలు కల్పించుకున్నారు. ఈ రక్షణల కారణంగా బేసిన్లో ఉన్న తెలంగాణ ప్రాంతం నికర జలాల కేటాయింపుల్లో తీవ్రంగా నష్టపోయింది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన వెంటనే రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి రాసిన లేఖలో ఉమ్మడి రాష్ట్రంలో కృష్ణా జలాల పంపిణీలో జరిగిన అన్యాయాన్ని, బచావత్, బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునళ్ళల్లో ఉమ్మడి ప్రభుత్వం వందశాతం కృష్ణా బేసిన్లో తెలంగాణ ప్రాజెక్టులకు నీటి కేటాయింపుల గురించి వాదించకపోవడం వలన జరిగిన నష్టం తదితర అంశాలను వివరంగా పేర్కొన్నది. కృష్ణా జలాల పున:పంపిణీ కోసం అంతర్రాష్ట్ర నదీ జలాల వివాద పరిష్కార చట్టం, 1956 సెక్షన్ 3 ప్రకారం ఒక ట్రిబ్యునల్కు నివేదించాలని కోరింది. చట్టం ప్రకారం ఒక సంవత్సరం లోపల కేంద్ర ప్రభుత్వం రాష్ట్రం యొక్క ఫిర్యాదును చర్చల ద్వారా పరిష్కరించాలి లేదా ట్రిబ్యునల్కు నివేదించాలి. కేంద్ర ప్రభుత్వం ఈ రెండూ చేయలేదు. అందుకే తెలంగాణ ప్రభుత్వం న్యాయం కోసం సుప్రీం కోర్టును ఆశ్రయించింది.

ఈ లోపల కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ విభజన చట్టం, 2014 సెక్షన్ 89 ప్రకారం బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ పదవీ కాలాన్ని పొడిగించి కృష్ణా జలాల వివాదాన్ని నివేదించింది. ఇక్కడ గమనించవలసిన ముఖ్య విషయం ఏమిటంటే..ఇది రివ్యూ ట్రిబ్యునల్ కాదు. దీనికి నివేదించిన రెండు అంశాలు పరిమితమైన పరిధి కలిగి ఉన్నాయి. ఒకటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రెండు ట్రిబ్యునళ్ళు కేటాయించిన గంపగుత్త నీటిని ప్రాజెక్టుల వారీగా విభజించడం. రెండోది కృష్ణా నదిలో కొరత ఉన్న సంవత్సరంలో నీటి పంపిణీ ఎట్లా ఉండాలి. ఇంతకు మించి విభజన చట్టం సెక్షన్ 89 కింద బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ రెండు రాష్ట్రాల మధ్య కృష్ణా జలాల పున:పంపిణీ చేయలేదు. ఈ విషయాన్ని ట్రిబ్యునల్ ఛైర్మన్ బ్రిజేష్ కుమార్ గారే ఒక సందర్భంలో పేర్కొన్నారు. విభజన చట్టం సెక్షన్ 89 ప్రకారం కృష్ణా జలాల పున:పంపిణీ రెండు రాష్ట్రాల మధ్య కూడా సాధ్యం కానప్పుడు ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు జరిగిన అన్యాయం సమసి పోయేది ఎట్లా? రాష్ట్రాన్ని సాధించుకున్నదే నదీ జలాల్లో న్యాయమైన వాటా కోసం.

బచావత్ గంపగుత్తగా కేటాయించిన 811 టిఎంసిలను నాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జీఓ ల ద్వారా తెలంగాణ ప్రాంత ప్రాజెక్టులకు 299, ఆంధ్ర ప్రాంత ప్రాజెక్టులకు 512 టిఎంసిలు కేటాయింపులు చేసింది. విభజన తర్వాత కూడా అవే వినియోగాలు కొనసాగాలని నేడు విభజన చట్టం సెక్షన్ 89 కింద బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ వద్ద వాదిస్తున్నది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. మహబూబ్ నగర్, నల్లగొండ జిల్లాలు వంద శాతం కృష్ణా బేసిన్లో ఉన్న జిల్లాలు. ఈ జిల్లాల్లో నికర జలాల కేటాయింపులు

ఉన్న ప్రాజెక్టులు జూరాల–17.84, రాజోలిబండ–15.9, భీమా–20, నాగార్జునసాగర్ ఎడమ కాలువకు–105, మూసి ప్రాజెక్టు–9.40 టిఎంసిలు మాత్రమే. మొత్తం 169.14 టిఎంసిలు. కల్వకుర్తి, నెట్టెంపాడు, పాలమూరు రంగారెడ్డి, ఎస్ఎల్బిసి, డిండీ ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు లేవు. తెలంగాణా ప్రభుత్వం ఈ ప్రాజెక్టులకు నికర జలాల కేటాయింపులు జరగాలని పోరాడుతున్నది.

నికర జలాలు ఎక్కడ నుంచి వస్తాయి? వ్యవసాయ రంగంలో విప్లవాత్మకమైన పరిశోధనల ఫలితంగా తక్కువ పంటకాలం ఉన్న వంగడాలు వచ్చాయి. ఆరుతడి పంటగా కూడా వరిని సాగు చేసే పద్ధతులు అభివృద్ధి అయినాయి. కాబట్టి కృష్ణా డెల్టా, నాగార్జునసాగర్ కుడికాలువ, కెసి కాలువ రైతులు ఆరుతడి సాగుకు మారాలి. కృష్ణా డెల్టాకు పట్టిసీమ ద్వారా ఏటా 100 టిఎంసిలకు పైగా గోదావరి నీటి సరఫరా జరుగుతున్నది. కాబట్టి కృష్ణా డెల్టాకు కేటాయించిన 152 టిఎంసిల నీటిని ఎగువన తెలంగాణ ప్రాజెక్టులకు కేటాయించవచ్చు. నాగార్జునసాగర్ కుడి కాలువ ఆయకట్టుకు కూడా గోదావరి నుంచి నీటిని సరఫరా చేయవచ్చు. ఆంధ్రా అవసరాలకు భంగం వాటిల్లకుండానే తెలంగాణాకు మరో 250 టిఎంసిల నికరజలాల కేటాయింపులు చేయవచ్చు.

పైన వివరించిన అంశాలను అనుసరించి తెలంగాణకు న్యాయబద్ధంగా 575 టిఎంసిలు రావాలని తెలంగాణ కోరుతున్నది. అయితే విభజన చట్టం సెక్షన్ 89 కింద పున:పంపిణీకి అవకాశం లేదు కనుకనే న్యాయం కోసం అంతర్రాష్ట్ర నదీ జలాల వివాదాల చట్టం సెక్షన్ 3 ప్రకారం తెలంగాణ ఫిర్యాదును ట్రిబ్యునల్కు నివేదించాలి. ముఖ్యమంత్రి కెసిఆర్ ఈ అంశాన్ని అక్టోబర్ 2020లో జరిగిన రెండవ అపెక్స్ కౌన్సిల్ లో పదేపదే ప్రస్తావించడంతో కేంద్ర జల వనరుల మంత్రి ఒప్పుకోక తప్పలేదు. ఒప్పుకున్న కేంద్రం మాట మాత్రం నిలబెట్టుకోలేదు. ఆరు నెలల తర్వాత కూడా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే. పైగా ప్రాజెక్టుల వారీగా నీటి కేటాయింపులు లేకుండానే కృష్ణా బోర్డు పరిధిలోకి ప్రాజెక్టులను తీసుకురావడానికి కేంద్రం సిద్ధపడింది. ఉమ్మడి రాష్ట్రంలో జరిగిన అన్యాయాన్ని సవరించడానికి సహకరించే బదులు కేంద్రం తెలంగాణ పట్ల నిర్లక్ష్య ధోరణి ప్రదర్శిస్తున్నట్టు వారి వైఖరి వెల్లడి చేస్తున్నది. తెలంగాణ ప్రభుత్వం కృష్ణా జలాల్లో న్యాయబద్ధమైన నీటి వాటా కోసం పోరాటాన్ని కొనసాగించింది. అదే సమయంలో గోదావరి జలాల్లో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం తెలంగాణకు కేటాయించి 967.94 టిఎంసిల నీటిని సంపూర్ణంగా వినియోగించుకునేందుకు ప్రాజెక్టుల నిర్మాణాన్ని ప్రణాళికాబద్ధంగా కొనసాగిస్తున్నది.

తెలంగాణ రాష్ట్ర పోరాటం ఫలించి 2023 అక్టోబర్లో కేంద్ర ప్రభుత్వం సెక్షన్ 3 కింద విచారణ జరపమని నిర్దేశిస్తూ కృష్ణా ట్రిబ్యునల్కు అదనపు టి ఒ ఆర్ను జారీ చేసింది. ఇది తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం సాధించిన అతి గొప్ప విజయం. ఇటీవల ట్రిబ్యునల్ కూడా మొదట సెక్షన్ 3 కిందనే విచారణ కొనసాగిస్తామని ప్రకటించడం తెలంగాణకు శుభ సూచకం. కె సి ఆర్ ప్రభుత్వం ట్రిబ్యునల్ ముందు 575 టిఎంసిల డిమాండ్ను ఉంచింది. వరద జలాల ఆధారంగా ప్రారంభించిన ప్రాజెక్టులైన ఎస్ ఎల్ బి సి కి 40 టిఎంసిలు, నెట్టెంపాడుకు 25 టిఎంసిలు, పాలమూరు రంగారెడ్డి ప్రాజెక్టుకు 90 టిఎంసిలు, డిండి ఎత్తిపోతలకు 30 టిఎంసిల నికర జలాలు కేటాయించమని ట్రిబ్యునల్ ను కోరింది.

గోదావరి ట్రిబ్యునల్ పోలవరం ద్వారా కృష్ణా బేసిన్ కి 80 టిఎంసిల గోదావరి జలాలను తరలించే నీటిలో కృష్ణా నదిలో నాగార్జున సాగర్ ఎగువన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి కేటాయించిన 45 టిఎంసిలను తెలంగాణ రాష్ట్రానికే కేటాయించమని కూడా ట్రిబ్యునల్‌ను కోరింది. సెక్షన్ 3 కింద ట్రిబ్యునల్‌లో విచారణ కొనసాగుతున్నది. ప్రస్తుత ప్రభుత్వం ట్రిబ్యునల్ ముందు సమర్థవంతంగా వాదించి తెలంగాణకు కృష్ణా జలాల్లో న్యాయబద్దమైన వాటాను సాధించవలసి ఉన్నది.

## 20.0 సాగునీటి శాఖలో నూతన టెక్నాలజీ వినియోగం :

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన వెంటనే ప్రభుత్వం సాగునీటి రంగంలో తన కార్యాచరణ ప్రణాళికను సిద్దం చేసుకున్నది. దశాబ్దాలుగా నత్తనడకన కొనసాగుతున్న భారీ, మధ్యతరహా, చిన్ననీటి పథకాలు, ఎత్తిపోతల పథకాలు, నూతనంగా ప్రారంభించిన మిషన్ కాకతీయ కార్యక్రమాన్ని పూర్తి చేసుకొని, కాళేశ్వరం ప్రాజెక్టు, పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకం, డిండీ ఎత్తిపోతల పథకం, ఆదిలాబాద్ జిల్లాలో పెన్ గంగ నదిపై చనాక కొరాట బ్యారేజీ, ప్రాణహిత నదిపై తుమ్మిడిహట్టి బ్యారేజి తదితర భారీ ప్రాజెక్టులని పూర్తి చేసుకొని రాష్ట్రంలోని ప్రతీ అసెంబ్లీ నియోజకవర్గంలో కనీసం ఒక లక్ష ఎకరాలకు తద్వారా మొత్తం ఒక కోటి 25 లక్షల ఎకరాలకు సాగునీరు అందించాలని లక్ష్యంగా ప్రకటించింది. ఈ ప్రాజెక్టులను అనుకున్న సమయానికి పూర్తి చెయ్యడం కోసం, ప్రాజెక్టులను తెలంగాణ అవసరాలకు అణుగుణంగా రూపకల్పన చెయ్యడం, వాటి నిర్మాణం సమయంలో పురోగతిని పర్యవేక్షించడం, నిర్మాణం తర్వాత వాటి నిర్వహణ అంశాల్లో నూతన టెక్నాలజీని ప్రభుత్వం సమర్థవంతంగా వినియోగించుకున్నది.

### 20.1 గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ వినియోగం :

తెలంగాణ ప్రభుత్వం గూగుల్ ఎర్త్ సాఫ్ట్‌వేర్‌ని సమర్థవంతంగా వినియోగిస్తున్న దానికి మార్చ్ 31, 2016 న అసెంబ్లీలో ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ చంద్రశేఖర్ రావు సాగునీటి ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్ పై, సాగునీటి ప్రణాళికపై ఇచ్చిన ప్రెజెంటేషన్ ఒక సాక్ష్యంగా నిలుస్తుంది. కొత్త ప్రాజెక్టుల రూపకల్పనలో, కొనసాగుతున్న ప్రాజెక్టుల రీఇంజనీరింగ్ అధ్యయనం కోసం సర్వే ఇండియా పటాలతో పాటు గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ ను రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చంద్రశేఖర్ రావు విస్తృతంగా వినియోగించినారు. ప్రస్తుతం కొనసాగుతున్న ప్రాజెక్టుల స్థితిగతులను తెలుసుకోవడానికి, వాటిలో ఇమిడి ఉన్న సాంకేతిక సమస్యలని అధ్యయనం చేసి పరిష్కరించుకునేందుకు సర్వే ఆఫ్ ఇండియా వారి పటాలను గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ సమన్వయం చేస్తూ అద్భుతంగా వినియోగించుకున్నారు ముఖ్యమంత్రి. ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్‌లో గూగుల్ ఎర్త్ ను ఉపయోగించుకున్న తీరు అనితర సాధ్యం. ప్రాణహిత చేవేళ్ళ సుజల స్రవంతి, దేవాదుల, ఎసారెస్పి వరద కాలువ, రాజీవ్ దుమ్ముగూడెం, ఇందిరా రుద్రమకోట, కంతనపల్లి, పాలమూరు రంగారెడ్డి, డిండీ ఎత్తిపోతల పథకాల రీ ఇంజనీరింగ్ / రీ డిజైన్ లను అధ్యయనం చేయడానికి గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ ముఖ్యమంత్రి గారు విస్తృతంగా వినియోగించుకున్నారు.

## 20.2 లిడార్ (LiDAR) సర్వే:

తొలుత గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ ఉపయోగించి ప్రాథమికంగా బ్యారేజీలు, కాలువలు, పైపలైన్లు, పంపు హౌజ్ తదితర కీలక ప్రదేశాలను గుర్తించిన అనంతరం వాప్కోస్ వారిచే గోదావరి బేసిన్లో (LiDAR - Light Detection and Ranging) 7600 చదరపు కి మీ లిడార్ సర్వే జరిపించి గూగుల్ ఎర్త్ ద్వారా నిర్ధారించిన ప్రదేశాలని నిర్ధారించుకోవడం జరిగింది. లిడార్ సర్వే ద్వారా మనకు అందే డిజిటల్ ఏలివేషన్ మాడల్(DEM) ని 1 సెం మీ వరకు కూడా సరి చూసుకునే సౌకర్యం ఉంటుంది. సాగునీటి ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్ మొత్తం ఈ ప్రక్రియ ద్వారానే జరిగినందున మెరుగైన ప్రతిపాదనలు తయారయినాయి. ముంపుని గణనీయంగా తగ్గించుకోవడం, గ్రామాలని / తండాలని వీలయినంతగా బయటపడేయడం, ఫారెస్ట్ భూముల నుండి, వన్యప్రాణి సంరక్షణ కేంద్రాల నుండి ప్రాజెక్టు కాలువలు, పైప్ లైన్ల అలైన్ మెంట్ పోకుండా చూసుకోవడం .. ఇవ్వన్ని గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్, లిడార్ సర్వే ప్రక్రియలను అనుసంధానించి ప్రతిపాదనలని సిద్ధం చేయడం జరిగింది.

లిడార్ సర్వే సాంకేతికతను ఉపయోగించడం వలన సర్వే పనులు అత్యంత వేగంగా పూర్తి అయినాయి. అత్యంత ఖచ్చితంగా సమాచారం అందుతుంది. ఒక ప్రాజెక్టు గ్రౌండ్ సర్వేకు సుమారు ఒక సంవత్సర కాలం పడుతుంది. అయితే 7600 చ.కిమీ విస్తీర్ణంలో సర్వేను లిడార్ టెక్నాలజీని ఉపయోగించి 15 రోజుల్లోనే పూర్తి చేయగలుగుతాము. ఆ సమాచార విశ్లేషణకు సుమారు రెండు నుంచి మూడు నెలల కాలం అవసరమవుతుంది. ఇంతటి పెద్ద విస్తీర్ణంలో సాంప్రదాయిక సర్వే చేపడితే అది నాలుగేండ్లు సాగుతుంది. ఖచ్చితత్వంలో కొన్ని మీటర్ల తేడా రావచ్చు. ఒకసారి లిడార్ సర్వే ద్వారా ఆ ప్రదేశాన్ని మ్యాపింగ్ చేసిన తర్వాత ఆ సమచారాన్ని దేనికైనా వినియోగించుకోవచ్చు. దేశంలో లిడార్ టెక్నాలజీని విస్తృతంగా ఉపయోగించుకున్న రాష్ట్రం తెలంగాణనే. గతంలో హిమాచల్ ప్రదేశ్లో జలవిద్యుత్ ప్రాజెక్టు సర్వే కోసం లిడార్ సాంకేతికతను వినియోగించినట్లు తెలుస్తున్నది. అయితే తెలంగాణ ప్రభుత్వం గోదావరి బేసిన్ ప్రాంతాన్ని మొత్తంగా లిడార్ టెక్నాలజీ ద్వారా మ్యాపింగ్ చేయించింది. ఇటువంటి పద్ధతిని పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల పథకంలో కూడా ఉపయోగించుకోవడం జరిగింది.

## 20.3 వాట్సాప్ గ్రూప్ ల ద్వారా పర్యవేక్షణ :

సాగునీటి శాఖలో ఆనాటి మంత్రి శ్రీ హరీశ్ రావు మార్గనిర్దేశనలో వాట్సాప్ గ్రూప్‌ల ద్వారా ప్రాజెక్టుల పురోగతిని అద్భుతంగా పర్యవేక్షించడం జరిగింది. ప్రతీ గ్రూప్‌లో మంత్రి గారు సభ్యుడిగా నమోదు అయినారు. పై నుంచి ఆదేశాలు తక్షణమే కిందకి వెళతాయి. వాటి మీద కింది స్థాయి అధికారులు తీసుకున్న చర్యల పట్ల నివేదికలు పైకి చేరుతాయి. సమాచారాన్ని చేరవేయడం, ప్రభుత్వ జి ఒ లు ఇతర మెమోలు, డాక్యుమెంట్స్, ఎస్టిమేట్స్, ఫోటోలు, వీడియోలు కింద నుంచి పైకి, పై నుంచి కిందకు సునాయాసంగా, సమయం వృధాకాకుండా పర్యవేక్షణ జరిగింది. ప్రాజెక్టుల పురోగతిని మంత్రి గారు స్వయంగా పర్యవేక్షిస్తున్నందున, ఎప్పటికప్పుడు ఆదేశాలు జారీ చేస్తున్నందున ఫైళ్ళు వేగంగా

పైకి కదిలినాయి. పై నుంచి అంతే వేగంగా ప్రభుత్వ ఆదేశాలు క్షేత్ర స్థాయికి చేరినాయి.

అదనపు సమాచారాన్ని, అదనపు డాక్యుమేంట్స్‌ని వాట్సాప్ మెసేజ్ ద్వారా తెప్పించుకొని ఫైళ్లని పరిష్కరించాలని మంత్రిగారు ఆదేశించిన దరిమిలా ఫైళ్ళను సమాచార లోపం కారణంగా కిందకి తిప్ప పంపకుండా పై స్థాయికి కదిలినాయి. దీని వల్ల ఫైళ్ల పరిష్కారంలో వేగం పెరిగింది. అధికారుల్లో జవాబుదారీతనం పెరిగింది. ఆ రోజుల్లో సాగునీటి శాఖలో 30 వాట్సాప్ గ్రూపులు పని చేస్తుండేవి. మిషన్ కాకతీయ కార్యక్రమానికి తొలుత రెండు గ్రూపులతో సాగునీటి శాఖలో వాట్సాప్ విప్లవం మొదయ్యింది. మంత్రి సహా, మంత్రి పేషిలోని అధికారులు, కార్యదర్శులు, చీఫ్ ఇంజనీర్లు, సూపరింటెండింగ్ ఇంజనీర్లతో ఒక గ్రూప్, మంత్రి సహా, పేషి అధికారులు, చీఫ్ ఇంజనీర్లు, సూపరింటెండింగ్ ఇంజనీర్లు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లతో మరో గ్రూప్ మిషన్ కాకతీయ కోసం పని చేసినాయి. మిషన్ కాకతీయ అధ్బుతంగా జయప్రదం కావడానికి ఈ రెండు వాట్సాప్ గ్రూపుల ద్వారా, వారం వారం తప్పనిసరిగా నిర్వహించిన వీడియో కాన్ఫరెన్స్‌ల ద్వారా జరిగిన పర్యవేక్షణ అని చెప్పవచ్చు. మిషన్ కాకతీయ గ్రూప్ ల పని తీరు బాగుండడంతో ఈ ప్రయోగాన్ని అన్ని ప్రాజెక్టులకు విస్తరించడం జరిగింది. అన్ని ప్రాజెక్టులకు ఒక్కొక్క వాట్సాప్ గ్రూప్ ఏర్పాటు చేయడం జరిగింది. అన్ని గ్రూపుల్లో మంత్రిగారు సభ్యుడిగా ఉన్నారు. సెక్రెటేరియట్ స్థాయిలో ఫైళ్ళ సర్కులేషన్ పర్యవేక్షించడానికి సెక్షన్ ఆఫీసర్ స్థాయినుంచి, స్పెషల్ సెక్రెటరీ, మంత్రి పేషి అధికారులు సభ్యులుగా ఉన్న ఒక గ్రూప్ క్రియాశీలకంగా పని చేసింది. సెక్రెటేరియట్ పని తీరు మెరుగు పడటానికి దోహదం చేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే సాగునీటి శాఖలోని అన్ని యూనిట్లను వాట్సాప్ గ్రూపుల ద్వారా సమన్వయ పరచ గలిగే వ్యవస్థ ఏర్పడింది. చీఫ్ ఇంజనీర్ స్థాయిలో స్థానికంగా ఇంజనీర్లు, కాంట్రాక్టర్లతో స్థానిక గ్రూపులు కూడా పని చేస్తున్నాయి.

వాట్సాప్ టెక్నాలజీని నాగార్జునసాగర్ ఆధునికీకరణ పనుల పర్యవేక్షణకు, నాణ్యత పరిశీలనకు అద్భుతంగా వాడుకున్న వైనాన్ని ప్రపంచ బ్యాంకు గొప్పగా ప్రశంసించింది. ఇటువంటి పర్యవేక్షణ పద్ధతినే ఇతర రాష్ట్రాలు కూడా అనుసరించాలని సూచన చేసినారు.

### 20.4 సచివాలయంలో ఫైల్ ట్రాకింగ్ సిస్టం :

సచివాలయం ప్రభుత్వ కార్య క్షేత్రం. పాలనా వ్యవస్థకు కేంద్ర స్థానం. ప్రభుత్వ నిర్ణయాలు, జి ఒ ల రూపంలో ఇక్కడ నుండే వెలువడతాయి. సచివాలయంలో ఎంత తొందరగా నిర్ణయాలు వెలువడితే రాష్ట్రంలో అభివృద్ధి అంత వేగవంతం అవుతుంది. గత ప్రభుత్వాల పని తీరును 60 ఏండ్లుగా మనం చూసి ఉన్నాం. నెలల తరబడి నిర్ణయాలు వెలువడక అభివృద్ధి కుంటుపడేది. ఫైళ్ళ కదలికలో తీవ్రమైన జాప్యం జరిగేది. మనిషి ఒక ఫైల్ వెంట ఉంటే తప్ప ఫైలు కదిలేది కాదు. అందుకే సచివాలయం పైరవీకారులకు కేంద్రంగా మారింది. తెలంగాణ ఫైళ్ళు సంవత్సరాల తరబడి అట్క మీద దుమ్ముకొట్టుక పోయేవి. ప్రభుత్వాన్ని నడిపే పెద్దల అభీష్టం మేరకే ఫైలు కదిలేది. సాగునీటి రంగంలో తెలంగాణ గోస

మనందరికి తెలిసిందే.

తెలంగాణ ఏర్పడిన వెంటనే సచివాలయ సాగునీటి శాఖ పని తీరుపై సమీక్ష జరిగింది. శాఖలో గడ్డకట్టుక పోయిన రెడ్ టేపిజాన్ని అంతం చేయడానికి టెక్నాలజీ సహాయాన్ని తీసుకోవాలని సంకల్పించినారు మంత్రి హరీశ్ రావు. ఫైళ్ళ పరిష్కారం కోసం పారదర్శక విధానం అమలులోనికి రావాలని మంత్రి ఆశించినారు. ఆ ఆలోచన ఫలితమే "ఫైల్ ట్రాకింగ్ సిస్టం". ఈ సిస్టం ద్వారా ఫైల్ ఏ స్థాయిలో ఎన్ని రోజులుగా పెండింగ్‌లో ఉన్నదో తెలుసుకునే వెసులుబాటు ఉండేది. ఫైలు పుట్టినప్పటి నుంచి అది మూసివేసే దాకా ఫైలు కదలికలని ఈ విధానం నమోదు చేస్తుంది. మంత్రి పేషి అధికారులు ఫైళ్ళ కదలికలను ఎప్పటికప్పుడు సమీక్షించి సెక్షన్ల పని తీరుని అంచనా వేసి మంత్రి నివేదించగలిగేవారు. సచివాలయంలో సాగునీటి శాఖలో ఫైల్ ట్రాకింగ్ విధానాన్ని ప్రవేశపెట్టిన తర్వాత ఫైళ్ళ కదలికలను మంత్రి పేషి నిశితంగా పరిశీలించగలిగింది. రెడ్ టేపిజానికి పాల్పడుతున్న అధికారులను హెచ్చరించేవారు. ఫైల్ ట్రాకింగ్ విధానం అద్భుతమైన ఫలితాలని ఇచ్చింది. ఫైల్ ట్రాకింగ్ విధానం ప్రవేశపెట్టిన కారణంగా రెండు దశల్లో కలుపుకొని మిషన్ కాకతీయ కార్యక్రమంలో చెరువుల పునరుద్ధరణ కోసం దాదాపు 300 జి ఒ లని ప్రభుత్వం జారీ చెయ్యగలిగింది. ప్రాజెక్టుల అనుమతుల ఫైళ్ళు గతంలో ఎన్నడూ లేనంత వేగంగా పరిష్కారం అయినాయి.

ఇది కేంద్రీకృతంగా పని చేసే విదానం. సాగునీటి శాఖ నుండి ఏ ప్రతిపాదన వచ్చినా ఇన్ వార్డ్ సెక్షన్లో బార్ కోడ్ నంబరు అతికిస్తారు. ఆ తర్వాత సెక్షన్‌కి వెళుతుంది. ప్రతీచోట చేరగానే బార్ కోడ్ ని స్కాన్ చేస్తారు. ఆ తర్వాత ఆ ఫైల్‌ని పైకి పంపేటప్పుడు మళ్ళీ స్కాన్ చేస్తారు. అంటే ఆ సెక్షన్ కి ఆ ఫైల్ ఏ రోజున, ఏ సమయాన వచ్చిందో, ఏ రోజున, ఏ సమయాన పై స్థాయికి వెళ్ళిందో కంప్యూటర్‌లో నమోదు అవుతుంది. అనుమతించిన అధికారులు ఎవరైనా ఈ ఫైల్ ట్రాకింగ్ ద్వారా ఫైల్ కదలికలని తెలుసుకునే వీలుంది. సచివాలయ శాఖలో రెడ్ టేపిజాన్ని గణనీయంగా కుదించి వేసింది. ఫైళ్ళ పరిష్కారంలో జరిగే జాప్యానికి వారే భాధ్యత వహించవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ కారణంగా సెక్షన్ అధికారుల్లో జవాబుదారీతనం పెరిగింది. ఇది సచివాలయ శాఖలో తెలంగాణ ఏర్పడిన మొదటి రెండేండ్లలో వచ్చిన మార్పు. అయితే దురదృష్టం ఏమిటంటే హరీష్ రావు గారు మంత్రిగా ఉన్నంత కాలం ఫైల్ ట్రాకింగ్ పద్దతి సజావుగా సాగింది. రెండవ టర్మ్‌లో ఆయన ఆర్థిక శాఖకు మారడంతో ఫైల్ ట్రాకింగ్ పద్ధతిని సచివాలయ ఉద్యోగులు నీరుగార్చారు. కొద్ది రోజుల్లోనే ఫైల్ ట్రాకింగ్ పద్దతి కనుమరుగయ్యింది.

### 20.5 మిషన్ కాకతీయ వెబ్ సైట్ :

మిషన్ కాకతీయ కార్యక్రమాన్ని ప్రభుత్వం ప్రకటించగానే దాన్ని ప్రతిష్టాత్మకంగా, అత్యంత

పారదర్శకంగా అమలు చెయ్యలని ప్రభుత్వం నిర్ణయించింది. దానికి టెక్నాలజీ సహకారాన్ని తీసుకోవాలని తలపోసింది. ఇంజనీర్లతో మేధోమథనం కొనసాగించింది. ఆ మేధోమథనంలో వెలువడిన ప్రధాన నిర్ణయం మిషన్ కాకతీయ కార్యక్రమం కోసమే ఒక ప్రత్యేకమైన వెబ్ సైట్ ఏర్పాటు చెయ్యడం. ఇది సాగునీటి శాఖ వెబ్ సైట్ తో అనుసంధానమై ఉంటుంది.

సాగునీటి శాఖ వెబ్ సైట్ : http://www.irrigation.telangana.gov.in/icad/home
మిషన్ కాకతీయ వెబ్ సైట్ : http://missionkakatiya.cgg.gov.in

మిషన్ కాకతీయ కార్యక్రమంలో పని చేసే ప్రతి ఒక్క ఇంజనీరుకి లాగిన్ అవటానికి వీలు కలిపించినారు. వారు తమ పరిధిలో ఉన్న చెరువుల సమస్త సమాచారాన్ని వెబ్ సైట్ లోనికి అప్ లోడ్ చేసేవారు. చెరువు వివరాలు, అంచనాలు, పరిపాలనా అనుమతుల జి ఒ లు, సాంకేతిక అనుమతులు, ఆన్ లైన్ టెండర్లు, కాంట్రాక్టర్లతో ఒప్పంద పత్రాలు, బిల్లుల చెల్లింపుల వివరాలు, పనుల పురోగతికి సంబందించి ఫోటోలు, వీడియోలు .. ఇట్లా చెరువుల పునరుద్దరణకు సంబందించి సమస్త వివరాలుఈ వెబ్ సైట్ లో పొందు పరిచేవారు. మిషన్ కాకతీయకు సంబందించి మొత్తం ప్రక్రియను ఆన్ లైన్ విధానంలోనికి మార్చడం జరిగింది. దీంతో మిషన్ కాకతీయ కార్యక్రమం ప్రాదర్శకంగా నిర్వహించడానికి వీలు కలిగింది.

ఈ వెబ్ సైట్ శాఖా ఇంజనీర్లకే కాదు ప్రజానీకం అందరికీ అందుబాటులో తేవడం ఒక గొప్ప మార్పు. భూగోళంపై ఎవరైనా ఎక్కడ నుంచి అయినా తెలంగాణ రాష్ట్రంలో చెరువుల పునరుద్దరణ జరుగుతున్న తీరుని తెలుసుకునే వీలు కలిగింది. చెరువుల వివారాలు, వాటికి మంజూరు అయిన డబ్బు, ఏ పనికి ఎంత డబ్బు కెటాయించింది, మిషన్ కాకతీయకు ప్రజల నుండి, సంస్థల నుండి వచ్చిన విరాళాల వివరాలు, వారి ఫోటోలు, వారికిచ్చిన ప్రశంసా పత్రాలు, చెరువులను దత్తత తీసుకోవడానికి అవసమయ్యే సమాచారం, ప్రభుత్వం ఎప్పటికప్పుడు జారీ చేస్తున్న మార్గదర్శకాలు, జి ఒ లు తదితర పత్రాలు ఈ వెన్ సైట్ లో పొందు పరచినారు. మిషన్ కాకతీయపై పత్రికల్లో అచ్చయిన కథనాలు, టీవీల్లో ప్రసారమైన కథనాలు, వీడియోలు, ఇంటర్వ్యూలు తదితరాలు ప్రజలకు అందుబాటులో ఉండేవి. సాగునీటి శాఖలో ఇదొక వినూత్న ప్రయోగం. మిషన్ కాకతీయ కార్యక్రమానికి దేశ విదేశాల నుంచి ప్రశంసలు అందడానికి ప్రభుత్వం అనుసరించిన ఈ పారదర్శక విధానాలే కారణం. దేశంలోని తతిమ్మ రాష్ట్రాలు కూడ ఈ కార్యక్రమాన్ని ఆదర్శంగా తీసుకోవాలని కేంద్ర ప్రభుత్వం సూచించింది.

### 20.6 తెలంగాణ జలవనరుల సమాచార వ్యవస్థ *(Telangana Water Resources Information System) :*

తెలంగాణ జలవనరుల వ్యవస్థ నిర్మాణం కోసం 6 ఆగస్ట్ 2016 న ఇస్రో(ISRO) తో సాగునీటి శాఖామంత్రి శీ హరీశ్ రావు, ఇస్రో చైర్మన్ శ్రీ కిరణ్ కుమార్ సమక్షంలో అవగాహన

కుదుర్చుకోవడం జరిగింది. ఇస్రోకు అనుబంధంగా పని చేస్తున్న నేషనల్ రిమోట్ సెన్సంగ్ సెంటర్ జలవనరుల వ్యవస్థ నిర్మాణంలో సాగునీటి శాఖతో కలిసి పని చేస్తుంది. తెలంగాణను కోటి ఎకరాల మాగాణిగా మార్చడానికి జరుగుతున్న మహత్తర కార్యక్రమంలో ఇదొక కీలక ఘట్టం. తెలంగాణ జలవనరులకు సంబంధించిన సమస్త, సమగ్ర సమాచారం ఇక అరచేతిలో ఉంటుంది. సమాచారం ఇంటర్నెట్లో నిరంతరం అప్ డేట్ అవుతూ ఉంటుంది. సాగునీటి వనరులు, ప్రాజెక్టులకు చెందిన సమస్త సమాచారం ప్రజలకు అందుబాటులో వుంటుంది. తెలంగాణ ప్రభుత్వ పారదర్శక పాలనకు ఇది అద్దం పడుతుంది. ఇలాంటి ప్రయత్నంతో తెలంగాణ రాష్ట్రం మరో ముందడుగు వేసింది. జలవనరుల సమగ్ర సమాచారం కోసం శాటిలైట్ సాంకేతిక సహకారం తీసుకున్న ఘనత తెలంగాణకే దక్కింది. తెలంగాణ జలవనరుల సమగ్ర సమాచార వ్యవస్థను ఇస్రోకు చెందిన ప్రతిష్టాత్మక వెబ్ పోర్టల్ 'భువన్' వేదికగా ఉపగ్రహ ఛాయా చిత్రాలను వాడుకోవాదానికి వెసులుబాటు ఏర్పడింది.

నేషనల్ రిమోట్ సెన్సింగ్ సెంటర్ రూపొందించిన తెలంగాణ జలవనరుల సమాచార వ్యవస్థ వల్ల డ్యామ్‌లు, బ్యారేజీలు, ఆనకట్టల, ప్రధాన కాలువలు, డిస్ట్రిబ్యూటరీలు, ఫీల్డ్ చానల్స్ ప్రతి సాగునీటి వనరును ' భువన్ ' విజువలైజ్ చేస్తుంది. ప్రాజెక్టుల వారీగా ఆయకట్టు వివరాలు, ప్రాజెక్టుల జలాశయాలలో నీటి నిల్వలు, ఆయకట్టు సర్వే నెంబర్లు, ఏయే పంటలు ఏ ఇరిగేషన్ వనరుల కింద పండిస్తున్నారు, ప్రాజెక్టు లొకేషన్, తదితర అన్ని వివరాలతో సమాచారాన్ని ఎప్పటికప్పుడు క్రోడీకరించడానికి ఇస్రోతో ఈ ఎంఓయూ ఉపయోగపడ్తుంది. చీఫ్ ఇంజనీర్ మొదలుకొని క్షేత్ర స్థాయిలో పని చేసే జూనియర్ ఇంజనీర్ వరకు ప్రతి స్థాయిలోనూ ఇంజనీర్లకు 'భువన్ ' రూపొందిస్తున్న సమాచార వ్యవస్థ బ్రహ్మాండంగా పనికొస్తుంది .

## 20.7 ఈ సమాచార వ్యవస్థ వలన అందే సమాచారం :

- చెరువుల, జలాశయాల ప్రదేశాలు, జలాశయాల నిల్వ సామర్థ్యం, ఎఫ్ ఆర్ ఎల్ ఇతర సంకేతిక వివరాలు
- చెరువుల్లో, ప్రాజెక్టుల జలాశయాల్లో నీటి నిల్వ ఎంత ఉందో ఖచ్చితంగా తెలుస్తుంది
- ప్రతీ ప్రాజెక్టు కింద ఎంత ఆయకట్టు సర్వే నంబర్ల వారీగా సాగులోనికి వచ్చింది, ఎంత లోటు ఉన్నది తెలుస్తుంది
- ఆయకట్టులో పంటలవారీగా భూమి విస్తీర్ణం ఎంతో తెలుస్తుంది
- ఆయకట్టులో భూగర్భజలాల పరిస్థితి

### 20.8 కాళేశ్వరం ప్రాజెక్టులో Decision Support System (DSS):

కాళేశ్వరం ప్రాజెక్టులో పంప్ హౌజులను, జలాశయాలను, కాలువలను సమర్థవంతంగా నిర్వహించడానికి అత్యాధునిక సాంకేతికతను ఉపయోగించడానికి కె సి ఆర్ ప్రభుత్వం సంకల్పించింది. Decision Support System కాళేశ్వరం ప్రాజెక్టు నిర్వాహణ కోసం అన్నీ కాంపొనెంట్స్ యొక్క సమగ్ర సమాచారం ఈ సపోర్ట్ సిస్టమ్‌లో అందుబాటులో ఉంటుంది. ఆ సమాచారం ఆధారంగా పంప్ హౌజులు, జలాశయాలు, కాలువల నిర్వాహణ సాధ్యం అవుతుంది. జలాశయాల్లో ఎంత నీరు ఉన్నది, ఆయకట్టులో ఎంత నీరు అవసరం ఉన్నది, భూగర్భ జలాల పరిస్తితి, వర్షపాతం, నదుల ద్వారా ఎంత పరిమాణంలో నీరు వస్తున్నది .. తదితర సమస్త సమాచారం ఈ సపోర్ట్ సిస్టమ్ ద్వారా అందుబాటులోకి రానున్నది. ఈ అత్యాధునిక సపోర్ట్ సిస్టమ్ ను తయారు చేయడానికి VASSAR Labs వారితో ప్రభుత్వం ఒప్పందం కుదుర్చుకున్నది. ఒప్పందం ప్రకారం ఈ డిసిషన్ సపోర్ట్ సిస్టమ్‌కు అవసరమయ్యే సాఫ్ట్ వేర్ లను, మొబైల్ యాప్స్‌ను తయారు చేయడంతో పాటూ 5 ఏళ్ల పాటు సపోర్ట్ సిస్టమ్ ను వారే నిర్వహిస్తారు. సాగునీటి శాఖ ఇంజనీర్లకు ఈ సాఫ్ట్ వేర్ నిర్వాహణపై, వినియోగంపై శిక్షణ కూడా ఇస్తారు.

ఇప్పటికే VASSAAR Labs వారు ఈ సపోర్ట్ సిస్టమ్ ను చాలా మట్టుకు అభివృద్ధి చేశారు. నవంబర్ 2020 నుంచి మొబైల్ యాప్‌ను వినియోగానికి అందుబాటులోకి తీసుకొచ్చారు. ఇటువంటి డెసిషన్ సపోర్ట్ సిస్టమ్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇప్పటికే వినియోగంలో ఉన్నది. ఇప్పుడు తెలంగాణా రాష్ట్రంలో కూడా ఈ సాంకేతికతను వినియోగంలోకి తీసుకురావాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సపోర్ట్ సిస్టమ్ తప్పకుండా కాళేశ్వరం లాంటి అతి పెద్ద ఎత్తిపోతల పథకాన్ని సమర్థవంతంగా నిర్వహించడానికి ప్రాజెక్టు ఇంజనీర్లకు తోడ్పాటునందిస్తుంది.

#### 20.8.1 డెసిషన్ సపోర్ట్ సిస్టమ్ లో ఉన్న ముఖ్యాంశాలు:

- పంప్ హౌజులు, జలాశయాలు, కాలువలు, చెరువులు, వర్షపాతం వివరాలు, నదుల ఇన్ ఫ్లో, భూగర్భ జలాల పరిస్తితి .. తదితర సమస్త సంబందిత వివరాలన్నీ ఒకే చోట అందుబాటులో ఉంటాయి.
- నదుల్లోకి వచ్చే నీటి పరిమాణాన్ని అంచనా వేయడానికి (Inflow Forecast) టూల్స్ ఈ సపోర్ట్ సిస్టమ్‌లో ఉంటాయి.
- వర్షపాతం, గాలిలో తేమ, గాలి వేగం తదితర వాతావరణ సంబందిత సమాచారాన్ని (Weather information & Forecast) కూడా ముందస్తుగా అంచనా వేయడానికి ఇందులో టూల్స్ ఉంటాయి.
- జలాశయాల్లో, చెరువుల్లో ఎంత నీరు ఉంది, ఎంత ఖాళీ ఉంది అన్న సమాచారాన్ని కూడా దీని ద్వారా తెలుసుకోవచ్చు.

- ఈ సాఫ్ట్ వేర్ కి అవసరమయ్యే సమాచారాన్ని సేకరించడానికి అన్నీ ప్రధాన నదుల మీద, ప్రాజెక్టులు, పంప్ హౌజుల ఈ సమాచారాన్ని విశ్లేషించి నిర్ణయాలు తీసుకోవడానికి ఒక సెంట్రల్ కమాండ్ సెంటర్, మూడు లోకల్ కమాండ్ సెంటర్లు ఏర్పాటు చేస్తారు.
- ప్రధాన నదులపై, ప్రాజెక్టులు, పంప్ హౌజుల వద్ద సెన్సార్లు ఏర్పాటు చేస్తారు.
- ప్రాజెక్టు ఇంజనీర్లు సమాచారాన్ని అందించడానికి, సమాచారాన్ని చూడటానికి ఒక మొబైల్ యాప్ కూడా అందుబాటులోకి తెచ్చారు. (Mobile App for Data Entry and Data View)
- ప్రాజెక్టు ఇంజనీర్లు మొబైల్ యాప్ ద్వారా ఇచ్చే సమాచారానికి అదనంగా భారత వాతావరణ శాఖ, యూరోపియన్ స్పేస్ ఏజెన్సీ వారు అందించే వాతావరణ సమాచారాన్ని, భూగర్భ జల శాఖ ఇచ్చే సమాచారాన్ని కూడా ఈ సపోర్ట్ సిస్టమ్ కు అనుసంధానం చేస్తారు.
- ఈ సమాచారం ఆధారంగా వారం రోజుల మరియు నెల రోజుల ముందస్తు వర్షపాతం, వరద ప్రవాహాల అంచనాలను రూపొందించడానికి, జలాశయాలు, పంప్ హౌజుల నిర్వాహణకు ఈ సమాచారం ఉపయోగపడుతుంది.

కాళేశ్వరం ప్రాజెక్టులో ఈ డిసిషన్ సపోర్ట్ సిస్టమ్ బాగా పని చేస్తున్నది.

## 21.0 తొమ్మిదేండ్లలో సాగునీటి ప్రగతి సూచికలు:

సాగునీటి రంగంలో ప్రగతిని, ఉమ్మడి రాష్ట్రంలో 2004 -14 వరకు పదేళ్ల పాలనలో జరిగిన ప్రగతితో పోల్చితే తప్ప వాస్తవాలు అర్థం కావు. ఉమ్మడి రాష్ట్ర పాలకుల హయంలో సాగునీటి ప్రాజెక్టుకు చేసిన ఖర్చు, సాధించిన ప్రగతి కింది పట్టికలో చూడవచ్చు

### 21.1 ప్రాజెక్టులపై నిధుల ఖర్చు

| ప్రాజెక్టు కేటగిరి | నిధుల ఖర్చు (కోట్లలో) | నిధుల ఖర్చు (కోట్లలో) |
|---|---|---|
| సంవత్సరం | 2004-2014 | 2014-2023 |
| మేజర్ | 43,952.35 | 1,67,643.77 |
| మీడియం | 2,855.31 | 1,208.05 |
| మైనర్ | 4,582.92 | 10,662 |
| ఇతర ఖర్చులు | 2,630.13 | 2,893.82 |
| మొత్తం | 54,020.71 | 1,82606.76 |

### 21.2 ఆయకట్టు సాధనలో వృద్ధి:

| ప్రాజెక్టు కేటగిరి | కొత్త ఆయకట్టు లక్షల ఎకరాలు | స్థిరీకరణ లక్షల ఎకరాలు | కొత్త ఆయకట్టు లక్షల ఎకరాలు | స్థిరీకరణ లక్షల ఎకరాలు |
|---|---|---|---|---|
| సంవత్సరం | 2004-2014 | 2004-2014 | 20014-22 | 2014-2023 |
| మేజర్ | 5.39 | 0.93 | 14.46 | 15.24 |
| మీడియం | 0.32 | 0.00 | 0.59 | 0.00 |
| మైనర్ | 0.00 | 0.00 | 0.60 | 15.06 |
| టీఎస్ఐడీసీ | 0.00 | 0.00 | 1.58 | 0.27 |
| మొత్తం | 5.71 | 0.93 | 17.23 | 30.57 |

### 21.3 పెరిగిన సాగు విస్తీర్ణం :

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన నాటి నుంచి ప్రభుత్వం అమలు చేస్తున్న కార్యక్రమాల వలన సాగులోనికి వస్తున్న భూవిస్తీర్ణం క్రమంగా పెరిగింది. సాగు విస్తీర్ణం పెరుగుదల వివరాలు లక్షల ఎకరాలలో

| సం | భారీంమధ్యతరహాంచెరువులు | | |
|---|---|---|---|
| | వానాకాలం (ఖరీఫ్ ) | యాసంగి (రబీ) | మొత్తం |
| 2016-17 | 25.05 | 22.73 | 47.78 |
| 2017-18 | 19.75 | 22.04 | 41.79 |
| 2018-19 | 34.39 | 13.76 | 48.14 |
| 2019-20 | 33.24 | 33.44 | 66.68 |
| 2020-21 | 52.00 | 37.46 | 89.46 |
| 2021-22 | 46.56 | 44.27 | 90.83 |

- ప్రాజెక్టులను పూర్తి చేసినందు వలన సాగునీటి సౌకర్యం పెరగడం, భూగర్భ జలాలు గణనీయంగా వృద్ధి కావడంతో ప్రాజెక్టుల కింద, బోరు బావుల కింద రాష్ట్రంలో సాగు విస్తీర్ణం పెరిగింది. 2020 సంవత్సరంలో సేకరించిన ధాన్యంలో 54 శాతం తెలంగాణ రాష్ట్రం నుంచే సేకరించామని భారత ఆహార సంస్థ ప్రకటించడం గమనార్హం.

### 21.4 రాష్ట్రంలో తాగునీటి కల్పన :

- రాష్ట్రంలోని అన్నీ గ్రామాల్లో, పట్టణాల్లో ఇంటింటికి స్వచ్ఛమైన తాగునీటిని నల్లా ద్వారా అందించాలన్న లక్ష్యంతో ప్రారంభించిన పథకం మిషన్ భగీరథ.
- మిషన్ భగీరథ కోసం రాష్ట్రంలో ఉన్న అన్నీ జలాశయాల్లో 10 శాతం నీటిని కేటాయించిది ప్రభుత్వం. గోదావరి బేసిన్లో 32.58 టిఎంసిలు, కృష్ణా బేసిన్‌లో 23.44 టిఎంసిలు మిషన్ భగీరథ పథకానికి ప్రభుత్వం కేటాయించింది. ఇవి రాష్ట్రానికి ట్రిబ్యునల్స్ ద్వారా కేటాయించిన నీటిలో నుంచే తాగునీటికి వినియోగించడం జరుగుతున్నది.
- జలాశయాల్లో నిర్ణీత కనీస మట్టాలను తప్పనిసరిగా కాపాడాలని ప్రభుత్వం ఆదేశించింది.
- మిషన్ భగీరథ పూర్తి అయి దేశ వ్యాప్తంగా గొప్ప పథకంగా ప్రశంసలు అందుకున్నది. ఎన్నో పురస్కాలను అందుకున్నది. దేశంలో వంద శాతం గ్రామాలకు సురక్షిత తాగునీటి సౌకర్యం కల్పించిన రాష్ట్రం తెలంగాణ అని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.

### 21.5 పంటల దిగుబడిలో వృద్ధి:

మార్కెటింగ్ శాఖ సేకరించిన వివరాలు పంటల ఉత్పత్తిలో వృద్ధి నిజంగా విస్తుగొలిపేలా ఉన్నాయి.

**(పంటల దిగుబడి వెయ్యి మెట్రిక్ టన్నుల్లో )**

| క్ర.సం | పంట రకం | 2015 -16 | 2016-17 | 2017 -18 | 2018-19 | 2019-20 | 2020-21 | 2021-22 | 2022-23 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వరి ధాన్యం | 4570.67 | 9898. 24 | 9394. 76 | 10002.95 | 18044.50 | 22249.83 | 20219.10 | 26285.62 |
| 2. | మక్కలు | 1751.07 | 2882.47 | 2752.14 | 2083.00 | 3738.35 | 1890.04 | 3004.33 | 2882.60 |
| 3. | కందులు | 104.84 | 262.23 | 263.75 | 191.40 | 271.48 | 342.27 | 241.68 | 182.38 |
| 4. | వేరు శనగ | 205.91 | 341.97 | 372.51 | 315.13 | 254.12 | 295.08 | 348.61 | 250.18 |

**(సోర్స్ : వ్యవసాయ & మార్కెటింగ్ శాఖ)**

### 21.6 చేపల ఉత్పత్తిలో వృద్ధి :

తెలంగాణా మత్స్య శాఖ 2018లో ప్రచురించిన నివేదిక చేపల ఉత్పత్తిలో గణనీయమైన వృద్ధిని సాధించిందని ధ్రువీకరించింది. ఈ కింది పట్టికలో మంచి నీటి చేపలు, ఉత్పత్తిలో వృద్ధిని గమనించవచ్చు

| కేటగిరి | 2016-17 | | 2020-21 | | ఉత్పత్తిలో పెరుగుదల టన్నులు |
|---|---|---|---|---|---|
| | ఉత్పత్తి టన్నులు | విలువ కోట్లు | ఉత్పత్తి టన్నులు | విలువ కోట్లు | |
| చేపలు | 1,93,732 | 1356.61 | 3,49,000 | 3,141.00 | 1,55,268 |

**(సోర్స్ : మత్స్య శాఖ)**

దీనికి రాష్ట్ర ప్రభుత్వం మిషన్ కాకతీయ కార్యక్రమంలో వేలాది చెరువులను పునరుద్దరించడం, అనేక సాగునీటి ప్రాజెక్టులను పూర్తి చెయ్యడం, రాష్ట్రం జలాశయాలను నిర్మించడం ప్రధాన కారణం అని నివేదిక పేర్కొన్నది. పూడికలు తీసి చెరువులను పునరుద్దరించడం వలన చెరువుల్లో 9-10 నెలల పాటు నీరు నిలువ ఉండే పరిస్థితి ఏర్పడిందని, దానితో చేపల పెరుగుదలకు అనుకూల పరిస్థితులు నెలకొన్నాయని నివేదిక పేర్కొన్నది. దానికి తోడు మత్స్య పరిశ్రమ అభివృద్దికి చేప పిల్లలను ఉచితంగా పంపిణీ చేయడం, మత్స్యకారులకు వలలు, వాహన సౌకర్యాలు కల్పించడం, ఆధునిక కేజ్ కల్చర్ పద్దతికి మత్స్యకారులను ప్రోత్సహించడం వంటి విధానపరమైన నిర్ణయాలు చేపల ఉత్పత్తి పెరగడానికి దోహదం చేసిందని, దీనితో మత్స్యకారుల ఆదాయాలు పెరిగాయని నివేదిక పేర్కొన్నది. ఇటీవల పార్లమెంట్ స్థాయి సంఘం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన నివేదిక ప్రకారం దేశంలో చేపల ఉత్పత్తిలో 65% మంచినీటి చేపల వ్యవసాయం ద్వారానే వస్తున్నదని పేర్కొన్నది. తెలంగాణలో 25 వేల జలాశయాలు ఉన్నాయని, వాటి ఉపరితల విస్తీర్ణం 5.73 లక్షల చదరపు కిలోమీటర్లు ఉన్న కారణంగా తెలంగాణా మంచినీటి చేపల ఉత్పత్తిలో 5 వ స్థానంలో నిలచిందని పార్లమెంట్ స్థాయీ సంఘం నివేదిక పేర్కొన్నది. తెలంగాణా ఏర్పాటుకు ముందు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రాధాన్యత అంతా కూడా సముద్ర చేపల ఉత్పత్తి మీదనే ఉన్నది తప్ప తెలంగాణలో విస్తారమైన మంచి నీటి చేపల ఉత్పత్తిపై దృష్టి సారించలేదు. తెలంగాణా రాష్ట్రం ఈ అవకాశాన్ని వినియోగించుకొని మంచి నీటి చేపల ఉత్పత్తిలో గణనీయమైన వృద్దిని సాధించగలిగింది. దానికి సాగునీటి శాఖ అభివృద్ధి చేసిన జలాశయాలు అధరువులుగా ఉన్నాయి.

### 21.7 భూగర్భ జలాల మట్టం పెరుగుదల:

భూగర్భ జలాల వృద్దిలో గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయని భూగర్భ జల శాఖ వారి అధ్యయనంలో తేలింది. భూగర్భ జల శాఖ వారు ప్రతీ జిల్లాలో మిషన్ కాకతీయ అమలవుతున్న ఒక

మైక్రో బేసిన్‌ని తమ అధ్యయనానికి ఎన్నుకున్నారు. కాళేశ్వరం ప్రాజెక్టు ప్రాంతంలో కూడా వారు అధ్యయనం కొనసాగించారు. భూగర్భ జలాలపై వీటి ప్రభావాలను అంచనా వేయడం జరిగింది. రాష్ట్రం భూగర్భజల మట్టం పెరుగుదల 2019 ఏప్రిల్ తో పోలిస్తే ఆశాజనంగా ఉన్నదని వారు తాజా నివేదికలో పేర్కొన్నారు. వర్షపాతానికి అదనంగా ప్రాజెక్టు ద్వారా వచ్చే నీరు వేలాది చెరువులని నింపిన కారణంగా భూగర్భజల మట్టం పెరుగుదలకు గణనీయంగా దోహదం చేశాయని వారు పేర్కొన్నారు. 2019 ఏప్రిల్ నేలతో పోలిస్తే ఏప్రిల్ 2023 నాటికి రాష్ట్రంలో సగటున 5.36 మీ పెరుగుదల నమోదు అయ్యింది. అత్యధికంగా మెదక్ జిల్లాలో 11.32 మీ పెరుగుదల నమోదు అయ్యింది. అత్యధికంగా చెరువులున్న మెదక్ జిల్లాలో మిషన్ కాకతీయ అమలు, ఈ చెరువులను కాళేశ్వరం జలాలతో నింపడం ఈ పెరుగుదలకు కారణంగా చెప్పవచ్చు. భూగర్భ జల మట్టాలు గణనీయంగా పెరిగిన కొన్నిజిల్లాల సమాచారం ఈ విధంగా ఉన్నది. ఇవన్ని ఒకప్పుడు కరువు జిల్లాలన్నది గమనించాలి.

**భూగర్భ నీటి మట్టం పెరుగుదల వివరాలు మీటర్లలో**

| జిల్లా | ఏప్రిల్ 2019 | ఏప్రిల్ 2023 | పెరుగుదల (మీ) |
|---|---|---|---|
| మెదక్ | 25.72 | 14.40 | 11.32 |
| సంగారెడ్డి | 23.47 | 12.75 | 10.72 |
| మహబూబ్ నగర్ | 19.21 | 8.76 | 10.45 |
| సిద్దిపేట | 20.04 | 10.41 | 9.63 |
| రంగారెడ్డి | 18.73 | 10.20 | 8.53 |
| యాదాద్రి | 15.39 | 7.62 | 7.77 |
| రాజన్న సిరిసిల్ల | 17.78 | 10.44 | 7.34 |
| నల్లగొండ | 14.89 | 7.58 | 7.31 |

**(సోర్స్ : భూగర్బ జల శాఖ)**

### 21.8 రైతుల ఆత్మహత్యల్లో తగ్గుదల :

2016 లో నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో వారు విడుదల చేసిన నివేదికలను పరిశీలిస్తే తెలంగాణా రాష్ట్రంలో రైతుల ఆత్మహత్యలు 54 శాతం తగ్గినట్టు తెలుస్తున్నది. ఒక వైపు పంజాబ్, హర్యానా, కర్నాటక వంటి రాష్ట్రాల్లో రైతుల ఆత్మహత్యలు పెరుగుతుంటే తెలంగాణాలో సగానికి తగ్గడం గమనార్హం. 2022 నాటికి వ్యావసాయిక సంక్షోభం కారణంగా రైతులు ఆత్మహత్యలకు పాల్పడిన సంఘటనలు పత్రికల్లో నమోదు కావడం లేదు. 90% సాగునీటి సౌకర్యం ఉన్న పంజాబ్ లో, 80% సాగునీటి సౌకర్యం ఉన్న హర్యానాలో రైతుల ఆత్మహత్యల రేటు పెరుగుతున్నది. సాగునీటి సౌకర్యాల కల్పన ఒక్కటే రైతుల ఆత్మహత్యలను నివారించలేదని విశ్లేషకులు భావిస్తున్నారు. సాగునీటి కల్పనతో పాటూ రైతులకు ఆదాయం పెంచే చర్యలు చేపట్టడం, రుణ పరపతి సౌకర్యం, పంటలకు మార్కెటింగ్ సౌకర్యం, పంటలకు గిట్టుబాటు ధరలు కల్పించడం .. మొదలైన విధానపరమైన చర్యలు చేపట్టడం అవసరమని విశ్లేషకులు భావిస్తున్నారు. సాగునీటి సౌకర్యాల కల్పనతో పాటూ రైతు బంధు పథకం, రైతు భీమా పథకం, రుణ మాఫీ, వ్యవసాయానికి 24 గంటల ఉచిత కరెంటు, రైతుల పంటలకు మెరుగైన మార్కెటింగ్ సౌకర్యాలు, గిట్టుబాటు ధరలు కల్పించడం లాంటి చర్యలు తెలంగాణలో రైతుల ఆత్మహత్యలు తగ్గడానికి దోహదం చేసినాయని వ్యవసాయ నిపుణులు విశ్లేషిస్తున్నారు. ఇవన్ని రైతుకు బతకడానికి భరోసాను ఇచ్చాయి.

### 22.0. ఉపసంహారం :

తెలంగాణ ప్రభుత్వం చేపట్టిన సాగునీటి ప్రాజెక్టుల ద్వారా గడచిన ఐదేండ్లలో సాగునీటి రంగంలో గొప్ప విజయాలు చేకూరినాయి. తెలంగాణా ప్రజల సాగునీటి ఆకాంక్షలు నెరవేరే దారిలో ప్రాజెక్టుల పురోగతి సాగుతున్నది. తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ మార్గనిర్దేశనంలో సాగునీటి శాఖ ముందుకు సాగింది. మానవాభివృద్ది సూచికలలో అగ్రగామిగా నిలచింది. గత 9 ఎండ్లలో ప్రభుత్వం చేసిన పనులు ప్రజల అనుభవంలోకి వచ్చినాయి.

2023 వరకు తెలంగాణలో రైతుల ఆత్మహత్యలు లేవు. మహిళలకు తాగు నీటి గోస లేదు. బోరు బావుల కింద వ్యవసాయం చేసే రైతులకు కరెంటు కష్టాలు లేవు. కరువులు లేవు, ఉపాధి కోసం వలసలు లేవు, వలసలు పోయిన వారు గ్రామాల్లోకి తిరిగి వచ్చి వ్యవసాయం చేసుకుంటున్నారు. ఒకప్పుడు "తెలంగాణలో వ్యవసాయం దండుగ" అన్న స్థితి "తెలంగాణలో వ్యవసాయం ఒక పండుగ" లా మారింది.

ఇప్పటికే ప్రాజెక్టుల కింద, బోరుబావుల కింద ఒక కోటి 35 లక్షల ఎకరాలు సాగులో ఉన్నాయి. గ్రామీణ నియోజకవర్గాలలో అన్ని సోర్సుల ద్వారా ఒక లక్ష ఎకరాలకు సాగునీరు ఇస్తామన్న వాగ్దానం

నెరవేరింది. "మా తెలంగాణ కోటి ఎకరాల మాగాణం" అన్న ఉద్యమ నినాదం తొమ్మిదేండ్లలోనే నిజం అయ్యింది.

ఈ సాగునీటి పథకాలన్నీ రాష్ట్ర సమగ్ర ఆర్థిక ప్రగతికి దోహదం చేసినాయి. తెలంగాణ ప్రభుత్వం తన శక్తి సామర్థ్యాలను, ప్రకృతి వనరులను, మానవ నిర్మిత వనరులను అత్యంత సృజనాత్మకంగా వినియోగం చేసింది. సాగునీటి రంగం అపూర్వంగా వికాసం చెంది రాష్ట్ర సమగ్రాభివృద్ధికి దోహదం చేసింది. ఈ సందర్భంలో 2011 లో జాతీయ అభివృద్ధి మండలి (National Development Council) తమ పదకొండవ ప్రణాళికా నివేదికలో కొత్త రాష్ట్రాలైన ఉత్తరాఖండ్, ఝార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్‌లు తమ మాతృ రాష్ట్రాలతో పోల్చినప్పుడు Gross State Domestic Product పెరుగుదలపై ఈ విధంగా వ్యాఖ్యానించింది.

" అభివృద్ధి చెందడానికి కావలసిన వనరులు, శక్తి సామర్థ్యాలు ఉన్నప్పటికీ అవి అణిగిపోయి ఉండటం వలన ఈ ప్రాంతాలు వెనుకబడి పోయినాయి. ఈ ప్రాంతాలు రాష్ట్రాలుగా ఏర్పడగానే వీటిల్లోని సహజంగా నిబిడీకృతమై ఉన్న సమస్త సృజనాత్మక శక్తులు వికాసం చెంది ప్రజలని కార్యోన్ముఖులని కావించాయి. తమ ప్రాంత అభివృద్ధికి ప్రణాళికా బద్ధమైన పరిపాలనా కూడా బయటి పెట్టుబడులని రాష్ట్రంలోకి ఆకర్షించి ఆర్థిక ప్రగతికి దోహదం చేసి ఉంటుంది. వనరుల వినియోగం కూడా అందుకు ఊతం ఇచ్చింది."

ఈ వ్యాఖ్యానం తెలంగాణకూ అక్షరాలా వర్తిస్తుంది. తెలంగాణ ప్రభుత్వం తన శక్తి సామర్థ్యాలను, ప్రకృతి వనరులను, మానవ నిర్మిత వనరులను అత్యంత సృజనాత్మకంగా వినియోగం చేసింది. సాగునీటి రంగంలో పైన పేర్కొన్న ప్రగతి సూచికలు, ఇటీవల రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా విడుదల చేసిన గణాంక వివరాలు రాష్ట్ర వికాసానికి, ప్రగతికి సాక్షులుగా నిలుస్తున్నాయి. సాగునీటి రంగం అపూర్వంగా వికాసం చెంది రాష్ట్ర సమగ్రాభివృద్ధికి దోహదం చేసింది. అందుకు తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ దార్శనికత, సంకల్ప బలం ముందుచూపుతో అమలు చేసిన ప్రణాళికలు, విధానాలు తోడైనాయి.

* * * * *

# తెలంగాణ ప్రాజెక్టుల వివరాలు

తెలంగాణ రాష్ట్రం లోని భారీ, మధ్య తరహా ప్రాజెక్టులు మరియు చిన్న నీటి వనరుల కు సంబంధించిన ఖర్చు, తద్వారా కొత్తగా సాకులోకి వచ్చిన ఆయకట్టు వివారాలు క్రింది విధంగా ఉన్నాయి.

| క్ర.సం | ప్రాజెక్టు పేరు / జిల్లా | పరిపాలన అనుమతులు ఇచ్చిన సంవత్సరం | అంచనా విలువ కోట్లల్లో | ఆయకట్టు వివరాలు ఎకరాల్లో | |
|---|---|---|---|---|---|
| | | | | ప్రతిపాదిత ఆయకట్టు | సాగులోకి వచ్చిన ఆయకట్టు |
| 1 | ఏ.ఎం.ఆర్.ఎస్.ఎల్.బి.సి. ప్రాజెక్టు / నల్గొండ | 1983 | 3733.40 | 4,11,572 | 2,85,286 |
| 2 | డిండి ఎత్తిపోతల పథకం/నల్గొండ | 2016 | 2610.27 | 3,61,000 | 0 |
| 3 | అలీసాగర్ ఎత్తిపోతల పథకం/నిజామాబాద్ | 2005 | 9.57 | 0 | 0 |
| 4 | ఎ.ఆర్.ఆర్. గుత్ప ఎత్తిపోతల/ నిజామాబాద్ పథకం | 2005 | 8.86 | 0 | 0 |
| 5 | దేవాదుల ఎత్తిపోతల పథకం/ వరంగల్ | 2004 | 6594.35 | 5,58,722 | 3,68,000 |
| 6 | సీతారామ ఎత్తిపోతల పథకం/ భద్రాద్రి/ఖమ్మం | 2017 | 8067.44 | 3,87,859 | 0 |
| 7 | భక్త రామదాసు ఎత్తిపోతల పథకం/ఖమ్మం | 2016 | 199.16 | 0 | 0 |
| 8 | ప్రాణహిత ప్రాజెక్టు (వార్ధా ప్రాజెక్టులో భాగం /ఆసిఫాబాద్ | 2008 | 1454.11 | 2,00,000 | 0 |
| 9 | కాళేశ్వరం ప్రాజెక్టు/భూపాలపల్లి | 2008 | 89199.26 | 18,25,700 | 1,62,144 |
| 10 | ఎస్.ఆర్.ఎస్.పి స్టేజ్-××/ సూర్యాపేట | 1998 | 309.00 | 3,97,949 | 3,81,129 |
| 11 | ఎ. శ్రీపాద సాగర్ ఎత్తిపోతల పథకం/కరీంనగర్<br>చిన్నకాళేశ్వరం ఎత్తిపోతల పథకం/పెద్దపల్లి | 2005<br>2008 | 1430.29 | 1,78,808<br>45,280 | 54,342<br>0 |

| 12 | ఇందిరమ్మ వరద కాలువ<br>ఎస్.ఆర్.ఎస్.పి. నుండి/<br>కరీంనగర్ | 2006 | 6376.55 | 2,52,889 | 50,300 |
|---|---|---|---|---|---|
| 13 | మహాత్మా గాంధి కల్వకుర్తి<br>ఎత్తిపోతల పథకం/<br>నాగర్ కర్నూల్ | 2005 | 2543.81 | 4,24,816 | 3,07,000 |
| 14 | కోయిల్ సాగర్/వనపర్తి | 2005 | 251.19 | 50,250 | 38,250 |
| 15 | రాజీవ్ భీమ ఎత్తిపోతల పథకం<br>సంగం బండ బ్యాలెన్సింగ్<br>రిజర్వాయర్ కలుపుకొని/ | 2005 | 760.84 | 2,03,000 | 1,58,000 |
| 16 | జవహార్ నెట్టెంపాడు ఎత్తిపోతల పథకం | 2005 | 641.15 | 2,00,000 | 1,42,000 |
| 17 | ఎం. బాగారెడ్డి సింగూర్ ప్రాజెక్టు,<br>కాలువలు/సంగారెడ్డి | 2006 | 301.58 | 40,000 | 40,000 |
| 18 | సమ్మక్క సాగర్<br>(తుపాకులగూడెం బ్యారేజి)/ములుగు | 2013 | 1974.26 | 0 | 0 |
| 19 | పాలమూరు రంగారెడ్డి ఎత్తిపోతల<br>పథకం/నాగరకర్నూల్ | 2016 | 23107.55 | 12,30,000 | 0 |
| 20 | ఎ. లోయర్ పెన్ గంగ/ఆదిలాబాద్<br>బి. చనాకా – కోరాట బ్యారేజి/<br>ఆదిలాబాద్ | 2011<br><br>2016 | 946.59 | 37,300<br><br>13,500 | 0<br><br>0 |
| 21 | నిజాంసాగర్ ప్రాజెక్టు/నిజామాబాద్<br>నిజాంసాగర్ ఆధునీకరణ<br>ప్రాజెక్టు/నిజామాబాద్ | <br><br>2008 | 558.78 | 231338<br><br>0 | 2,31,338<br><br>0 |
| 22 | ఎ. తుమ్మిళ్ళ ఎత్తిపోతలు/గద్వాల<br>బి. రాజోలిబండ డైవర్షన్ స్కీం/గద్వాల | 2017<br>2014 కు<br>ముందున్న ప్రాజెక్టు | 219.44 | 87,500 | 87,500 |
| 23 | శ్రీరాంసాగర్ ప్రాజెక్టు/నిజామాబాద్ | 2014 కు<br>ముందున్న ప్రాజెక్టు | 2021.31 | 9,68,640 | 9,68,640 |
| 24 | కడెం ప్రాజెక్టు/నిర్మల్ | 2014 కు<br>ముందున్న ప్రాజెక్టు | 44.50 | 68,150 | 68,150 |
| 25 | జూరాల ప్రాజెక్టు/వనపర్తి | 2014 కు<br>ముందున్న ప్రాజెక్టు | 386.09 | 1,04,741 | 1,04,741 |
| 26 | నాగార్జున సాగర్ ప్రాజెక్టు/నల్గొండ | 2014 కు<br>ముందున్న ప్రాజెక్టు | 1802.46 | 6,40,814 | 6,40,814 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | నాగార్జున సాగర్ ఆధునీకరణ ప్రాజెక్టు/నల్గొండ, ఖమ్మం | 2008 | | | 0 |
| 27 | గట్టు ఎత్తిపోతల పథకం/ మహబూబ్ నగర్ | నిర్మాణం కాలేదు | | 28,000 | 0 |
| 28 | సీతమ్మసాగర్ ఎత్తిపోతల పథకం/భద్రాద్రి | 2021 | 1093.24 | | 0 |
| 29 | కుప్టి ప్రాజెక్టు | నిర్మాణం కాలేదు | | | 0 |
| 30 | మూసి ప్రాజెక్టు/నల్గొండ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 40.19 | 31,428 | 31,428 |
| | దుమ్ముగూడెం నాగార్జునసాగర్ టెయిల్ పాండ్ (రద్దు అయినది) | 2007 | 0.77 | | 0 |
| | రాజీవ్ సాగర్ దుమ్ముగూడెం ఎత్తిపోతల పథకం (సీతమ్మసాగర్ లో భాగం) | 2007 | 17.32 | 0 | 0 |
| | ఇందిరా రుద్రంకోట దుమ్ముగూడెం ఎత్తిపోతల పథకం– సీతమ్మసాగర్ లో భాగం(రు. 1824 కోట్లలో తెలంగాణ వాటా) | 2007 | 0.55 | 0 | 0 |
| | భారీ ప్రాజెక్టుల మొత్తం | | 1,56,703.88 | 89,79,256 | 40,57,627 |
| 31 | కిన్నెరసాని రిజర్వాయర్ స్కీం/ఖమ్మం | 2004 | 5.48 | 10,000 | 10,000 |
| 32 | పాలెంవాగు/వరంగల్ | 2005 | 13.55 | 10,132 | 7,000 |
| 33 | మోడికుంట వాగు/ములుగు | 2006 | 6.11 | 13,591 | 0 |
| 34 | గొల్లవాగు/మంచిర్యాల | 2004 | 18.70 | 9,500 | 9,500 |
| 35 | రాలివాగు/మంచిర్యాల | 2004 | 7.32 | 2,480 | 2,480 |
| 36 | నీల్వాయి / ఆసిఫాబాద్ | 2011 | 88.91 | 13,000 | 8,000 |
| 37 | శ్రీ కొమరం భీం /ఆసిఫాబాద్ | 2005 | 318.64 | 45,500 | 23,000 |
| 38 | పెద్దవాగు జగన్నాథ్ పూర్ ప్రాజెక్టు/ఆసిఫాబాద్ | 2005 | 106.42 | 15,000 | 0 |
| 39 | మత్తడివాగు/ఆదిలాబాద్ | 2004 | 6.26 | 8,500 | 8,500 |
| 40 | గడ్డెన్న – సుద్దవాగు ప్రాజెక్టు/నిర్మల్ | 1998 | 33.11 | 14,000 | 14,000 |
| 41 | సదర్మట్ బ్యారేజి/నిర్మల్ | 2017 | 277.85 | 5,618 | 0 |
| 42 | చౌటుపల్లి హన్మంతరెడ్డి/ నిజామాబాద్ ఎత్తిపోతల పథకం | 2005 | 21.09 | 8,297 | 8,297 |

| 43 | లెండి ప్రాజెక్టు/నిజామాబాద్ | 2005 | 1.56 | 22,000 | 0 |
|---|---|---|---|---|---|
| 44 | పాకాల/ములుగు<br>2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.71 | 18,193 | 18,193 | |
| 45 | పోచారం ప్రాజెక్టు/కామారెడ్డి | 2014కు ముందున్న ప్రాజెక్టు | 3.6 | 10,500 | 10,500 |
| 46 | రామప్ప/ములుగు | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 1.49 | 5,180 | 5,180 |
| 47 | కౌలస్ నాలా/నిజామాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 16.4 | 9,000 | 9,000 |
| 48 | స్వర్ణ / నిర్మల్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 41.10 | 8,945 | 8,945 |
| 49 | నల్లవాగు/సంగారెడ్డి | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 6.35 | 6,030 | 6,030 |
| 50 | వట్టివాగు/ఆసిఫాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 3.11 | 24,500 | 24,500 |
| 51 | బొగ్గులవాగు/కరీంనగర్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.09 | 5,150 | 5150 |
| 52 | అప్పర్ మానేర్/సిరిసిల్లా | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 3.8 | 13,086 | 13,086 |
| 53 | రామడుగు/నిజామాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 7.21 | 7,000 | 7,000 |
| 54 | లక్నవరం/ములుగు | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.45 | 8,794 | 8,794 |
| 55 | ఘనపూర్ ఆనకట్ట/మెదక్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 91.50 | 21,625 | 21,625 |
| 56 | శనిగరం /సిద్దిపేట | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 19.72 | 5,100 | 5100 |
| 57 | పి.పి. రావు ప్రాజెక్టు/మంచిర్యాల | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 4.67 | 11,150 | 11,150 |
| 58 | ఎల్.టి.బయ్యారం / మహబూబాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 1.76 | 7,350 | 7,350 |
| 59 | ఎన్.టి.ఆర్.సాగర్/ఆసిఫాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 6.26 | 6,000 | 6,000 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 60 | తాలిపేరు ప్రాజెక్టు/ఖమ్మం | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 6.28 | 24,700 | 24,700 |
| 61 | సాత్నాలా/ఆదిలాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 30.69 | 24,000 | 24,000 |
| 62 | కోటిపెల్లివాగు/వికారాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 9,200 | 9,200 |
| 63 | లంకాసాగర్/ఖమ్మం | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 7,350 | 7,350 |
| 64 | మల్లూరువాగు/ఖమ్మం | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 7,500 | 7,500 |
| 65 | వైరా ప్రాజెక్ట్/మహబూబాబాద్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 17,390 | 17,390 |
| 66 | డిండి ప్రాజెక్టు/నల్గొండ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.26 | 12,500 | 12,500 |
| 67 | సదర్‌మట్ ఎడమ వైపు ఖానాపూర్ కాలువ/నిర్మల్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 6,848 | 6,848 |
| 68 | ఆసిఫ్ నహర్/నల్గొండ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.11 | 15,246 | 15,246 |
| 69 | గుండ్లవాగు/వరంగల్ | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.11 | 2,580 | 2,580 |
| 70 | ముక్కమామిడి/ఖమ్మం | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0 | 3,260 | 3,260 |
| 71 | పెద్దవాగు/ఖమ్మం | 2014 కు ముందున్న ప్రాజెక్టు | 0.35 | 2,360 | 2,360 |
| | | మధ్య తరహా ప్రాజెక్టుల మొత్తం | 954.51 | 4,78,155 | 3,91,314 |
| | చిన్న నీటి వనరులు (46531 చెరువులు) | 2015 | 10,673.24 | 25,71,000 | 25,12,000 |
| | చిన్న ఎత్తిపోతల పథకాలు (ఐ.డి.సి.) | | | 5,05,000 | 4,76,000 |
| | మొత్తం | | 1,68,331.63 | 1,25,33,411 | 75,10,000 |

# నియోజకవర్గాల వారిగా ఆయకట్టు వివరాలు
# Constituency wise Ayacut Details

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Achampet (SC) | Mahatma Gandhi Kalwakurthy LIS | 66,235 | 45,390 |
| | | Palamuru Rangareddy LIS | 2,675 | 0 |
| | | Sri Ramaraju Vidyasagar Rao Dindi LIS | 14,430 | 0 |
| **Total Achampet (SC) Ayacut (Major & Medium)** | | | **83,340** | **45,390** |
| **Total Achampet (SC) Ayacut (Minor)** | | | **27,566** | **27,566** |
| **Grand Total Achampet (SC) Ayacut** | | | **1,10,906** | **72,956** |
| | Adilabad | Lower Penganga | 39,894 | 0 |
| | | Mathadivagu Project | 4,439 | 4,439 |
| | | Kupti Project | | |
| | | Sathnala Lake | 24,000 | 24,000 |
| **Total Adilabad (SC) Ayacut (Major & Medium)** | | | **68,333** | **28,439** |
| **Total Adilabad (SC) Ayacut (Minor)** | | | **9,872** | **9,872** |
| **Grand Total Adilabad (SC) Ayacut** | | | **78,205** | **38,311** |
| | Alair | J Chokka Rao Devedula LIS | 46,385 | 12,000 |
| | | Kaleshwaram Project | 1,54,101 | 0 |
| **Total Alair Ayacut (Major & Medium)** | | | **2,00,486** | **12,000** |
| **Total Alair Ayacut (Minor)** | | | **19,782** | **19,782** |
| **Grand Total Alair Ayacut** | | | **2,20,268** | **31,782** |
| | Alampur (SC) | Jawahar Nettampadu LIS | 78,361 | 46,111 |
| | | Priyadarshini Jurala Project | 23,741 | 23,741 |
| | | Rajolibanda Diversion Scheme (RDS) | 83,989 | 83,989 |
| **Total Almpur (SC) Ayacut (Major & Medium)** | | | **1,86,091** | **1,53,841** |
| **Total Alampur (SC) Ayacut (Minor)** | | | **4,993** | **4,993** |
| **Grand Total Alampur (SC) Ayacut** | | | **1,91,084** | **1,58,834** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Andole (SC) | Kaleshwaram Project | 1,36,129 | 0 |
| | | Singur Project | 37,628 | 33,208 |
| **Total Andole (SC) Ayacut (Major & Medium)** | | | **1,73,757** | **33,208** |
| **Total Andole (SC) Ayacut (Minor)** | | | **37,668** | **37,668** |
| **Grand Total Andole (SC) Ayacut** | | | **2,11,425** | **70,876** |
| | Armur | Alisagar LIS | 0 | 0 |
| | | Arugula Rajaram - Guthpa LIS | 0 | 0 |
| | | Kaleshwaram Project | 1,876 | 0 |
| | | Nizam Sagar Project | 61,932 | 41,603 |
| **Total Armur Ayacut (Major & Medium)** | | | **63,808** | **41,603** |
| **Total Armur Ayacut (Minor)** | | | **16,705** | **16,705** |
| **Grand Total Armur Ayacut** | | | **80,513** | **58,308** |
| | Asifabad (ST) | Chelmelavagu Project (NTR Sagar) | 6,000 | 6,000 |
| | | Pranahita Project | 11,007 | 0 |
| | | Vattivagu Project | 24,500 | 24,500 |
| | | Sri Komaram Bheem Project | 45,500 | 23,000 |
| **Total Asifabad (ST) Ayacut (Major & Medium)** | | | **87,007** | **53,500** |
| **Total Asifabad (ST) Ayacut (Minor)** | | | **46,640** | **46,640** |
| **Grand Total Asifabad (ST) Ayacut** | | | **1,33,647** | **1,00,140** |
| | Aswaraopeta (ST) | Peddavagu Project | 2,360 | 2,360 |
| | | Sitarama LIS | 1,06,653 | 0 |
| **Total Aswaraopeta (ST) Ayacut (Major & Medium)** | | | **1,09,013** | **2,360** |
| **Total Aswaraopeta (ST) Ayacut (Minor)** | | | **40,247** | **40,247** |
| **Grand Total Aswaraopeta (ST) Ayacut** | | | **1,49,260** | **42,607** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Balkonda | Arugula Rajaram - Guthpa LIS | 0 | 0 |
| | | Choutapally Hanumanthareddy LIS | 8,297 | 8,297 |
| | | Kaleshwaram Project | 71,262 | 0 |
| | | Nizam Sagar Project | 5,519 | 2,919 |
| | | Ramadugu Project | 2,790 | 1,893 |
| | | Sri Ram Sagar Project Stage - I | 35,070 | 35,070 |
| **Total Balkonda Ayacut (Major & Medium)** | | | **1,22,938** | **48,179** |
| **Total Balkonda Ayacut (Minor)** | | | **24,436** | **24,436** |
| **Grand Total Balkonda Ayacut** | | | **1,47,374** | **72,615** |
| | Banswada | Jakora & Chandoor Lift Irrigation Scheme | 10,985 | 0 |
| | | Kaleshwaram Project | 7,300 | 0 |
| | | Nizam Sagar Project | 68,522 | 68,522 |
| **Total Banswada Ayacut (Major & Medium)** | | | **86,807** | **68,522** |
| **Total Banswada Ayacut (Minor)** | | | **28,391** | **28,391** |
| **Grand Total Banswada Ayacut** | | | **1,15,198** | **96,913** |
| | Bellampalli (SC) | Pranahita Project | 60,257 | 0 |
| | | Nilwai Project | 10,679 | 7,027 |
| **Total Bellampalli (SC) Ayacut (Major & Medium)** | | | **70,936** | **7,027** |
| **Total Bellampalli (SC) Ayacut (Minor)** | | | **43,875** | **43,875** |
| **Grand Total Bellampalli (SC) Ayacut** | | | **1,14,811** | **50,902** |
| | Bhadrachalam (ST) | Gundlavagu Project | 2,580 | 2,580 |
| | | Modikuntavagu Project | 13,591 | 0 |
| | | Palemvagu Project | 10,132 | 7,500 |
| | | Taliperu Project | 24,700 | 24,700 |
| **Total Bhadrachalam (ST) Ayacut (Major & Medium)** | | | **51,003** | **34,780** |
| **Total Bhadrachalam (ST) Ayacut (Minor)** | | | **25,602** | **25,602** |
| **Grand Total Bhadrachalam (ST) Ayacut** | | | **76,605** | **60,382** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Bhongir | Asif Nahar Project | 1,150 | 1,150 |
| | | Kaleshwaram Project | 80,589 | 0 |
| **Total Bhongir Ayacut (Major & Medium)** | | | **81,739** | **1,150** |
| **Total Bhongir Ayacut (Minor)** | | | **24,211** | **24,211** |
| **Grand Total Bhonir Ayacut** | | | **1,05,950** | **25,361** |
| | Bhupalpalle | J Chokka Rao Devedula LIS | 30,000 | 4,000 |
| | | Sri Ram Sagar Project Stage - I | 72,443 | 71,540 |
| **Total Bhupalpalle Ayacut (Major & Medium)** | | | **1,02,443** | **75,540** |
| **Total Bhupalpalle Ayacut (Minor)** | | | **49,936** | **49,936** |
| **Grand Total Bhupalpalle Ayacut** | | | **1,52,379** | **1,25,476** |
| | Boath (ST) | Lower Penganga | 11,106 | 0 |
| | | Mathadivagu Project | 4,061 | 4,061 |
| **Total Boath (ST) Ayacut (Major & Medium)** | | | **15,167** | **4,061** |
| **Total Boath (ST) Ayacut (Minor)** | | | **48,844** | **48,844** |
| **Grand Total Boath (ST) Ayacut** | | | **64,011** | **52,905** |
| | Bodhan | Alisagar LIS | 0 | 0 |
| | | Nizam Sagar Project | 73,392 | 73,392 |
| **Total Bodhan Ayacut (Major & Medium)** | | | **73,392** | **73,392** |
| **Total Bodhan Ayacut (Minor)** | | | **20,651** | **20,651** |
| **Grand Total Bodhan Ayacut** | | | **94,043** | **94,043** |
| | Chennur SC | Gollavagu Project | 9,511 | 9,511 |
| | | Pranahitha Project | 76,592 | 973 |
| **Total Chennur (SC) Ayacut (Major & Medium)** | | | **86,103** | **10,484** |
| **Total Chennur (SC) Ayacut (Minor)** | | | **33,529** | **33,529** |
| **Grand Total Bodhan Ayacut** | | | **1,19,632** | **44,013** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Chevella (SC) | Palamuru Rangareddy LIS | 1,24,713 | 0 |
| **Total Chevella (SC) Ayacut (Major & Medium)** | | | **1,24,713** | **0** |
| **Total Chevella (SC) Ayacut (Minor)** | | | **8,734** | **8,734** |
| **Grand Total Chevella (SC) Ayacut** | | | **1,33,447** | **8,734** |
| | Chopadandi (SC) | Flood Flow Canal from SRSP | 28,260 | 550 |
| | | Sri Ram Sagar Project Stage - I | 13,362 | 13,362 |
| | | Sripada Sagar (Yellampally) LIS | 70,465 | 17,815 |
| **Total Choppadandi (SC) Ayacut (Major & Medium)** | | | **1,12,087** | **31,727** |
| **Total Choppadandi (SC) Ayacut (Minor)** | | | **23,290** | **23,290** |
| **Grand Total Choppdandi (SC) Ayacut** | | | **1,35,377** | **1,35,377** |
| | Devarakonda (ST) | Alimineti Madhava Reddy Project | 36,263 | 32,467 |
| | | Dindi Project | 12,975 | 12,975 |
| | | Palamuru Rangareddy LIS | 23,038 | 0 |
| | | Sri Ramaraju Vidyasagar Rao Dindi LIS | 1,01,220 | 0 |
| **Total Devarakonda (ST) Ayacut (Major & Medium)** | | | **1,73,496** | **45,442** |
| **Total Devarakonda (ST) Ayacut (Minor)** | | | **20,018** | **20,018** |
| **Grand Total Devarakonda( ST) Ayacut** | | | **1,93,514** | **65,460** |
| | Devarkadra | Koilsagar LIS | 18,775 | 15,744 |
| | | Mahatma Gandhi Kalwakurthy LIS | 9,978 | 1,200 |
| | | Palamuru Rangareddy LIS | 42,724 | 0 |
| | | Priyadarshini Jurala Project | 3,911 | 3,911 |
| | | Rajiv Bhima LIS | 25,725 | 21,101 |
| **Total Devarkadra Ayacut (Major & Medium)** | | | **1,01,113** | **41,956** |
| **Total Devarkadra Ayacut (Minor)** | | | **41,944** | **41,944** |
| **Grand Total Devarakdra Ayacut** | | | **1,43,057** | **83,900** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Dharmapuri SC | Flood Flow Canal from SRSP | 1,032 | 0 |
| | | Sri Ram Sagar Project Stage - I | 85,208 | 85,208 |
| **Total Dharmapuri (SC) Ayacut (Major & Medium)** | | | **86,240** | **85,208** |
| **Total Dharmapuri (SC) Ayacut (Minor)** | | | **28,553** | **28,553** |
| **Grand Total Dharmapuri (SC) Ayacut** | | | **1,14,793** | **1,13,761** |
| | Dornakal (ST) | Sri Ram Sagar Project Stage - I | 59,611 | 59,611 |
| | | Sri Ram Sagar Project Stage - II | 53,884 | 53,254 |
| **Total Dornakal (ST) Ayacut (Major & Medium)** | | | **1,13,495** | **1,12,865** |
| **Total Dornakal (ST) Ayacut (Minor)** | | | **21,336** | **21,336** |
| **Grand Total Dornakal (ST) Ayacut** | | | **1,34,831** | **1,34,201** |
| | Dubbak | Kaleshwaram Project | 1,27,529 | 3,226 |
| **Total Dubbak Ayacut (Major & Medium)** | | | **1,27,529** | **3,226** |
| **Total Dubbak Ayacut (Minor)** | | | **55,829** | **55,829** |
| **Grand Total Dubbak Ayacut** | | | **1,83,358** | **59,055** |
| | Gadwal | Gattu Lift Irrigation Scheme | 33,000 | 0 |
| | | Jawahar Nettampadu LIS | 1,21,639 | 95,889 |
| | | Priyadarshini Jurala Project | 11,916 | 11,916 |
| **Total Gadwal Ayacut (Major & Medium)** | | | **1,66,555** | **1,07,805** |
| **Total Gadwal Ayacut (Minor)** | | | **17,825** | **17,825** |
| **Grand Total Gadwal Ayacut** | | | **1,84,380** | **1,25,630** |
| | Gajwel | J Chokka Rao Devedula LIS | 14,728 | 1,000 |
| | | Kaleshwaram Project | 1,06,601 | 5,000 |
| **Total Gajwel Ayacut (Major & Medium)** | | | **1,21,329** | **6,000** |
| **Total Gajwel Ayacut (Minor)** | | | **38,299** | **38,299** |
| **Grand Total Gajwel Ayacut** | | | **1,59,628** | **44,299** |

| S.No | Constituency | Project | Ayacut (acres) | |
|---|---|---|---|---|
| | | | Contemplated | Created |
| | Ghanpur Station (SC) | Flood Flow Canal from SRSP | 53,444 | 0 |
| | | J Chokka Rao Devedula LIS | 1,07,648 | 47,010 |
| **Total Ghanpur (Station) (SC) Ayacut (Major & Medium)** | | | **1,61,092** | **47,010** |
| **Total Ghanpur (Station) (SC) Ayacut (Minor)** | | | **34,457** | **34,457** |
| **Grand Total Ghanpur (Station) (SC) Ayacut** | | | **1,95,549** | **81,467** |
| | Husnabad | Flood Flow Canal from SRSP | 97,064 | 21,139 |
| | | J Chokka Rao Devedula LIS | 14,487 | 14,487 |
| | | Kaleshwaram Project | 2,263 | 0 |
| | | Sri Komaram Bheem Project | 2,536 | 2,536 |
| | | Sri Ram Sagar Project Stage - I | 4,481 | 1,906 |
| **Total Husnabad Ayacut (Major & Medium)** | | | **1,20,831** | **40,068** |
| **Total Husnabad Ayacut (Minor)** | | | **30,831** | **30,831** |
| **Grand Total Husnabad Ayacut** | | | **1,51,662** | **70,899** |
| | Huzurabad | J Chokka Rao Devedula LIS | 1,270 | 1,270 |
| | | Sri Ram Sagar Project Stage - I | 83,888 | 79,772 |
| **Total Huzurabad Ayacut (Major & Medium)** | | | **85,158** | **81,042** |
| **Total Huzurabad Ayacut (Minor)** | | | **29,427** | **29,427** |
| **Grand Total Huzurabad Ayacut** | | | **1,14,585** | **1,10,469** |
| | Huzurnagar | Nagarjuna Sagar Project | 1,37,940 | 1,37,940 |
| | | Sri Ram Sagar Project Stage - II | 239 | 239 |
| **Total Huzurnagar Ayacut (Major & Medium)** | | | **1,38,179** | **1,38,179** |
| **Total Huzurnagar Ayacut (Minor)** | | | **0** | **0** |
| **Grand Total Huzurnagar Ayacut** | | | **1,38,179** | **1,38,179** |
| | Ibrahimpatnam | Palamuru Rangareddy LIS | 69,057 | 0 |
| **Total Ibrahimpatnam Ayacut (Major & Medium)** | | | **69,057** | **0** |
| **Total Ibrahimpatnam Ayacut (Minor)** | | | **24,446** | **24,446** |
| **Grand Total Ibrahimpatnam Ayacut** | | | **93,503** | **24,446** |

